# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 30 | ఆగష్టు-1974 | సంచిక 2

సెప్టెంబరు నెల

## భావ పరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

ఆగస్టు నెల

# భావపరిచయ పోటీ

*బహుమతి పొందిన వ్యాఖ్య*



*గజమువంటి భార్య గయ్యాళితనమున*
*కొట్టవచ్చె మగని కోపగించి*
*పిట్టవంటి మగడు పిక్కబలముచూపి*
*చెట్టునెక్కె నేమిచేయలేక*

—పి. యస్. శాస్త్రో

గురమ్మ పాలెం.

# గొడుగు

మూలనున్న గొడుగందుకొని గుమ్మం లోకి వచ్చి నిలబడ్డాడు రవణయ్య. సూర్యుడు ఇంద్రధనుస్సు నెక్కుపెట్టి ఒకేసారిగా వారుణాస్త్రం, అగ్నేయాస్త్రం వేసినట్టుగా ఓపక్క చినుకులు పడుతూండగా, మరోపక్క వేడిగా, వాడిగా కిరణాలు గుచ్చుకుంటున్నాయి. చినుకులు పెద్దవిపడినా, అసలు పడక పోయినా, ఎండగావున్నా, లేకపోయినా ఆ గొడుగు నెత్తిమీదో, చంకలోనో లేకుంటే రవణయ్య రోడ్డుమీద నడవడు. ఎండకెండి వానకి తడవడంవల్ల కాబోలు నల్లని గొడుగుగుడ్డరంగు విరిగి బూడిద రంగులోనికి మారింది.

బయల్దేరినపని ఆఖరయిన సిగరెట్టులా చురుక్కు మనిపించగానే గొడుగు విప్పి అడుగేసేడు... "ఒసేవ్ అమ్మడూ తలుపేసుకో" అని కేకేస్తూ.

మీదనుండి సన్నని తుంపర చల్ల చల్లగా పడుతూంటే తలెత్తి చూసేడు రవణయ్య. నల్లని మబ్బుల్తో కమ్మేసిన ఆకాశంలో తన నెత్తిమీదున్న మేరకు మాత్రం మిలమిలా మెరుస్తున్న చుక్కల్లా పురుగులు కొట్టేసిన కన్నాలు కనిపిం చేయి. 'పట్టపగలు చుక్కల్దూరుతయి నా గొడుగులో...' అనుకుని నవ్వుకో బోయిన నవ్వుకి, 'నువ్వేం తక్కు వ్వాడివా నీగొడుగేం తక్కువ తిన్నదాః' 'రమణా బియ్యే' గాడి గొంతులోపలి నుండి పలికి నవ్వు ఉండకట్టేసింది.

రమణా బియ్యేగాణ్ణి తనే చంపేసేడు. లేపోతే ఇలానే మాటిమాటికీ బతుకు దారికడ్డంవొచ్చి అల్లరి పెడుతుంటాడు. ఎన్నిసార్లు చంపేసినా అడుగడుక్కీ బతికొచ్చేసి కామెంటుచేస్తూనే ఉంటాడు. బియ్యే వెనక్కాల తగిలించుకుని కాణీ సంపాదనలేదుగానీ హాయిగా కాలక్షేపం చేస్తున్నవాణ్ణి నిజాయితీ అంటూ దారి తప్పించడానికి ప్రయత్నిస్తుంటాడు.

"నాగేశ్వర్రావుగారూ..." అంటూ పైనుండి పిలిచేడు రవణయ్య.

"ఏవిట్రా నాగేశ్వర్రావుగారూ. ఇదె

---

కొడవంటి కాళీపతిరావు

---

ప్పటినుండీ . రారా," అంటూ చాప పరచి కూర్చోమన్నట్టుగా చాపమీద కొట్టేడు నాగేశ్వర్రావు.

"శ్రీరామా ... ఆపద్బాంధవా, అనాథరక్షకా" అంటూ కూలబడి ... "ఆయ్యా కాలం మారింది. తాహతులు మారేయి, అన్నట్టు కాలం మారింది సినీమా చూసేరేవిటి...నేను సినిమా చూసి రెండేళ్ళ యుండది."

"ఓరి నీ సిగతరగా ఈ వయసులో ఇంకా సినిమా కబుర్లేవిట్రా! రామాకృష్ణా అని ఏ రామ్మజిరం కబుర్లో, పోల్టిక్సు కబుర్లో చెప్పకోక..." అని నవ్వేడు నాగేశ్వర్రావు

"ఆఁ ఆఁ నవ్వుతావు బాబూ ... ఏ కబుర్లయినా కడుపునిండిన వాళ్ళకే ...మాలాటి వాళ్ళకేవిటి ... మిమ్మల్ని సంతోషంపెట్టి మా కడుపుల నింపుకోటా నికి చూస్తాం ... లేకపోతే రెక్కాడిద్దా మన్నా డొక్కాడనివ్వదు."

"ఎన్నిసార్లు ఏడుస్తావురా...నిజవే బియ్యే అయినప్పనుండీ ఉద్యోగంలేదు. పదిహేనిరవై యేళ్ళుగా ప్రైవేట్ల మీదనే బతుకుతున్నావు. నీకన్నా లేనివాడి గురించి నువ్వెప్పుడైనా ఆలోచించావా?" అన్నాడు నాగేశ్వర్రావు.

"సరే...నా గురించి ఆలోచించటా నికే భయంగావుంది. ఇంట్లో అన్నీ నిండుకున్నాయి పైగా ఇంట్లో చిన్న కార్యం. ప్రైవేటు జీతం ఇప్పిస్తావని వచ్చేను"

"రవణయ్యా, జీతవడిగేవని కాదు గానీ మావాడు మరీ పనికిరానివాడై పోతున్నాడ్రా...ఒక్క అక్షరమ్ముక్క రాదు. ఆ బళ్లో ఏం చెప్తున్నారో...పైగా నీదగ్గర ప్రైవేటు కూడాను."

"మీరన్నారనికాదుగాని నాగేశ్వ ర్రావుగారూ...జీతవడిగేవరకూ పిల్లల బాగోగులు గుర్తుకురాని దీనస్థితిలో ఉన్నావండీ మనం. ఆ బాగోగులుకూడా డబ్బుతో లంకెపెడుతున్నాం"

"ఏంరోయ్...ఏదో తిడుతున్నట్టు న్నావ్...నిన్నన్లేదు! ఆ బళ్ళో మేస్టర్ల నంటున్నా..."

"అవును, నేనూ అదే అంటున్నా. విద్యావిధానంలోని లోపాలన్నిటికీ ఉపాధ్యాయుడికే నిందలూ, తిట్లూ... అతడు ప్రత్యక్షదైవం కాబట్టి! అది పడటానికక్కూడా అతని కార్థికంగానూ సాంఘికంగానూ ఒక స్థాయంటూ లేదు కాబట్టి. అయితే ఆ స్థితికి దిగజార్చింది మనం. ఉద్యోగాల్లేక ఎక్కడ బడితే అక్కడ గోనెపట్టాలేసుకుని నాలుగు ప్రైవేట్లు చెప్పుకునే మాలాంటి మెథడంటే ఏవిటో తెలియనివాళ్ళొకపక్క, అసలీ బళ్లెందుకున్నాయో అర్థంకాని లాభ నష్టాలు బేరీజువేసే మేనేజిమెంట్లు ఒక




వంకా, మంచి నింప్లిమెంటు చెయ్యటా నికిన్ని గోతులున్నాయని తెలిసికూడా పోస్టర్లమీద వత్తిడితెచ్చే డిపార్టుమెంటు మరో పక్కా, తమ పిల్లలు పరీక్ష పాసవడంగురించి ఆలోచించినంతగా వాళ్ళ చదువుసాములగురించి అయిదు నిమిషాలుకూడా ఆలోచించడాని కిష్ట పడని పేరెంట్లు ఇంకోపక్క ఉపాధ్యా యుల జీవితాన్ని కుక్కలు చించిన విస్తరిని చేసేసేరు. అంటే తనే ... ఏ భావిభారత పౌరుడే. నక్సలైటవ్వనీ, ఏ విద్యానిలయం ఎలా విలయతాండ వాలు చెయ్యనీ అని నిరాశ చెందిపోయి ఏ ఎండ కాగొడుగు పట్టడం నేర్చు కున్నాడు ఉపాధ్యాయుడు."

"అబ్బో...ఉపన్యాసం బాగుంది... వన్సుమోర్...," అంటూ కేకేస్తున్న రమణాబియ్యేగాడి గొంతు విన్పించేసరికి ఆవేశం కరిగిపోయింది. ఇంట్లో పరిస్థితి చప్పున గుర్తుకొచ్చింది. "నాన్నా, ప్రసాదూ...కాస్త మంచీళ్ళు పట్రాబాబూ ..." అంటూ ఇంట్లోకి తొంగిచూసి, నాగేశ్వర్రావు కొడుక్కో కేక పెట్టేడు రమణయ్య.

మంచినీళ్ళు తాగి గ్లాసు కిందపెడ్తూ, "ఆ గుర్నాధం కొడుకు కాన్వెంటులో వెలిగిస్తున్నాడు కదా...అదో వెలంవెర్రి ...డబ్బును బట్టి చదువులు...అక్క డంతా డబ్బుతోపని. ఇతగాడు చూస్తే బెల్లపువినాయకుడికి ముడ్డిగిల్లి నైవేద్యం పెట్టేరకం." అన్నాడు, నాగేశ్వర్రావు కదలికలు కనిపెడ్తూ.

"హహ్హ" అని బులుపుతీరగా గట్టిగా

నవ్వి "ఏవంటాదేవిటి?'' అనడిగేడు నాగేశ్వర్రావు కుతూహలంగా.

''ఆయన తరహావేరు. ఎందుకూ ఉన్నాయి లక్షలు. స్టేట్ బేంకీలోనూ ఉన్నాయి కట్టలు. మనకేవిటుపయోగం? ఈవి ఉండాలండీ. దానికి మీతో సరి తూగుతాడటండీ. ముఖస్తుతి అనికాదుగాని ఎప్పుడు నాకు తక్కువ చేసేరు మీరు? ఆ ప్రైవేటు జీతానికి ఓసారివెళ్తే మావిడ దగ్గర తాళాలుండిపోయే యంటాడు. మరోసారివెళ్తే చిల్లరలేదంటాడు. రెండూ వుంటే సుక్కురారం ఇవ్వరాదంటాడు. అదేం మనిషండీ, మహాప్రభో."

"బాగా చెప్పేవు. గుర్నాధం సంగతి నువ్వే చెప్పాలి రవణయ్యా..."అని మళ్ళీ గట్టిగా నవ్వి, ''ఒరే ప్రసాదూ... అమ్మనడిగి ఓ పదిరూపాయలట్రా..." అని కేకేసాడు నాగేశ్వర్రావు.

పుచ్చుకుని "మరి నేవెళ్ళొస్తాబాబూ ...ప్రసాదంబాబూ రేపు మజ్జినాళొస్తాను ప్రెయివేటుకి...ఆఁ" అంటూ గొడుగు తీసేడు రవణయ్య.

ఎక్కడా మబ్బుతునకకూడా కన్పించనీకుండా ప్లేటుఫిరాయించేసింది ఆకాశం. మేస్టారిచేత కండుజెల్లతిన్న విద్యార్థిలా ముఖం ఎర్రగాచేసుకొని చూస్తున్నాడు సూర్యుడు. ఎదురుదెబ్బలతో లోక జ్ఞానంతో వికసించిన రవణయ్యమేస్టారి తెలివితేటల్లా ఆయన గొడుగు విచ్చుకుంది.

---

"సరళ విమానంలో తప్ప పెళ్లి చేసుకోనని పట్టుబడుతున్నది. కారణమేమిటి ?

"నీకు తెలియదా? భూమి మీదఉన్న ఏ మగవాణ్నీ పెళ్లి చేసుకోనని ఆమె ప్రతిజ్ఞపూనింది."



# ఛాయ

ఆవేటి నాగమణి

"ఛాయా! ఆగు"

అతని గొంతు వింటూనే ఛాయ ఆగిపోయింది. అంతవరకు దడదడలాడిన గుండె కొట్టుకోవడం మానుకుంది. చలనంలేని బొమ్మలా నిలబడిపోయింది. నుదుటిమీదినుండి మొహంమీదికి కారుతున్న స్వేదబిందువులను తుడుచుకోవాలనికాని, జారిపోతున్న పైటను సరిచేసుకోవాలనికాని, చెదరిన జుట్టును సరిచేసుకోవాలనికాని తోచలేదు. పులినోటినుండి సింహం బోనులోపడ్డట్టుగా వుంది. మెదడు మొద్దుబారిపోయి ఆలోచించడం మానుకుంది.

"ఈ చీకట్లో ఒంటరిగా పోగలరా?" అతను దగ్గరగా వచ్చి ప్రశ్నించాడు.

ఛాయ మాట్లాడలేదు.

"ఊఁ......పదండి!" అన్నాడు. ఛాయ కదల్లేదు.

"మిమ్మల్ని మీ యింటిదగ్గర దిగబెడతాను!" అత నెంతో మృదువుగా అన్నాడు. ఛాయ కళ్ళు ఎత్తి చూసింది. ఆమె కళ్ళలో అనుమానం, భయం.

"నేను రమాపతిరావును కాన," అన్నా డతను ఆమెకళ్ళలోని అనుమానాన్నీ భయాన్నీ చూసి.

ఛాయ అనుమానంగా కళ్లెత్తి చూసింది. ఆమె కళ్ళలో అసహ్యం, జుగుప్స.

"ఎదుటివాళ్ళ మన స్తత్వాలను, మొహం చూసి గుర్తించే శక్తివుంటే...... మీరు ఈనాడు యిలాంటి పరిస్థితులలో చిక్కుకునేవారేకాదు. పదండి! నేను మనిషినే కాని...రాక్షసుణ్ణి కాను," అన్నాడు. ఛాయ. ఏదో అనాలనుకుంది. అతను తనవంక చూడ్డంలేదు. మరెటో చూస్తున్నాడు. ఛాయ క్షణంసేపు ఆలోచించి కదిలింది.

అతను పక్కనే అడుగుదూరంలో నడుస్తున్నాడు. రెండుచేతులను ప్యాంటు జేబుల్లో పెట్టుకొని, దీర్ఘంగా ఆలోచిస్తూ మౌనంగా నడుస్తున్న అతని ఆరడుగుల విగ్రహాన్ని చూస్తూ, ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా నడుస్తోంది.

రోడ్డుపైకి రాగానే, టాక్సీని ఆపాడు అతను. సంకోచిస్తున్న మనసును అదిమిపట్టి, లేని ధైర్యాన్ని మోహంలోకి తెచ్చుకుంటూ, మౌనంగా టాక్సీలో ఎక్కింది ఛాయ.

"యిక మీరు వెళ్ళగలుగుతారు కదూ?" టాక్సీవాడికి డబ్బులిచ్చి పంపేసి, సందుచివర నిలబడి అడిగాడు అతను. ఛాయ తలూపింది.

"ఒక్క విషయం—ఇవాళ జరిగింది—మర్చిపోండి. అంతేకాదు మరెన్నడూ ......అవసరం ఎంత బాధించినా, రమాపతిరావుదగ్గరికి మాత్రం వెళ్ళకండి! ఎందుకంటే – మీలాంటివాళ్ళు వెళ్లేచోటు కాదది. శలవ్?" అతను గబగబా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

ఛాయ క్షణంసేపు అక్కడే నిలబడి, అతను వెళ్ళినవైపు చూసింది.

"అక్కా!" బాలు పిలుపుకు ఉలిక్కిపడింది ఛాయ.

"యిక్కడే నిలబడిపోయావేం అక్కయ్యా?" అన్నాడు బాలు.

"ఊ(......" అంటూ సమాధానం చెప్పకుండానే కదిలింది.

"ఇవాళ ఆలస్యం అయిందేం అక్కయ్యా?" అడిగాడు బాలు.

"అత్తయ్య పడుకుందా బాలు?" అంది సమాధానం చెప్పకుండానే

''లేదక్కా! యింతవరకు ఇష్టంవచ్చినట్టు నిన్ను తిట్టింది," ఎంతో బాధ పడుతూ చెప్పాడు బాలు.

''పోనీలే బాలూ! మరి ఆలస్యం అయింది కదూ!"

"ఆలస్యం అయినందుకు కారణం నిన్ను అడక్కుండానే, తనకు తోచినట్టు ఏమిటేమిటో అనుకుంటూ తిట్టడం బావుంటుందా అక్కా!" బాలు గొంతు గాద్గదికమైంది.

వరలక్ష్మి ఏమేం తిట్టిందో బాలు చెప్పకముందే ఛాయ ఊహించుకోగలదు. అందుకే బాలు బాధను అర్థంచేసుకోగలిగింది.

నిశబ్దంగా తన గదిలోకెళ్ళిన ఛాయవెనకే వెళ్ళింది వరలక్ష్మి.

"ఏమ్మా! ఉద్యోగం చేయడం అయిపోయిందా? రోడ్లు తిరగడం పూర్తయిందా? హవ్వ! ఆడపిల్ల ఉద్యోగం అర్ధరాత్రివరకు చేస్తుందంటే ఏ వెధవైనా నమ్ముతాడా? నువ్వింతవరకు రావుగారింట్లోనే వున్నావటే ఛాయా?"

''నేను యింతవరకు రావుగారింట్లోనే వున్నాను అత్తయ్యా," నెమ్మదిగా అంది ఛాయ.

"హవ్వ! ఎంత గుండెల్దీసిన దానివి కాకపోతే ఈ సమాధానం యింత నిబ్బరంగా చెబుతావే? ఆయనేం వెర్రివాడా? పెద్దమనిషి కాడూ! అంత పెద్దమనిషి నాతో, మీఅమ్మాయి ఏడుదాటిందంటే మీయింట్లో వుంటుందని ఎంతోమర్యాదగా నమ్మకంగా చెప్పాడు. అయినా ఆయనింట్లో యింతవరకు వుండి ఏంచేసావ్?''

"చావకుండా బ్రతికి వచ్చానత్తయ్యా!" అని చెప్పాలనిపించింది ఛాయకు. కాని వరలక్ష్మి నమ్మదు. చెప్పిన విషయాన్ని మరింతగా పెంచుతుంది. అక్కడ జరిగిన విషయం చెబితే-బహుశా తనను ముందుగా వెలివేసే వ్యక్తి ఆమే అవుతుంది. ఈ ఒక్క రాత్రికూడా తనకు శాంతి దొరకదు. బ్రతుకు మీద అసహ్యం. విరక్తి పెరిగిపోయేలా చేస్తుంది. తన బ్రతుకు బరువైపోయి, ఒక్క క్షణం ఊపిరిపీల్చుకోలేనంత ఇరుకుగా చేసేశక్తి వరలక్ష్మి నోట్లో వుంటుంది. ఆమె నోట్లో ఏ చిన్న విషయం దాగదు. ఫలితంగా ఆ వీధిలోని వాళ్ళకు ఆ యింటి వ్యవహారం అంతా తెలుసు. అలాంటప్పుడు, తను చెప్పే విషయం నిమిషాల్లో మంటలా ఆ వీధంతా వ్యాపిస్తుంది. తను చెప్పే నిజం ఎవ్వరూ నమ్మరు. నమ్మనివాళ్ళను ఒప్పించి నమ్మించలేక, తను...... చచ్చిపోవాలనుకుంటుంది. కాని......తను బ్రతకాలి. ఒక్క బాలుకోసమే కాదు, అక్కా, అనిపిలుస్తూ, తనే సర్వస్వంగా నిలిచిన బాలుకోసమే కాదు, — చీకటి అలుముకుంటున్న తన జీవితంలో ఏనాడో వెలుగు వస్తుంది. ఆవెలుగుకోసం ఈచీకటిని భరిస్తుంది. వరలక్ష్మి తిట్లనే కాదు, రమాపతిరావులాంటి వాళ్ళతో సైతం, ప్రాణం పోయేవరకు పోరాడుతుంది. చివరికి...... ఓటమే తనకు వరంగా మారితే-ఆనాడు...ఆనాడు తను చచ్చిపోతుంది. ఛాయ కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగి బుగ్గలమీదుగా జారిపోసాగాయి.

"అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా ఏడుస్తావేమే?"

"వరాలు!'' శాస్త్రి పిలుపుకు విసుక్కుంది వరలక్ష్మి.

"బస్సు అందలేదేమో! వచ్చింది కదుటే-ప్రొద్దున్నుండి అక్కడ చాకిరీచేసి వస్తే అన్నం తిననీకుండా ఏమిటీ?" అన్నాడు మెల్లగా.

''ఆ......ఆ...... అనుకుంటూనే వున్నాను. యింకా అడ్డుకోలేదేమో అని! మీరిలా అడ్డుకుంటుంటే అది మరీ బరితెగించి ఎప్పుడో ... చెడిపోతుంది నలుగురికి మోహం చూపించలేక......ఉరేసుకు చావాలి," అంది.

''అలాంటి స్థితే వస్తే......ముందుగా నా మొహం మీకు చూపించకుండా, నేనే మా అమ్మను వెతుక్కుంటూ వెళ్ళిపోతాను అత్తయ్యా," మెల్లగా గొణుక్కుంది ఛాయ.

"ఊ......అన్నీ వంటింట్లో తగలడ్డాయి. తినమ్మా వెళ్ళి! చెబుతున్నాడుగా? ఆ కుంటివెధవకూడా తిన్లేదు,'' అంటూ వరలక్ష్మి వెళ్ళిపోయింది.

"బాలూ! నువ్వింకా తిన్లేదూ? నీ కెన్నిసార్లు చెప్పారా తినమని...' అంది ఛాయ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ!

"అక్కా! కష్టపడి, వెట్టిచాకిరిచేసి నువ్వు సంపాదిస్తుంటే తింటూ, పైగా ఈ సాధింపు ఏమిటక్కా? ప్రతిరోజు నిన్ను ఏడ్పించకుండా వదలదు," అన్నాడు బాలు ఏడుస్తూ.

"ఛ......అలా అనకూడదు బాలూ! నా సంపాదన మనకే అవుతుందిరా! మామయ్య పెన్షను రావడంలేదూ,'' అంది.

''ఊ......'' అంటూ కదిలాడు బాలు

"రేయ్ బాలూ! త్వరగా తిని నిద్రపోరా తండ్రీ! ఆ వెధవ కర్ర చప్పుడుకు నిద్దరావడంలేదు. యింతవరకు అక్కా, అక్కా అంటూ కర్రల చప్పుడుచేస్తూ నిద్రపోనీయకుండా చంపేసావు" అంది వరలక్ష్మి కోపంగా అరుస్తూ.

బాలు బాధగా తలవాల్చుకున్నాడు. ఛాయ, బాలుకు ఆసరాయిస్తున్న కర్రలను ఓ మూలకు పెట్టి తను ఆసరాగా వంటింట్లోకి తీసికెళ్ళింది.

"అక్కయ్యా! నాకు ఏదైనా పని వుందేమో రావుగారిని అడుగు అక్కా! నీ సంపాదనమీద ఆధారపడ్డానని కాదు. ఈ రాక్షసి అస్తమానం తిడుతూ వుంటుంది. ఒక్కోసారి...... చచ్చిపోవాలనిపిస్తుంది అక్కా!'' అంటున్న బాలు మాటకు ఛాయ మాట్లాడలేదు. బాలు చాలాసార్లు ఈ విషయం చెప్పాడు. కాని ...... రేపటినుండి తనకే ఉద్యోగం లేదు. అత్తయ్య కీ విషయం చెప్పలేదు. చెప్పినా లాభంలేదు. తనే తిరిగి మళ్ళీ వెతుక్కోవాలి! ఎక్కడని

వెతుకుతుంది? ఎవరిస్తారు? భగవాన్! ఉద్యోగం చేసి, రమాపతిరావుగారి పిల్లలకు ఆయాగా చాకిరీచేస్తూ సంపాదించే రెండువందలూ తెచ్చి వరలక్ష్మి చేతుల్లో పోస్తుంటేనే చివాట్లు, తిట్లు తప్పడంలేదు. యిక సంపాదన లేదని, ఉద్యోగం పోయిందని చెబితే......ఎందుకు పోయిందో కారణం చెబితే ... ఊహు... తను చెప్పలేదు. చెప్పదుకూడా! ఆలోచిస్తూ రేపు ఎలాగడుస్తుందా అని ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయింది ఛాయ.

"నన్నేం చేయమంటావ్ ఉమా! అత్తయ్యకు నిజం చెప్పలేను. ఆవిడ అర్థం చేసుకోదు. పైగా అరిచి, నలుగురినోట్లో పడేస్తుంది. కాని నిజం చెప్పకుండా, నెలరాగానే జీతం ఎక్కడినుండి తీసికెళ్ళి ఇవ్వను." ఛాయ బాధగానిట్టూర్పుతూ అడిగింది.

''ఛాయా! ఓ పనిచేస్తావా? మా వీధిచివరవున్న డాబాయింట్లో కమలమ్మ గారున్నారు-వాళ్ళాయన ఏదో సబ్బుల కంపెనీలో పనిచేస్తున్నాడు. ఈ మధ్య వాళ్లేదో కొత్త సబ్బు బజార్లోకి తెచ్చారట. సేల్స్‌గరల్స్ కావాలని పేపర్లో కూడా యిచ్చారట. ఈ మధ్య చాలామంది అమ్మాయిలు వాళ్ళింటికి వస్తున్నారు. నువ్వు......" అంటూ ఆగిపోయింది.

"ఏం చేయాల్సివుంటుంది?" అంది ఛాయ.

''వాళ్ళు రోజుకో వీధిపేరు చెబుతారు. ఆరోజుకు కావల్సిన స్టాకు అందిస్తూనే వుంటారు. మనం యింటింటికి వెళ్ళి అమ్మాలి! రోజుకు మనకు యిచ్చే ఎనిమిది రూపాయల జీతమేకాక, అమ్మినదానిపై కమీషను అంటూ యిస్తారు. మన అమ్మకంపై ఆధారపడివుంటుంది కమీషను. కొన్నిరోజులు యిలా చేస్తూ ఏదైనా ఉద్యోగ ప్రయత్నంచేస్తే......" అంది ఉమ.

''ఊఁ'' అంది సాలోచనగా.

"నాకిప్పుడు కాలేజికి సెలవు కదూ! అందుకని నేను వెడుతున్నాను. నేను ఇతగా వుంటాను. అంతగా......'' అంటున్న ఉమ మాటలకు నవ్వి – "నాకు భయం, సంకోచం పనిచేయడానికేం అడ్డురావు ఉమా! కాదంటే మనుషుల్లా కనిపించే రాక్షసులను చూస్తే చీ......పద'' అంది ఛాయ.

ఉమ చెప్పడం వల్లనైతేనేం, ఛాయ అందంగా వుందన్న విషయం గమనించి కమలమ్మ భర్త సరేనంటూ తలూపాడు. అందమైన అమ్మాయి తలుపుతట్టి పలకరించినప్పుడు అవసరంలేకున్నా, కొనుక్కుంటారన్న నిజంతెలిసిన అతను. ఛాయకు పని వివరాలు చెప్పి, స్టాక్ అప్పగించాడు. ఓ ప్లాస్టిక్‌బాగ్, సబ్బులు

ఫ్రీగిఫ్ట్లు. ఫాంప్లెట్లు అన్నీ యిచ్చాడు. అన్నీ బ్యాగులో సర్దుకొని ఉమతో, బయల దేరింది ఛాయ.

మెల్లిగా తలుపుతట్టి నిలబడింది ఛాయ. లోపలినుండి, ఎవరిదో మగగొంతు విన్పించింది మరో రెండునిమిషాలకు తలుపు తెరుచుకుంది చేతిలోనిఫాంప్లెట్లను అందించి, సబ్బుగురించి వివరించి చెప్పడానికి, "చూడండి ఈ సబ్బు ......" అంటూ తలెత్తి గుమ్మంలోపల నిలబడ్డ వ్యక్తిని చూస్తూనే నిశ్చేష్ట అయిపోయింది ఛాయ.

"ఓహ్..." అంటూ నవ్వి, "లోపలికి రండి" అన్నాడు.

ఛాయ కదల్లేదు.

"భయపడుతున్నారా! భయం వుంటే ఈ ఉద్యోగం చేయడం కష్టం." అన్నాడు. చివ్వున తలెత్తి చూసింది ఛాయ.

"రండి" అంటూ లోపలికి వెళ్ళాడు. ఛాయకు అతని ముందు ఓడిపోవటం ఇష్టంలేదు. ధైర్యంగా లోపలికి వెళ్ళింది.

"కూర్చోండి!" అంటూ కుర్చీచూపించి, కూజాలోనుండి గాజుగ్లాసులో మంచినీళ్ళు వొంపి యిచ్చాడు. అసలే ఎండ, పైగా తిరగడంవల్ల, ఛాయకు ఆకలి, దాహం రెండూవేస్తున్నాయ్! సరిగ్గా అలాంటిసమయంలో అతనుయిచ్చిన చల్లని నీరు అమృతంగా కన్పించడంతో గబుక్కున అందుకొని తాగేసింది

"యింకా కావాలా?" అతని ప్రశ్నకు తలూపింది.

"ముందుగా ఇవి తినండి!" అంటూ ప్లేట్లో బిస్కెట్లు పెట్టియిచ్చాడు.

"ఊహుఁ...... మంచినీళ్లు ఇవ్వండి చాలు" అంది.

"ఆకలిని చంపడం ... ఆరోగ్యానికి మంచిదికాదు!" అతనెంతో మృదువుగా అన్నా, ఛాయలోని అభిమానం దెబ్బతింది.

"నాకు ఆకలిగా లేదు. థ్యాంక్స్!" అంటూ లేచిరాబోయింది.

"వచ్చిన పని కాకుండానే వెళ్ళిపోతారా?" అంటూ గుమ్మానికి అడ్డంగా నిలబడి, "ఈ ఉద్యోగం మీకు సరిపడదు ఛాయా!" అన్నాడు నెమ్మదిగా.

"ఎందుకు?" కోపంగా అడిగింది.

"అందమైన అమ్మాయిలకు, అందులోను ఆత్మాభిమానంగల మీవంటి అమ్మాయిలు ఈ ఉద్యోగం ఎంతోకాలం చేయలేరు. మీకు ఈ ఉద్యోగంతప్ప మరేదీ దొరకలేదా?" అన్నాడు జాలిగా. అతని జాలిని భరించలేక పోయింది ఛాయ.



"మరేదో... ... ఎలా దొరుకుతుంది? అర్హతలకు విలువ ఇవ్వకుండా కేవలం రికమెండేషన్లకు విలువ యిస్తున్న ఈ రోజుల్లో నాబోటి సామాన్యులికి, అతి సామాన్యమైన ఏ చిన్న ఉద్యోగం దొరకదు దొరికినా ఉద్యోగాలు పొదులుకునేలా రాబందుల్లా వెంటపడే......రాక్షసులను తప్పించుకుంటూ... నాలాంటి వాళ్ళు యిలాంటి ఉద్యోగాలు చేయక మరేంచేస్తారు?'" విసురుగా కసిగా అడిగింది ఛాయ.

"ప్రతిసారి తప్పించుకోగలవా ఛాయా?" నవ్వుతూ అడిగాడు.

"అంటే"—సూటిగా అతనివంకే చూస్తూ అడిగింది.

"వివరించి చెబితే బాధపడతారు! కాని ... చొరవతీసుకొని మరోసారి మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. మీరీ ఉద్యోగం మానుకోండి."

అతని మాటలు పూర్తికాకముందే ఛాయవిసురుగా లేచి బయటికి వచ్చేసింది.

అప్పుడే అటుగా వచ్చిన ఉమ, ఛాయ ముఖంలోని కోపాన్ని చూసి, "ఏం జరిగింది?'' అంది గడిచిన ఐదురోజుల్లో ఛాయ మొహంలో కోపంచూడని ఉమ.

"ఏంలేదు పద..." అంది ఛాయ.

ఉమ మరో యింటివైపు దారితీసింది కాని, ఛాయ అక్కడేనిలబడిపోయింది అతని మాటలు చెవుల్లో గింగుర్లెత్తిపోతుంటే ఆలోచనలలో మునిగిపోయిన ఛాయ, హఠాత్తుగా తలతిప్పి అతని గదివైపు చూసింది. గుమ్మంలో నిలబడి దీక్షగా, పరీక్షగా తనవంకే చూస్తున్న అతణ్ణి చూస్తూనే ఉలిక్కిపడుతూ, గబ గబా ముందుకు కదిలి వెళ్ళిపోయింది ఛాయ. అతని చూపునీడలా వెంటాడుతూ, మాటలు చెవుల్లో హోరెత్తిపోసాగాయి

"ఛాయా!" వరలక్ష్మి పిలుపుకు అప్పుడే యింట్లోకి అడుగు పెడుతున్న ఛాయ తలెత్తి చూసింది. కుర్చీలో కూర్చున్న వ్యక్తిని చూస్తూనే ఉలిక్కిపడిపోయింది.

"నమస్కారం రాఘవగారూ!" అంది వీలైనంత వరకు నవ్వును పెదవుల మీదికి తెచ్చుకుంటూ.

"ఊఁ..." నీ కిది మర్యాదగా వుందా ఛాయా! పెద్దమనిషి అన్న గౌరవం లేకుండా, కనీసం ఉద్యోగం మానేస్తున్నానన్న విషయం కూడా చెప్పకుండా మానేస్తే, మరో మనిషిని-కుదుర్చుకోలేక, నువ్వు వస్తావేమోనని, ఆ పిల్లలు ఎదురుచూస్తూ ఈ ఐదురోజులు ఎలా గడిపారో, ఎంత ఇబ్బందిపడ్డారో ఆభగ వంతుడికే తెలియాలి సమయానికి మా అమ్మాయి అత్తారింటినుంచి వచ్చింది కాబట్టి సరిపోయింది" అని అంటున్న రాఘవ మాటలకు ఛాయ మాట్లాడలేదు.

"బాబుగారు ఊళ్ళోలేరు ఇవాళే మధ్యాహ్నం వచ్చారు. నీ గురించి అడిగితే, ఏదో కారణం చెప్పాను. రేపటి నుండి వస్తుందని చెప్పాను" రాఘవ సాభి ప్రాయంగా ఛాయవంక చూస్తూ అన్నాడు. ఛాయ చటుక్కున తలెత్తి తల అడ్డంగా ఆడిస్తూ "నేను రాను" అంది.

"అవును ఎలా వెళ్తావే! ముష్టిదానిలా ఇంటింటికి తగుదునమ్మా అని నలుగురి మగాళ్ళతో మాట్లాడుతూ వుంటే ఈ ఉద్యోగం బావుంది! యిలాంటి ఉద్యోగం వొదులుకొని ఎలా వస్తుంది? పరువుగా బ్రతికే మమ్మల్ని యిలా బ్రతకనీయవే ఛాయా! ఎందుకలా మా ప్రాణాలు తీస్తావ్! కాదంటే కాస్త విషం అయినా తెచ్చి పెట్టు. నేను ఆయనా వెళ్ళిపోతాం! అప్పుడు నీ యిష్టం వచ్చినట్టు తిరుగు. ఆ కుంటివెధవ నీకు వంతపాడేవాడే," అంది కోపంగా అరుస్తూ.

ఛాయ తలవాల్చుకొని విగ్రహంలా నిలబడింది.

"ఏమంటావ్ ఛాయా?" రాఘవ ప్రశ్నించాడు

"ఊహుఁ...నేను రాను," అంది దృఢంగా.

"సరే. చేతికి వచ్చిన అవకాశాన్ని వొదులుకుంటున్నావ్ ఛాయా! ఆలో చించుకో! బాబుగారు తలచుకుంటే, నీ భవిష్యత్తేకాదు, నీ కుంటితమ్ముడి భవిష్యత్తూ బంగారు బాటలా మారుస్తాడు. ఆయన తలచుకుంటే— నిన్ను ఏమైనా చేయగలడు. నీలాంటి ఆయాలను నిన్ను మించిన వాళ్ళను తేగలడు. కాదంటే— మీ అత్తయ్య బ్రతిమాలిందనే దయ, జాలితో నిన్ను బాగుపరుద్దామనుకుంటున్నాడు. నీ యిష్టం. రేపు పదివరకు నీకు గడువుంది" అంటూ లేచాడు రాఘవ.

"క్షమించండి రాఘవరావుగారూ! బాబుగారికి అనవసరంగా అంత దయ చూపించాల్సిన అవసరం లేదు. యింతవరకు వారు చూపించిన దయకు కృతజ్ఞురాలిని. మరో ఆయాను కుదుర్చుకోండి . . . నేను . . . రాను" అంది.

"చూసావుటమ్మా! సిరిరా మోకాలు అడ్డుపెట్టుకున్నట్టు అమ్మాయి వ్యవహారం ఏదో పెద్దముండావాణ్ణి వచ్చి అడిగినందుకైనా రావాలికదూ! ఏదో తండ్రి లాంటివాణ్ణి."

"రాఘవగారూ!" గట్టిగా అరిచింది ఛాయ. "ఆ మాట అనడానికి మీకు సిగ్గువేయటం లేదూ?" అంది కటువుగా.

"హవ్వ ... అమ్మ... ఏమిటే ఆ మాటలు?" అంది వరలక్ష్మి.

"నువ్వూరుకో అత్తయ్యా! వీరి సంగతి నీకు తెలీదు," అంటూ ఉరిమి చూస్తూ "వెళ్ళిపోండి! మళ్ళీ ఈ గడప తొక్కారో ... నేను ఆడదానినన్న విషయం మర్చిపోయికాని యిక్కడకు రాకండి" అంది ఛాయ విశాలనేత్రాల్లో కదిలే కోపం చూస్తుంటే మరికాసేపయితే, అపరకాళిలా మారి తన గుట్టు బయటపెడుతుందని గ్రహించి, వరలక్ష్మివైపు తిరిగి "సరే, నేను వెళ్తున్నానమ్మా వరలక్ష్మి. రేపు ..." అంటూ కళ్ళతో సైగచేసి వెళ్ళిపోయాడు.

అత నలా గుమ్మం దాటాడోలేదో, ఛాయమీద తుఫానులా విరుచుకుపడింది వరలక్ష్మి.

"నీ కెంత పొగరుకాకుంటే, అతణ్ణలా అంటావే! ఏదో నేను బ్రతిమాలాననే కదూ అతను నీకు ఉద్యోగం యిప్పించాడు. అసలు నువ్వీ ఉద్యోగం ఎందుకు మానేసావ్? ఐదు రోజులుగా ఎక్కడెక్కడ తిరుగుతున్నావ్? మాటమాత్రంగానైనా నాతో ఎందుకు చెప్పలేదు? హవ్వ! అతనొచ్చి, మీ ఛాయ పన్లోకి రావడం లేదని చెబుతుంటే నోరు తెరిచాను? అడ్డమైనవాళ్ళతో రోడ్లు తిరగడం నేర్చుకొని, పొందికగా ఓ చోట ఉద్యోగం చేయమంటే ఎలా చేస్తావ్?" నోరు చించు

కొని మరీ అరవడం మొదలుపెట్టింది వరలక్ష్మి. ఆమె చేసే అల్లరికి పక్కింటి పార్వతమ్మ, సుందరమ్మ పనిలేకున్నా మరీ వచ్చి ఏమిటేమిటంటూ, వరలక్ష్మిని ప్రశ్నిస్తూ అడుగుతూవుంటే, ఛాయ అక్కడ నిలబడలేక, తన గదిలోకి వెళ్ళిపోయింది. వరలక్ష్మి రాగాలుతీస్తూ, విషయమంతా చెబుతోంది వాళ్ళతో

"అవును వదినా! మొన్న మా అబ్బాయి చూసాడట. ఎవరింట్లోకో వెళ్ళి నబ్బులు అమ్మడం. నాతో వచ్చి చెప్పాడు. నేను నమ్మలేదు. ఎంచక్కా రావు గారింట్లో పనిచేసుకోక యిలా తిరుగుతుందేమిటి? ఆడపిల్ల, అలా పరాయి యిళ్లలో తిరుగుతూవుంటే మంచివాళ్ళు వుంటారు చెడ్డవాళ్ళు వుంటారు." అంది పార్వతమ్మ.

"కాదు మరీ! తీసుకొంటాం లోపలికి రమ్మని తలుపులు మూస్తే ఏంచేస్తుంది. అయినా ఆడపిల్ల కీ తెగువ ఎందుకు? అంతకంటే మరో మంచి ఉద్యోగం దొరకదనా?" అంది సుందరమ్మ.

"పాపం! పదేళ్ళుగా ఈ పక్కింట్లో వుండి చూస్తున్నాగా? ఎంతో పరువుగా బ్రతికే మీకు రేపు ఏదైనా అఘాయిత్యం జరిగితే పరువేమైనా వుంటుందా?"

"ఆ . . . అవన్నీ ఆ అమ్మాయికి తెలీవనా, సరదా . . . పడిచేస్తుంది. అయినా ఈ కాలం పిల్లలకు మనం ఏంచెబితె నచ్చుతుంది వదినా! పెళ్ళిళ్ళు కాకుండానే తల్లులవుతున్నారు. ఈ ఛాయ కూడా ఎప్పుడో అలాంటి పాడుపని చేయదూ?"

"ఆ అమ్మాయి చేయకున్నా, అలా యిల్లు యిల్లు తిరుగుతుంటే ఎన్నో అఘాయిత్యాలు జరుగుతున్న ఈ రోజుల్లో. . ."

"ఎంత కష్టం వచ్చింది వదినా!" అంది నీళ్లునిండాని కళ్లను తుడుచుకుంటూ పార్వతమ్మ.

"అయినా పెంచిన అత్తయ్యవి. అమ్మలాంటిదానివి అమ్మాయిని నయానో భయానో వొప్పించి, రావుగారి దగ్గరికి పంపించు." నీ మాట వింటుందేమో చూద్దాం. అన్న ధోరణితో అంది సుందరమ్మ.

"అది వెళ్లనంటూ గట్టిగా ఆ పెద్దమనిషిముందే చెప్పింది" అంది వరలక్ష్మి.

"నీ మీద ఆ మాత్రం గౌరవం లేకుంటే, మీ యింట్లో మాత్రం ఎలా వుంటుంది? తన తమ్ముడ్ని తీసుకొని వెళ్ళిపొమ్మని చెప్పు . . అప్పుడు కాని తెలిసిరాదు."

"అయినా మీకడుపున పుట్టిన బిడ్డకాదుగదా! వెళ్లమనండి. బతుకు కుక్కలు చింపిన విస్తరి అయ్యాక కాని తెలిసిరాదు.'' అంది సుందరమ్మ.

''ఛాయా!'' శాస్త్రి పిలుపుకు రెండుమోకాళ్లమధ్య తలానించి ఏడుస్తున్న ఛాయ చటుక్కున లేచినిలబడుతూ, "నువ్వింకా నిద్రపోలేదు మామయ్యా?" అంది.

''నేను ఓ రాక్షసుడిలా కన్పిస్తున్నానా ఛాయా?" శాస్త్రి ప్రశ్నకు తలెత్తి చూసింది. అతను దగ్గరగా వచ్చి తల నిమురుతూ, ఛాయా! నువ్విలాఏడుస్తుంటే ఏడుస్తున్నావని తెలిసికూడా ఎలా నిద్రపోగలనమ్మా?" అన్నాడు.

' ఛాయా! పెంచమంటూ ఎంతో నమ్మకంతో మీనాన్న నా కప్పగించాడు. కాని... ఆ నమ్మకాన్ని నేను నిలుపుకోలేకపోయాను."

"ఆదేమిటి మామయ్యా'' అంటూ ఏదో అనబోయింది.

"నాకు తెలుసుతల్లీ! దిక్కులేని అనాధలు ఎలా పెరుగుతారో అలాగే మీరూ పెరిగారు. పేరుకు మేమున్నామే కాని ..ఛాయా! ఆప్యాయత, ఆదరణఅనేవి నీకుకాని బాలుకుకాని లభించాయా! మీఅత్తయ్య మరీ రాక్షసిలా..."

"పాపం! అత్తయ్యమాత్రం ఏమంటుంది మామయ్యా! అమ్మ వుంటేమాత్రం ఆ మాత్రం అనకుండా వుండేదా?"

"హు . . . నాకు తెలీదనుకుంటున్నావా ఛాయా! సరేకాని. ఏంజరిగింది." అన్నాడు. ఛాయ ఉలిక్కిపడింది ఆ ప్రశ్నకు.

"ఎందుకు వెళ్ళనంటున్నావ్ రావుగారింటికి?'' అన్నాడు.

ఛాయ వెంటనే సమాధానం చెప్పలేదు.

"రావు మంచివాడు కాదు. రాఘవకూడా! నాకా విషయం తెలుసు తల్లీ. అందుకె...నేను...అర్థం చేసుకున్నది తప్పుకాదుగదూ?" అన్నాడు.

''సరే వెళ్లకు ఛాయా! నీకిష్టమైనట్టేకానీ ... కాని చూడమ్మా అక్కడ జరిగింది మర్చిపో! సురక్షితంగా యిల్లుచేరావ్! ముందు ముందు ఎలాంటి పరిస్థితులు ఎదురవుతాయో ... జాగ్రత్తగా ధైర్యంగా ఉండడం అవసరం. అత్తయ్యకు నేను నచ్చచెబుతాను. అక్కడ జరిగిందేదీ అత్తయ్యకు చెప్పకు. అల్లరిపెడుతుంది,'' అంటూ భుజం తట్టి, ''నిద్రపో ఛాయా! బాధపడి ఏం చేస్తావ్ అమ్మా! " అన్నాడు.

మరో రెండురోజులు గడిచేసరికి ఛాయ ఆ ఉద్యోగం వొదులుకోవాల్సి వచ్చింది. ఒంటరిగా ఆడపిల్ల అలా యింటిగుమ్మంలో నిలబడితే అర్థంచేసు

కునేవారులేక, అవహేళనా దృష్టితో అవమానించడానికి సిద్ధపడ్డవారినుండి అతికష్టంగా తప్పించుకుంది ఛాయ

ఆరోజు . . . ఓ గది ముందు నిలబడింది. గుమ్మంలో నిలబడ్డ ఇద్దరు యువకులు ఎంతో మర్యాదగా మాట్లాడి, ఛాయ చెప్పేదంతా అతి శ్రద్ధగా విన్నారు.

"రండి సిస్టర్! తీసుకుంటాం! మీరింతగా చెప్పాలా" అంటూనే ఒకతను పక్కకు తప్పుకోగానే మరొకతను ఛాయ అందిస్తున్న సబ్బుబిళ్లతో పాటు ఆమెచేతినిపట్టి బలంగా లోపలకు లాగాడు. ప్రక్కకు తప్పుకున్న అతను తలుపు మూసాడు. తలుపుమూసి వీపుఆనించి, హేళనగా నవ్వుతూ "చాలా అందమైన అమ్మాయి, బ్రదర్!" అన్నాడు.

"ఊఁ . . . రంగబాయి యింట్లోవున్న అమ్మాయిల్లో ఏ ఒక్క అమ్మాయి కన్నా యింత అందం వుందంటావా?"

"ఛ . . . అవి రేకులు రాలిపోతున్న పువ్వులు. ఇదింకా విచ్చుకోనిపువ్వు."

"ఏం మేడమ్ . . " అంటూ భుజంమీద చేయివేసిన ఒకతని నుదుటికి సబ్బుబిళ్ల బలంగా తాకింది. ఒక్క అడుగు వెనక్కివేసిన అతను కోపంగా చూస్తూ ఛాయ చేతిని వొడిసిపట్టబోయాడు కాని, అప్పటికే ఛాయ కాలితో తన్నిన చిన్నస్టూల్ అతని అడుగులకు అడ్డుపడి కిందపడ్డాడు. అంతవరకు తమాషా చూస్తున్న మరొకతను ముందుకు రాబోయాడు.

"రాస్కెల్! సిగ్గులేదూ? సిస్టర్ అని పిలిచి, యింత నీచానికి దిగజారిన సంస్కారం తెలీని మీకు పశువులకు తేడా ఏమిటి? . . . మర్యాదగా తప్పుకో" అంది గట్టిగా.

అతను వెకిలిగా నవ్వాడు. హఠాత్తుగా వచ్చి రెండు చేతులతో ఛాయను చుట్టేసాడు. క్రిందపడ్డ అతనుకూడా లేచి వెనకనుంచి ఛాయనోరు మూసాడు. కాని దైవవశాత్తుగొళ్లెంవేయని తలుపులు గాలికి తెరుచుకున్నాయి. అటుగావచ్చిన ఉమ కెవ్వున కేకవేసి అరవడంతో, రేయ్ రాస్కెల్ తలుపులు వేయలేదురా అంటూ, ఇద్దరూ ఒకేసారి ఛాయను వొదిలి పరిగెత్తేలోగానే ముగ్గురు నలుగురు అమ్మాయిలు మూస్తున్న తలుపులు మూయనీయక అరిచారు. చుట్టుపక్కలజనం వస్తారని ఛాయను ఇవతలికి తోసేసి తలుపులు మూసుకున్నారిద్దరూ.

కాని జరగవలసినంత అల్లరి జరిగింది. దగ్గిరేవున్న పోలీస్ స్టేషన్‌నుండి ఇద్దరు కానిస్టేబుల్స్ వచ్చి స్టేషన్ వరకు తీసికెళ్లారు.



ఫలితంగా ఛాయ ఆ ఉద్యోగాన్ని వొదులుకుంది. తనకు రావలసిన డబ్బులు యిచ్చేసి, యిక రావొద్దని చెప్పడంతో ఛాయ మెల్లగా అడుగులో అడుగులు వేస్తూ యింటికి వచ్చింది.

యింట్లో విషయం తెలియదనుకున్న ఛాయ, యింటికి వచ్చేసరికి ఏర్పడ్డ పరిస్థితికి బిత్తరపోయింది. పోలీసులతో తను స్టేషన్‌కు వెళ్ళటం చూసిన సుందరమ్మ కొడుకు యింట్లో చెప్పడంతో అసలే గుండెజబ్బున్న శాస్త్రి నిలువునా వెనక్కి విరుచుకుపడిపోయాడు.

గుమ్మంలో అడుగుపెడుతూనే, వరలక్ష్మి శోకాలుపెడుతూ ఎదురై, ఛాయను ఇష్టం వచ్చినట్టు తిట్టి, శపించింది. ఆమె శోకాలకు చుట్టుపక్కలవారంతా, చేరి వినోదంగా చూస్తూ, నోటికి వచ్చినట్టల్లా వ్యాఖ్యానించసాగారు.

"ఆ వెధవ దిక్కుమాలిన ఉద్యోగం వద్దని నెత్తీనోరు మొత్తుకొని చెప్పినా విన్లేదు. ఆయన గుండెజబ్బు మనిషి. దీనివల్లే, ఇప్పుడిలా జరిగింది. నా పసుపు కుంకాల నేంచేస్తాడో దేవుడు ? మా పాలిట శనిలా దాపురించారు కదే," అంటూ శోకాలు పెడుతున్న వరలక్ష్మిని ఓదార్చి, జనం ఛాయను మరీ తిట్టసాగారు.

చీకటిపడుతుండగా యిల్లు ఖాళీ అయిపోయింది. వరలక్ష్మిమాత్రం ఏడుస్తూనేవుంది. శాస్త్రి కింకా స్పృహరాలేదు. బాలు వెళ్ళి డాక్టర్‌ను పిలుచుకు వచ్చాడు.

హాస్పటల్‌లో చేర్పించడం మంచిది అన్న డాక్టర్ మాటలకు ఛాయ తలూపింది.

అంత జరిగినా, ఛాయ ఏడవలేదు. మనిషి, మనసు రాయిలా అయిపోయింది. అసలు జరిగిందికాని తను చెప్పాలనుకున్నదికాని, ఏం చెప్పకుండా శాస్త్రిని హాస్పటల్‌లో చేర్పించింది.

రాత్రి తొమ్మిదిదాటింది. బాలు యింట్లోవున్నాడు. శాస్త్రితోపాటే హాస్పటల్‌లో వున్న వరలక్ష్మికి భోజనం తీసికెళ్ళి యిచ్చి తలవాల్చుకొని వస్తోంది ఛాయ.

ఏం జరిగింది ? ఏం జరగబోతుంది అన్న ఆలోచనలేదు ఛాయలో. ఆమె ఆలోచించడం మానుకొని అప్పుడే నలభై ఎనిమిది గంటలు దాటిపోయింది. మొద్దుబారిపోయిన మస్తిష్కాన్ని ఎలా చలనం తెప్పించాలో తెలీలేదు. చుట్టూ అలుముకుంటున్న చీకటిని, ఏమాత్రం పట్టించుకోకుండా వస్తున్న ఛాయ, తన వెనకే వస్తున్న వ్యక్తిని గమనించలేదు.

ఛాయవెనకే యింటివరకు వచ్చి, ఛాయ యింట్లోకి వెళ్ళేవరకు సందు చివర నిలబడి చూసి, ఛాయ తలుపులు వేసుకున్నాక కదలి వెళ్ళిపోయిన ఆ వ్యక్తిని ఛాయ గమనించలేదు కాని వీధి కిటికీలోనుంచి చూసిన పార్వతమ్మ "అమ్మో" అంటూ బుగ్గలు నొక్కుకుంది.

ఆ మర్నాడు ఛాయ హాస్పటల్‌కెళ్ళేసరికి వరలక్ష్మి అది హాస్పటల్ అన్న విషయం మరిచి నిలదీసింది.

"నిన్న నీతోపాటు వచ్చిన వాడెవడు ? సంగనాచిలా వాడితో తిరిగి ఏం ఎరగనట్లు అలా చూస్తావేం ? అతడెవరో నీకు తెలీకపోతే, యింటివరకు నీతో ఎందుకు వస్తాడూ ? యింకా ఆయనందుకే బ్రతికివున్నాడనేనా ? చెప్పవేమే దరిద్రపు మొహమా ? అంత రాత్రివరకు వాడితో ఎక్కడెక్కడ తిరిగావ్ ?" వరలక్ష్మి గట్టిగా అరుస్తూ అడిగింది.

ఛాయకేం అర్థంకాలేదు. నిజానికి నిన్న రాత్రి తన వెనక ఎవరో వచ్చారని వరలక్ష్మి అనేవరకు ఆమెకు తెలీదు. కాని...వరలక్ష్మికి ఆ విషయం ఎలా తెలిసిందో అర్థంచేసుకుంది. తన కంటిముందే హాస్పటల్‌కు వచ్చివెళ్ళిన పార్వతమ్మ చెప్పివుంటుందని గ్రహించి, వాళ్ళు చెప్పే విషయాన్ని నమ్మిన వరలక్ష్మి యిప్పుడు తనేం చెప్పినా నమ్మదని తెలుసు ఆమెకు. అందుకే మౌనం వహించింది.

"అలా మూగిగా ఊరుకుంటావేం ? సమాధానం చెప్పు" అంటూ నిలదీసింది.

"అత్తయ్యా ! నేను ఎవరివెంటో తిరిగానని చెప్పారే తప్ప ఎవరో చెప్ప లేదూ ? నిజం చెబితే నువ్వు నమ్మవ్ ! అనవసరంగా మావయ్యను బాధించకు'' అంది ఛాయ.

"ఇలాంటి అప్రాచ్యపు వార్తలు వింటూ ఆయన బాధపడరనేనా నీ ఉద్దేశ్యం? అసలు ఆయన బ్రతకాలని నీకు..."

"అత్తయ్యా,'' తొలిసారిగా. గట్టిగా వరలక్ష్మి ముందు అరిచింది ఛాయ.

''అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు అత్తయ్యా" అంది.

"ఏంచేస్తావేం ?" అంది యుద్ధానికి సిద్ధమవుతున్నట్టుగా.

"నేనేం చేసినా ముందు మావయ్య ఆరోగ్యం బాగు అయ్యాకే చేస్తాలే అత్తయ్యా. నువ్వేం హైరానా పడకు" అంది ఛాయ, నిర్లిప్తంగా.

"నువ్విలా కొంపలు ముంచుతానని ముందే చెబుతుంటే-బాగు ఎక్కడే" అంటూ రాగాలు తీయాలని చూసిన వరలక్ష్మి డాక్టర్ రావటంతో ఆగిపోయింది.

"మావయ్య బ్రతకాలి !" అనుకుంటూ, ఛాయ ఎంతగా ఆశించిందో, ఆ ఆశ నిరాశ చేస్తూ వెళ్ళిపోయాడు శాస్త్రి. అతని చావుకు కారణం 'ఛాయ' అంటూ, బుడిబుడిరాగాలు తీస్తూ శపిస్తూ, వచ్చిన వాళ్ళందరి జాలి, సాను భూతి, ఆసరాతో! ఛాయను నానా ఆరడిపెట్టింది వరలక్ష్మి.

అన్నిటికి మౌనంగా, కనీసం కళ్ళనీళ్ళయినా నింపుకోకుండా మూగిగా భరించింది ఛాయ. కాని చివరికి, శాస్త్రి చనిపోయిన ఐదోరోజు అయిపోగానే, వరలక్ష్మి అన్నయ్య విశ్వనాథశాస్త్రి వచ్చి, వరలక్ష్మిని తనతోపాటు తీసు కెళ్ళినప్పుడు, వరలక్ష్మిని వెళ్ళొద్దని బ్రతిమాలింది-ఛాయ. ఆమె విన్లేదు. ఎప్పుడో ఛాయ పెళ్ళికంటూ వరలక్ష్మికి తెలీకుండా బ్యాంకులో దాచిన వెయ్యి రూపాయలు తీసుకొని, నిర్దాక్షిణ్యంగా ఛాయను వొదిలేసి వెళ్ళిపోయింది వరలక్ష్మి.

"పోనీ...మా పిచ్చయ్యను చేసుకుంటుందేమో అడుగు,'' అన్నాడు విశ్వనాథ శాస్త్రి వరలక్ష్మితో. పిచ్చయ్యకు నలభై ఏళ్ళుంటాయ్. పౌరోహిత్యం చేసు కుంటూ, ఊళ్ళోవున్నాడు. రెండో సంబంధం. పైగా విశ్వనాథశాస్త్రికి బావమరది.

అతని మాటలకు వరలక్ష్మి తల అడ్డంగా ఆడించింది.

"మీ బావమరిది సంగతి నాకు తెలీదూ. అన్నయ్యా! ఛాయకు పెళ్ళిచేస్తే ఆ కుంటివెధవను అతగాడింటికి రానీయడు. వాడి బాధ్యత నీమీద పడుతుంది జాగ్రత్త" అంది. విశ్వనాధ శాస్త్రి మళ్ళీ మాట్లాడలేదు.

ఆమె వెళ్ళిపోయాక, ఛాయ తొలిసారిగా గుండెలవిసేలా నిశబ్దం ఆవరించిన ఆ యింట్లో, బాలును గుండెకు హత్తుకొని, హృదయ విదారకంగా ఏడ్చింది. ఆ యింట్లో నిశబ్దంతోపాటు అలుముకున్న చీకటి, తన భవిష్యత్తుకు ప్రతి బింబంగా కన్పించసాగింది ఛాయకు. 'రేపు' గురించి ఆలోచిస్తూన్న ఛాయ ఆలో చనలు అర్థంచేసుకున్న బాలు, అక్కయ్యకు ఏ విధంగా సహాయంచేయలేని తన అసమర్థతను నిందించుకున్నాడు.

రెండురోజులు గడిచిపోయాయి. ఛాయకు ఉద్యోగం ఎక్కడా దొరకలేదు.

"యిక లాభంలేదు బాలూ! నెల దగ్గరికి వస్తుంది యింటి అద్దె కట్టాలి! కనీసం...ఏ యింట్లోనైనా అంట్లుతోమేపని అయినా చూసుకోవాలి!" అంది ఛాయ అతి సామాన్యంగా.

బాలు మాట్లాడలేదు. అతి శ్రద్ధగా, పరీక్షగా అక్కమొహంలోకి చూసాడు. ఆమె మొహంలో నిశ్చలత్వం కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది.

"అక్కా!" అన్నాడు బాధగా.

బాలు భోజనంచేసి నిద్రపోయాడు. రాత్రి చాలా సేపటివరకు ఛాయ నిద్ర పోలేదు. అర్థరాత్రి దాటుతుండగా ఎవరో తలుపుతట్టారు. ఛాయ విన్పించుకో లేదు. ఆలోచన్లోపడి గడియ సరిగ్గా వేయనందువల్ల, తలుపులు తెరుచు కున్నాయి. ఎవరో లోపలికి వచ్చి తలుపులు మూసారు.

ఛాయ గమనించలేదు. మోకాళ్ళ మధ్య తలానించి ఆలోచిస్తున్న ఛాయ, హఠాత్తుగా చీకటిగా వున్న గదిలో వెలుగు కనిపించడంతో ఉలిక్కిపడి పోతూ చూసింది,

అగ్గిపుల్ల గీచి, కిటికీలోవున్న కొవ్వొత్తిని వెలిగించి, తనవైపు తిరిగిన వ్యక్తిని చూస్తూనే నిశ్చేష్ట అయిపోయింది.

"భయపడకు ఛాయా!" అంటూ, మూసిన కిటికీ తలుపులను చూసి, తృప్తిగా గాలిపీల్చుకొని, నుదుటికి పట్టిన చమటను తుడుకుకొని, మంచినీళ్ళ కోసం అటూ యిటూ చూసాడు.

"నీళ్ళుకావాలి" అన్నాడు. ఛాయ లేచి వంటింట్లోకెళ్ళి నీళ్ళు తీసుకొచ్చి టేబుల్‌మీద పెట్టేలోగానే, లాక్కొని గబగబా తాగేసాడతను.



"థ్యాంక్స్!" అంటూ అక్కడేవున్న వాలుకుర్చీలో కూర్చొని వెనక్కివాలి, సిగరెట్ వెలిగించాడు. అతని చొరవ, ధైర్యం చూస్తుంటే ఛాయకు ఓ పక్క ఆశ్చర్యం విస్మయంతోపాటు, కోపం రాసాగాయి. అతనివంకే చూస్తూ నిలబడి పోయింది.

"కోపం వస్తోంది కదు ఛాయా! నిజమే! ఈలోకం చాలా గుడ్డిది. మంచి ఏదో, చెడు ఏదో అర్థంచేసుకోదు. కనీసం తెలుసుకోవడానికి ప్రయత్నించదు. ఆడపిల్ల అనగానే అలుసుగా తీసుకొని అభాండాలు వేస్తారు'' అన్నాడు.

"ఆ విషయం తెలిసేనా మీరిప్పుడు యిక్కడికి వచ్చింది?'' కటువుగా అడిగింది ఛాయ.

''ఊఁ...కాని మీరు భయపడరనుకున్నాను. కాని మీరు..."

''నేనేం భయపడ్డంలేదు. మీరంటే నాకు అసహ్యం తప్ప భయంలేదు."

"మీరీ లోకంలో అసహ్యించుకోని దేదైనావుందా? ఎవరైనా వున్నారా?''

"ఉన్నా లేకున్నా ... నేను అసహ్యించుకునే వ్యక్తుల్లో మొదటి వ్యక్తి మీరే."

''ఎందుకూ?" అన్నాడు నవ్వుతూ. అంతకోపంలోను అత నెంతో అందంగా నవ్వుతాడన్న విషయం గమనించింది ఛాయ.

"మిమ్మల్ని చాలామంది బాధపెట్టారు. నే నెప్పుడూ మిమ్మల్ని ఏమీ అన్లేదు. కాని...నేనంటే.. ప్చ్...కాని ఒక్క నిజం చెబుతున్నాను ఛాయా! ఈ సంఘంలో చాలామందికంటే నేను ఎన్నో విషయాల్లో ఎన్నో రెట్లు చాలా మంచి వాణ్ణి!'' అన్నాడు తిరిగి నవ్వుతూ.

"మీ మంచితనంతో నాకు పన్లేదు. కాని...మీరు వెళ్ళండి!'' అంది.

''ఊహుఁ..." అంటూ నవ్వాడు.

''వెళ్ళకపోతే ఏంచేస్తారూ! అరుస్తారా? ఊహుఁ... మీరాపని చేయలేరు." అంటూ నవ్వి, లేచి నిలబడ్డాడు ''నేను యిప్పుడు బయటికి వెళ్ళడం క్షేమం కాదు ఛాయా! అందుకే వెళ్ళను.'' అన్నాడు పచార్లుచేస్తూ.

ఆ మాటలు అనేప్పుడు అతని మొహంలో కదలాడిన ఆందోళనను అర్థం చేసుకోలేకపోయింది ఛాయ. ఆమె మొహంలో కదలాడిన చిరాకు, విసుగు చూసి, అతను నవ్వుతూ, "నేను మంచివాడినని ఎలా చెబితే నమ్ముతారూ?" అన్నాడు.

"నా నమ్మకంతో మీకేమిటీ?" అంది ఛాయ. పచార్లుచేస్తున్న అతను ఆగిపోయి ఛాయ దగ్గరగా వచ్చి, ఆమె కళ్ళలోకి చూస్తూ "నాకు అవసరం" అన్నాడు. విసురుగా మొహం తిప్పుకుంది ఛాయ.

"ఆ రోజు ఏంజరిగింది?'' హఠాత్తుగా అడిగాడతను.

"మీ కనవసరం!" అంది తీక్షణంగా చూస్తూ ఛాయ. ఆ రోజు పోలీసులతో పాటు తను వెళ్ళడం అతను చూసాడన్న నిజం ఆమెను నిలువునా కాల్చసాగింది.

"మీ మావయ్య పోయారట...మీ అత్తయ్య కూడా...."

"మీ జాలి, సానుభూతి నా కవసరంలేదు. నేను భరించలేను." అంది ఛాయ కటువుగా. కాని చివరికి ఆమె గొంతు వణకడం పసికట్టిన అతను చలించి పోయాడు.

''ఛాయా! మీ రెందుకలా నన్ను అర్థంచేసుకోకుండా అవమానిస్తారో అర్థం కాదు మీ పట్ల నాకెప్పుడూ చెడు అభిప్రాయంలేదు. మీతో నేనెప్పుడూ అతిగా ప్రవర్తించలేదు. సాటి మనిషిగా...''

''సాటి మనిషి...హు...అందుకేనా యింత రాత్రివేళ మీరు వచ్చారు. ఆ

ఆరోజు ఏంజరిగిందో మీకు తెలుసు. తెలిసికూడా నన్ను అవమానించాలనే కదూ అడగడం. మావయ్య పోయారని, అత్తయ్య నన్ను ఒంటరిగా వొదిలేసిందనే ధైర్యంతో నేను ఒక్కదాన్నే కుంటితమ్ముణ్ణి తోడుగా యింట్లో వుంటున్నాననే చులకన భావం, నేను మీకు లొంగిపోతాననే కదూ...'' ఛాయ మాటలు పూర్తికాకముందే, అతను విసురుగా వచ్చి, ఛాయ నోరు మూసేసాడు. ఆమె భుజాలను పట్టి గట్టిగా కుదిపేస్తూ—

"వద్దు ఛాయా! నేను ఆ మాటలు భరించలేను. నేను చెడ్డవాణ్ణే కాని...ఒక ఆడపిల్ల ఒంటరిగా వుంటుందనీ, అవకాశం వృధాపోనీయకుండా, ఓ నిండు జీవితాన్ని బలితీసుకునే రాక్షసుణ్ణి మాత్రంకాను. యిప్పుడే కాదు మరెప్పుడూ జీవితంలో మిమ్మల్ని అవమానించలేను. నన్ను మాత్రం అంతనీచుడిగా ఊహించకండి. ప్రేమించి ఆరాధించే అందమైన పువ్వును, అల్లంత దూరంనించి చూస్తూ తృప్తిపడతానే తప్ప అమానుషంగా నలిపివేయలేను," అంటూ, ఆమెను వొది లేసి తలుపులు తీసుకొని వెళ్ళిపోయాడు. నిర్ఘాంతపోయి చూస్తున్న ఛాయ, సన్నటి నీటి తుంపర యింట్లోకి పడ్డంతో, తలుపులు మూసేసింది

ఉదయం తొమ్మిది గంటలు దాటినా వర్షం తగ్గలేదు. యింట్లో మిగిలిన కొద్దిపాటి బియ్యంతో వంట అయిందనిపించి కూర్చుంది ఛాయ.

"అక్కా!" అన్నాడు బాలు. ఛాయ తలెత్తి చూసింది.

''పోనీ...రమాపతిరావుగారింట్లోనే మళ్లీ..." అంటూ ఆగిపోయాడు

పదేళ్ళు నిండుతున్న బాలు కేంచెప్పాలో ఎలా చెప్పాలో తోచలేదు ఛాయకు. తల అడ్డంగా ఆడిస్తూ, "నీకు తెలీదు బాలూ! అతను మంచివాడు కాదు'' అంది తలవాల్చుకుంటూ. బాలు యింకేం అడక్కుండా బయటపడుతున్న వర్షాన్ని కిటికిలోనుండి చూస్తూ కూర్చున్నాడు.

''పార్వతమ్మవాళ్ళు ఊరెళ్ళిపోయారు" అన్నాడు. ఛాయ విననట్టే కూర్చుంది.

"నిజంగా ఆవిడ ఓ రాక్షసి. నువ్వు యిల్లు విడిచివెడితే చాలు, నా దగ్గరి కొచ్చి ఏమిటేమిటో అడుగుతుంది'' అన్నాడు, ఆవిడ వెళ్ళిపోవటంతో కొన్ని రోజులవరకైనా ఆ బాధ తప్పిందన్న సంతోషంతో.

"అక్కా! నువ్వలా మూగిగా కూర్చోకు" అన్నాడు బ్రతిమాలుతున్నట్టుగా.

"ఇవాళ ఇరవై ఎనిమిదో తారీకు. మరో మూడు రోజులైతే, అద్దెకోసం

యింటి యజమాని వస్తాడు. ఎలా? ఏంచేయాలి? నలభై రూపాయలఅద్దె..."

"పోనీ...మనం మరో చిన్న యిల్లు తీసుకుందాం అక్కా!" అన్నాడు బాలు.

"కాని ప్రస్తుతం ఈ నెల అద్దె కట్టాలి. పైగా కొత్త యిల్లయితే అడ్వాన్సుగానే అద్దె యిచ్చుకోవాలి. అంతేకాదు బాలు...ఈ రాత్రికిక..." అంటూ ఆగిపోయింది.

ఛాయ ఏం చెప్పాలనుకుందో, ఎందుకు ఆగిపోయిందో అర్థంచేసుకున్నాడు బాలు. "ఈ రాత్రికిక బియ్యంలేవు. బియ్యంలేవు కాబట్టి, డబ్బులంతకన్నా లేవు కాబట్టి బహుశా డబ్బులు వచ్చేవరకు ఉపవాసాలే. ఉపవాసాలంటే అక్కయ్యకేం బాధగా అన్పించదు. అక్కయ్య బాధ అంతా తనకోసమే. అసలు ... అక్కయ్య జీవితానికి తనో శనిలా దాపురించాడేమో అనిపిస్తుంది ఒక్కోసారి. ప్చ్..." బాలు కళ్ళలోని నీటిని చూస్తూనే కలవరపడిపోయింది ఛాయ. అంత కంతకు కన్నీటిధార అధికంకావటంతో ఛాయ ఓదార్పు అంతా వృధా అయి పోయి, వెక్కి వెక్కి ఏడుస్తూ ఛాయ గుండెల్లో తలదాచుకొని బావురు మన్నాడు.

"బాలూ! ఊరుకో తమ్ముడూ!" అన్న ఛాయ మాటలకు బాలు ఏడ్పు మాన లేదు.

మధ్యాహ్నం రెండుగంటలకు వర్షం పూర్తిగా తగ్గిపోయింది. మబ్బులు కమ్ముకున్న ఆకాశం నిర్మలంగా, నీలంగా కన్పిస్తూ, ఉదయంనుంచి కని పించని సూర్యునికి స్వాగతం పలుకుతున్నట్లుగా వుంది.

"బాలూ! నేను ఉమవాళ్ళింటికి వెళ్ళివస్తాను!" అంటూ బాలుకు యిల్లు అప్పగించి బయలుదేరింది ఛాయ.

"ఛాయా! యిక్కడే యింగ్లీష్ ప్రయిమరీ స్కూల్ ఒకటివుంది. రేపు వెళ్ళిచూద్దాం, ఇప్పుడు డబ్బేమైనా కావాలా?" ఉమ ప్రశ్నకు తల అడ్డంగా ఆడించి, యింటికి బయలుదేరింది.

"ఛాయా!" ఎవరో పిలవడంతో వెనుతిరిగి చూసింది. పార్వతమ్మ కొడుకు మూర్తి.

సైకిలు దిగి, ఛాయ ప్రక్కనే నడుస్తూ, "మీకింకా ఉద్యోగం దొరకలేదా?"

అన్నాడు. అతని మాటల్లో, మొహంలో కదలాడే మర్యాదను చూసీ, లేదన్న ట్టుగా తలూపింది ఛాయ.

వచ్చేనెల్లో మా కంపెనీలో ఓ టైపిస్టు పోస్ట్ ఖాళీగావస్తోంది. మీ గురించి నేను ప్రయత్నిస్తాను. మీరో అప్లికేషన్ రాసియివ్వండి'' అన్నాడు.

"అలాగే'' అంది.

''మా కంపెనీలో మేనేజరు వున్నాడు చూడండి. అతను చాలా మంచివాడు. నేనంటే అతనికి ప్రత్యేకమైన అభిమానం కూడా ! మరో కొన్ని రోజుల్లో నాకు ప్రమోషన్ రాబోతుంది. నేను...చెబితే ఆయన కాదనడు. మీరు ఓసారి నాతో ఆయనింటికి రండి. పర్సనల్‌గా వెళ్ళి మాట్లాడితే...అతను కాదనడు" అన్నాడు.

"సరే'' నన్నట్టుగా తలూపి, కృతజ్ఞతగా చూసింది ఛాయ.

"రేపు ప్రొద్దున్న అప్లికేషన్ రాసి యివ్వండి. వీలైతే మరో రెండురోజుల్లో ఆయన దగ్గరికి వెడదాం ! ముందుగా వెడితేనే బావుంటుంది. ఆ ఉద్యోగంపై చాలామందికి కళ్ళున్నాయ్, తమ తమ బంధువుల కిప్పించాలని. మనం కాస్త ముందుగా వెడితే బావుంటుంది. వెధవ కాంపిటీషన్లుంటాయ్ !''అన్నాడు నవ్వుతూ. ఎందుకో ఈసారి అతని నవ్వు చూసిన ఛాయ మనసెందుకో ఒక్కసారి శంకించింది. కాని...ఏమీ అనలేకపోయింది. అవసరం, ఆమె కోపాన్ని ఆ క్షణంలో మరిచిపోయేలా చేసింది.

మర్నాడు, మూర్తికి, అప్లికేషన్ రాసి బాలుతో పంపించింది. బాలు అప్లికేషన్ యిచ్చి తిరిగి వస్తూ, ఛాయ బజారుకు బయలుదేరటం చూసి, ఏదో అడగబోయాడు. ''పద...రాములమ్మ" అంటూ, తమ యింటి కవతలవుండే చాలా యిళ్ళలో పనిచేసే రాములమ్మ వెంట వెడుతున్న ఛాయను రెండు చేతులతో ఆపి "అక్కా !" అన్నాడు, బాలు ఆందోళనగా.

"లేదురా బాలూ ! పనికోసం కాదు నేను వెళ్ళడం. చూడు రాత్రి ఉపవాసం వున్నందుకు నీ మొహం ఎలా పీక్కుపోయిందో...బియ్యం తీసుకొని వచ్చేస్తాను" అంది.

''నిజంగానా అక్కా !" అన్నాడు, ఛాయ చేతిని తన తలమీద పెట్టుకుంటూ.

"ఊఁ..." అంటూ, బాలుతల నిమిరి రాములమ్మతో వెళ్ళిపోయింది. సందు

మలుపు తిరిగే సమయంలో రామా చేతిలోని సంచిలో లావుగా కన్పించిన దానిని చూసి ఆలోచన్లో మునిగిపోయాడు బాలు.

అరగంట గడిచేసరికి ఛాయ సంచి, నిండుగా చేసుకొని తిరిగివచ్చింది. కొద్దికొద్దిగా అర్థంచేసుకున్న బాలు ఓ పక్క బాధపడ్డా మరోపక్క ఛాయ, రాములమ్మలా పన్లోకి వెళ్ళనందుకు సంతోషించాడు. ఆ రోజంతా ఛాయ యింట్లోనే కదలకుండా కూర్చుంది.

సాయంత్రం మూర్తి రాగానే బాలు వెళ్ళాడు. బాలుకోసం గుమ్మంలో నిలబడ్డ ఛాయ, బాలుతోపాటు మూర్తి రావటంతో, పక్కకు తొలిగి లోపలికి పిలిచింది.

"మీ అప్లికేషన్ యిచ్చానండి! మేనేజరు ఊ...అన్నాడు. ఈ ఆదివారం వెడదాం.. అన్నట్టు ఉద్యోగం టెంపరరీది కాని...చేరాక మిమ్మల్ని చూసి... ఐమీన్ మీ పనిని చూసి పర్మనెంటు చేస్తారు. ఈ విషయం నిన్న నేను చెప్ప లేదు,'' అన్నాడు.

అతను వెళ్ళిపోయాక, "అతను ఎంతో మర్యాదగా మాట్లాడతాడు కదూ!" అన్న బాలూ మాటలకు, అవును అని అనలేకపోయింది ఛాయ. తనగురించి అతనికి అంత సదభిప్రాయంలేదన్న విషయం, ఒక్కసారి చూసే అతని చూపు ద్వారా అర్థంచేసుకున్న ఛాయ, బాల్తూతో ఆ విషయం చెప్పలేకపోయింది.

మరో రెండురోజులు గడిచాయి. అనుకున్న ఆదివారం రానేవచ్చింది. మబ్బులు కమ్మిన ఆకాశాన్ని చూస్తూ, "పోనీ...రేపు వెళ్ళకూడదా అక్కా!" అన్నాడు బాలు.

"ఫర్వాలేదు బాలూ!" అంటూ, బయలుదేరింది ఛాయ.

"ఈ వీధిలోని వాళ్లు ఏమిటేమిటో అనుకుంటారు ఛాయా. ఒక్కరూ సంస్కారం ఉన్న మనుషులు కాదు. నేను అలా బస్‌స్టాపులో నిలబడతాను. మీరు అక్కడికే రండి'' అంటూ మూర్తి వెళ్ళిపోవడంతో ఒంటరిగా బస్‌స్టాపు కెళ్ళింది ఛాయ.

మూర్తి చిరునవ్వుతో పలకరించాడు. మరో అరగంటకల్లా ఇద్దరూ ఓ అందమైన మేడముందాగారు.

మూర్తిని చూస్తూనే చింతామణి నవ్వాడు. మూర్తి ఎంతో వినయంగా విష్ చేసి, ఛాయను పరిచయంచేసాడు. చింతామణి మొహం చూస్తూంటే ఎంతో మంచివాడనిపించింది ఛాయకు. కాఫీలు తెప్పించి యిచ్చాడాయన. యింట్లో నౌకరు తప్ప మరొకరు లేరు.

"నేను అర్జంటుగా వెళ్ళాలి అమ్మాయ్. వీలైతే రేపోసారి మధ్యాహ్నంవేళ రా!" అన్నాడు. ఛాయ తలూపింది.

"మూర్తీ, నువ్వోసారి యిలా రావోయ్!" అంటూ పక్కగదిలోకి తీసికెళ్ళి మరో రెండునిమిషాలకు తిరిగివచ్చాడు.

"చూడమ్మాయ్! రేపు నువ్వు ఒక్కర్తివే రావటం కష్టం అంటున్నాడు మూర్తి! నీకు అభ్యంతరంలేకుంటే రెండు గంటలసేపు ఇక్కడే కూర్చో! నే వెళ్ళి వచ్చేస్తాను" అన్నాడు. ఛాయ మూర్తివంక చూసింది. సరే అనమన్నట్టుగా చూసాడతను.

"నే వెళ్తానోయ్!" అంటూ అతను కారు తీసుకొని వెళ్ళిపోయాడు.

"రేపటిలోగా మళ్ళీ ఏ అవాంతరమైనా రావొచ్చు! లేదా మరెవరైనా వచ్చి మేనేజరుగారిని ఒప్పించేసేయొచ్చు! అందుకే నేను లోపలికెళ్ళి బ్రతిమాలాను" అన్నాడు మూర్తి.

ఛాయ ఓ సారి అతనివంక చూసి, చూపు మరల్చింది. బయట చీకట్లు అలుముకుంటూ చల్లగాలి వీస్తోంది.

"వర్షం వచ్చేలా వుంది! మీరు కూర్చోగలరు కదూ! నేను వెళ్ళి సిగరెట్లు తెచ్చుకుంటానండి" అన్నాడు జేబులు తడుముకుంటూ మూర్తి.

ఛాయ మౌనాన్ని చూసి అతను బయటికి వచ్చి, నౌకరువంక సాభిప్రాయంగా చూసి వెళ్ళిపోయాడు.

మూర్తి వెళ్ళి ఇరవై నిమిషాలు దాటినా, తిరిగి రాలేదు. చిటపట చినుకులతో మొదలైన వర్షపుజల్లు, రానురాను ఎక్కువై కుంభవృష్టిగా మారింది. కిటికీలోనుండి వర్షాన్ని చూస్తున్న ఛాయ, చింతామణి కారు యింటి ముందాగడంతో ఉలిక్కిపడింది.

అతను వరండామీదికి రావడంతోనే, నౌకరుతో ఏమో చెప్పాడు నౌకరు లోపలికి వెళ్ళిపోయాడు. చింతామణి గదిలోకి వచ్చి, ఛాయను చూసి నవ్వుతూ, "వాడు వెళ్ళిపోయాడా! గుడ్..." అన్నాడు.

ఛాయకేం అర్థంకాలేదు అతని మాటల్లో తేడాగుర్తించి ఛాయ అనుమానంగా చూసింది.

"కూర్చో!" అంటూ ఛాయకు కుర్చీ చూపించాడు నౌకరు వచ్చి, రెండు సీసాలు, గ్లాసులు తీసుకువచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్ళిపోవడంతో విషయం కొద్దిగా అర్థంఅయింది ఛాయకు. ఒక్క అడుగు ముందుకువేసింది.

"ఆగు ఛాయా ! నీ పరిస్థితి అంతా ఆ లోఫర్ చెప్పాడు. తనకు ప్రమోషన్ రావాలనే కాదు, నీకు ఉద్యోగం దొరకడానికే ఈ పూట నిన్నిక్కడికి తీసుకు వచ్చాడు. మర్యాదగా, బుద్ధిగా నేను చెప్పినట్టు విను నీకు ఉద్యోగం యిస్తాను. రేపే ఆర్డర్స్ నీ చేతికి వస్తాయి'' అన్నాడు.

ఛాయ కళ్ళలోనుండి నిప్పులు కురిసేలా చూసింది. అతనిమాటల్లో కనిపించే మంచితనం, అమ్మాయ్ అన్న పిలుపులో కదలాడే ఆప్యాయత అంతా నటన అన్న విషయం తెలిసి, కోపంతో ఊగిపోయింది. మూర్తి కనిపిస్తే బావుండు. చంపేయాలన్నంత కసిపుట్టింది. మాటలతో నమ్మించి తననింత దూరం తీసుకువచ్చి, వెళ్ళిపోయిన మూర్తిని నిలువునా కాల్చేయాలన్నంత ఆవేశం కలిగింది.

ఛాయ ఆలోచనల్లో వుండగానే, అతను సీసాలోని విస్కీని గ్లాసులోకి వొంపుకొని తాగి, లేచాడు. మెల్లిగా ఛాయ భుజంమీద చేయివేసాడు అరిచి లాభం లేదని, పెనుగులాడి గెలవలేనని తెలుసుకుంది ఛాయ. గుమ్మం తెరిచివున్నా, అడ్డంగా వున్నాడు చింతామణి. తన అరుపులు వినరాకుండా బయట జోరున వర్షం కురుస్తోంది.

అతనివంక తిరిగి చిన్నగా నవ్వింది. అతని చేతిలోని గ్లాసునందుకొని విసురుగా అతని మొహంమీదికి విసిరి, తనకున్న శక్తినంతా వినియోగించి, అతన్ని తోసి, బయటకు పరుగెత్తుతూ వచ్చి, ఆ వర్షంలోనే రోడ్డుమీదికి పరిగెత్తుతూ వచ్చింది ఛాయ.

ఉధృతంగా కురుస్తున్న వర్షంలో తడిసి ముద్దగా వచ్చిన ఛాయను చూసి, బాలు గాబరాపడిపోయాడు. యింట్లోకిరాగానే, ఆయాసాన్ని దాచుకుంటూ, బాలుకు తెలీకూడదని ఎంతో ప్రయత్నించి కూడా ఓడిపోయిన ఛాయ, గుండెలు పగిలేలా ఏడుస్తూ కుప్పలా కూలిపోయింది.

ఎందుకు? ఎందుకిలా తన జీవితంతో ఇంతమంది ఆట ఆడుకోవాలని చూస్తున్నారు? తానేం తప్పుచేసింది? తను చేసిన పాపమేమిటి? తల్లి, తండ్రి ప్రేమకు నోచుకోకుండా, మేనమామ, మేనత్త చేతుల్లో పెరిగి, అమ్మలా పెంచ లేకపోయినా, సాటి ఆడదానిలా జాలిసైతం చూపించకుండా, తన ప్రతి అడుగును శంకిస్తూ వీధిలోనివాళ్ళందరు తనను అనుమానించి అవమానించేలా వరలక్ష్మి మార్చింది. అయినా తను బాధపడలేదు. కాకుల్లాంటి మనుషులు-- అరవక ఏంచేస్తారూ? అనుకుంది.




కాని...ఆడపిల్ల...ఒంటరిగా, ఉద్యోగంకోసం వస్తే...పశువుల్లా మీదపడి జీవితాన్ని బలితీసుకోవాలనుకునే రాక్షసుల మధ్య తానింకా ఎన్ని అగచాట్లు పడాలి? ఎన్ని అవమానాలు సహించాలి? భగవాన్ వీటికి అంతులేదా?

ఏ మూలకు వెళ్ళినా తనను కోరేవాళ్ళేతప్ప, మంచివాళ్ళు కన్పించని ఈ సంఘంలో తనకు రక్షణలేదు. తను చచ్చిపోతేకాని రక్షణ లభించదు కాని... బాలు...బాగుపడటానికి అవకాశం ఉండికూడా, డబ్బులేమివల్ల కుంటివాడుగా మిగిలిన బాలుకు తోడెవరు? బాలును ఎవరికి అప్పగించి వెడుతుంది?

తనకు పిరికిదానిలా జీవితంలోనుండి పారిపోవాలనిలేదు. కాని...మృగాల్లా వెంటపడే మనుషుల మధ్య, తన శీలాన్ని ఎన్నాళ్ళని కాపాడుకుంటుంది. ఎన్నాళ్లో కాదు ... కొన్నాళ్లే ... ఏనాడో ఒకనాడు, ఆడదాన్నని అలుసుతో తనను అసహాయురాలినిచేసి, ..తనను బలితీసుకుంటారు. తను...ఓడిపోతుంది. అప్పుడు —ఈ నాడు ఆదరించని సంఘం ఆనాడు తనను పతితగా నిలదీసి వెలివేసి బహిష్కరిస్తుంది. ఆనాడుమాత్రం తనకు రక్షణఏది? చివరికి తను జాలి, సాను భూతికి కాదుగదా ... ఒక కన్నీటి చుక్కకు నోచుకోకుండా హీనమైన జీవితాన్ని గడుపుతూ—భగవాన్...కుళ్ళి కుళ్ళి ఏడ్చింది ఛాయ.

ఛాయకు స్పృహవచ్చేసరికి తానెక్కడుందో తెలీలేదు

"అక్కా!" అంటూ ఆతృతగా పిలిచాడు బాలు.

"బాలూ!" అంటూ తమ్ముడి చేతినందుకొని, నిమురుతూ చూసింది. బాలు కళ్ళనిండా నీళ్ళు.

"ఎందుకురా బాబూ ఏడుస్తావ్? ఏంజరిగిందని? నేను క్షేమంగానే తిరిగి వచ్చాను తమ్ముడూ." అంది.

"నీకేం తెలీదక్కా! రెండురోజులుగా స్పృహలేకుండా వున్నావ్! యిప్పుడే కదూ కళ్ళు తెరిచావ్!" అన్నాడు ఏడుస్తూ.

ఛాయ ఆశ్చర్యపోయింది. తానింకా, ఆ రోజు వర్షంలో తడిసివచ్చి, ఏడుస్తూ కుప్పకూలిపోయి కళ్ళు తెరిచిందని, ఆ మధ్యకాలం గంట రెండుగంటలనే అనుకుంటోంది కాని, రెండురోజులని ఊహించలేకపోయింది. చుట్టూ కళ్ళు తిప్పిచూసిన ఛాయ తన పక్కనే యింకా కొన్ని మంచాలు, ఆ మంచాల్లోని మనుషులను చూసి అది హాస్పిటల్‌గా గుర్తించింది. చుట్టూచూసి, ఆలోచన్లో మునిగిన ఛాయను చూసి, ఆమె ఏమి ఆలోచిస్తోందో పసికట్టాడు బాలు.

"ఆరోజు నువ్వలా పడిపోయావా! నేనెంత పిలిచినా పలకలేదు. సాయంత్రం కావొస్తున్నా, నువ్వు కళ్ళు విప్పి చూడలేదు. నాకెందుకో భయంవేసి గట్టిగా ఏడ్చాను. మూర్తిగారిని పిలవాలన్నా అతను లేడు. వరండా మీదికొచ్చి ఏడుస్తూ ఎవరిని పిలవాలో తెలీక చూస్తున్న నన్ను, ఆ వర్షంలో గొడుగు తీసుకొని అటుగావచ్చిన ఆతను పలకరించాడు. అక్కా! విషయం చెప్పాను అతనెంతో మంచివాడు నిన్ను చూసి, వెంటనే టాక్సీని తీసుకొచ్చి యిక్కడ చేర్పించాడు. ఈ రెండురోజులుగా ప్రతిపూట వచ్చి చూసిపోతున్నాడు," అన్నాడు.

"ఓహ్..." అంటూ నిట్టూర్చింది ఛాయ.

"అతనిందాకే నాకు భోజనం, నీకు కాఫీ తీసుకొచ్చి యిచ్చి వెళ్ళిపోయాడు. మళ్లీ సాయంత్రానికికాని రాడు. నిజంగా అతణ్ణి చూస్తుంటే, దేవుడనిపిస్తుం దక్కా, ఎంతో మంచివాడు, మరెంతో మంచిగా మాట్లాడతాడు"

"ఊఁ...బహుశా మనుషుల్లో కూడా దేవుళ్ళుంటారేమో బాలూ!" అంది ఛాయ.

ఆ సాయంత్రం బాలుతోపాటు ఛాయకూడా తమకు సహాయంచేసిన వ్యక్తి రాకకోసం ఆతృతగా ఎదురుచూసింది. బాలుఆతృతను అణచుకోలేక, హాస్పిటల్

గేటువరకు వెళ్ళాడు గేటుదగ్గర నిలబడ్డ అతణ్ణి చూస్తూనే బాలు కళ్లు ఆనందంతో వెలిగాయి.

"అక్కకు స్పృహవచ్చిందండీ. ప్రొద్దున మీరు వచ్చి వెళ్ళగానే అక్క కళ్ళు తెరిచి మాట్లాడింది మీకోసం అక్క ఎదురుచూస్తోంది'' అన్నాడు బాలు.

బాలు మాటలకు అతను నవ్వేసి, బాలు భుజంమీద చేయివేసి తడుతూ, "నాకు చాలా సంతోషంగా వుంది బాలూ, మీ అక్క కోలుకున్నందుకు" అంటూ చేతిలోని పళ్ళను అందించి, ''నాకు అర్జంటు పన్లున్నాయ్ బాలూ! వెళ్తాను" అన్నాడు.

"ఒక్కసారి లోపలికి రండి! అక్కకు మీగురించి నేను అంతా చెప్పాను. ఒక్కసారి కనిపించి వెళ్ళండి. అక్క మిమ్మల్ని చూడాలనుకుంటోంది" అన్నాడు.

"వద్దు బాలూ! మీ అక్క నన్ను చూడాలనుకోదు."

"అదేమిటి?'' బాలు అర్థంకానట్టు అడిగాడు.

''నాకు పనివుంది బాలూ, వెళ్తాను." అంటూ అతను ఆప్యాయతగా బాలు భుజం తట్టి వెళ్ళిపోబోయాడు.

"రేపు వస్తారుకదూ!" గట్టిగా పిలిచి అడిగాడు బాలు.

"అలాగే'' అంటూ వెళ్ళిపోయాడతను.

''పళ్ళు తీసుకొని లోపలికి వచ్చిన బాలునుచూసి ఛాయ ఏదో అడగ బోయింది. బాలు పళ్ళు చూపిస్తూ తనే ముందు చెప్పాడు.

"ఆయన వచ్చాడక్కా! ఏదో అర్జంటుపని వుందని వెళ్ళాడు. రేపు వస్తా నన్నాడు" అన్నాడు బాలు

ఛాయ ఆశ్చర్యపోయింది. అతను ఎంతో దయతో తనను హాస్పిటల్‌లో చేర్పించి రెండురోజులుగా, బాలు ఆకలితోపాటు తన అవసరాలను తీర్చి ఆపదలో ఆదుకున్న అతను, తనకు స్పృహవచ్చిందని తెలిసికూడా ఎందుకు రాలేదు? బాలు మాటలు, అక్కడ మిగతా బెడ్‌లలో వున్న పేషెంట్స్ చెప్పిన మాటలనుబట్టి తనకోసం ఎంతో ఆందోళనపడుతూ, ఆత్రుత కనపర్చాడని అర్థంచేసుకుంది. అలాంటప్పుడు అతనెందుకు లోపలికి రాలేదు? ఎంత అర్జంటు పనివున్నా, రెండునిమిషాలకోసం లోపలికి రావొచ్చు. అంతేకాదు, బాలు బయటికి వెళ్ళి ఎదురుపడకపోతే, అతను లోపలికి వచ్చేవాడు. ఇంతకీ

అతనెవరు? ముక్కూ మొహం తెలీని తమకు సహాయంచేసిన ఆ సహృదయు డెవరు? ఎంత ఆలోచించినా ఛాయకు సమాధానం దొరకలేదు.

మరో రెండురోజులు బాలుతోపాటు ఛాయ కూడా ఆ వ్యక్తికోసం ఎదురు చూసింది. అతను రాలేదు కాని, నర్స్‌తో బెడ్ నెంబరు చెప్పి పళ్ళు పంపించాడు. ఛాయకేం అర్థంకాలేదు. కాని ఒక్కటి అర్థమైంది. అతనెవరోకాని...తన ముందుకు రావాలనుకోవటంలేదు. తానెవరో తెలీకుండా వుండాలనే అతని ప్రయత్నం. కాని...అతనెవరూ? ఆలోచిస్తున్న ఛాయ కళ్ళలో ఎవరిదో రూపు లీలగా మెదిలింది.

"అతను కాదుగదా?"

'ఛ...రమాపతిరావులాంటి వాడిదగ్గర వుండే అతను...తనకు నిస్వార్థంగా సహాయం చేయడు అతని మనస్సులో ఏ మూలో స్వార్థం నిండిన ఆశ పేరుకునే వుండివుంటుంది. అయినా ఆవర్షంలో అతనావైపుకురాడు. వచ్చినా... తనను చూడ్డానికి వచ్చేవాడు. ఆలోచిస్తున్న ఛాయ ఉలిక్కిపడ్డది.

"ఎందుకు వస్తాడు," మనసు నిలదీసింది.

జవాబుగా ఆ రోజు రాత్రివేళ అతను అన్నమాటలు గుర్తుకొచ్చాయి.

ఆ రోజు తరువాత అతను మళ్ళీ కన్పించలేదు. అవును, ఆరోజు తన చాలా స్పష్టంగా చెప్పింది అతనంటే తనకు అసహ్యమని.

"కాని, ఛాయా అతను నిన్ను రమాపతిరావు చేతిలోనుండి రక్షించాడు అతను ఎలాంటివాడైనా, రమాపతిరావులాంటివాడి కుడిభుజం అయినా, నీ దృష్టిలో అతనో రౌడీ, జులాయి వెధవ అయినా, అతనిలో సంస్కారం వుంది. అతనికో వ్యక్తిత్వం వుంది."

మనసు ఏ మూలనుండో ఘోషిస్తోంది. ఛాయ కళ్ళు మూసుకుంది. ఇవాళ తన ఆలోచనలు తనకు తెలీకుండా కొత్తదారి తొక్కుతున్నాయ్ అనుకుంది.

"బాలూ! అతనెలావుంటాడు?" అన్న ప్రశ్న అడగకుండా వుండలేక పోయింది.

బాలు తనకు తెలిసినంతవరకు అతనిగురించి చెప్పాడు.

"అక్కా! అతనెంత అందంగా నవ్వుతాడో" అంటున్న బాలు మాటలకు ఛాయ క్షణంసేపు బాలు మొహంలోకి చూసి చూపు తిప్పుకుంది.

ఛాయ హాస్పిటల్‌నుండి బయటికి వచ్చింది. దుమ్ము పేరిన యింటిని శుభ్రం

చేసుకుంటూ యింట్లోనే వుంది ఛాయ. బాలుమాత్రం, వీధి వరండాలో కూర్చొని ఆశగా ఆత్రుతగా అతని రాకకోసం చూడసాగాడు.

ఆ రోజైనా అతను హాస్పిటల్ కెళ్ళి, తామక్కడ లేమనితెలిసి యింటికి వస్తాడనే బాలుఆశ. కాని...ఆ సాయంత్రం వరకు చూసినా అతను రాలేదు.

సాయంత్రం కావస్తుండగా యింటి యజమాని పరంధామయ్య వచ్చాడు, అద్దె కోసం. పరంధామయ్య,శాస్త్రికి తనతోవున్న స్నేహాన్ని పురస్కరించుకొని అద్దెకు అంతగా వొత్తిడి చేయలేదు. శాస్త్రి బ్రతికివున్నప్పుడు అతను చాలాసార్లు యింటి యజమానిగాకాక, స్నేహితుడిగావచ్చి ఆ యింటి పరిస్థితులను అర్థంచేసుకున్నాడు ఛాయ విషయం తెలిసిన అతనికి ఆమెపట్ల జాలి సానుభూతి వున్నాయ్. అందుకే వచ్చే నెలలో అద్దె యిస్తానంటున్న ఛాయ మాటలకు తలూపాడు.

"చూడమ్మాయ్! మీ యిద్దరే కాబట్టి ఈ ఒక్కగది ఆ వంటగది తీసుకోండి. బయటి ఈ వీధిగది అద్దెకిస్తాను. అద్దె తగ్గడమే కాదు, మీకు తోడగా వుంటాడతను" అన్నాడు.

"ఎవరూ?'' అంది ఛాయ భయంగా.

''నాకు తెలిసిన అబ్బాయి. చాలామంచివాడు. ఆడపిల్లవు ఒంటరిగావుండడం అంత క్షేమం కాదు. అతను కుర్రాడే అయినా ... చెడ్డవాడుమాత్రంకాడు. అద్దె యిస్తాడన్న మాటేకాని ... సరిగ్గా యింట్లో వుండడు. ముఖ్యంగా రాత్రుళ్ళు వుండడు. మధ్యాహ్నంవేళ యింట్లో వున్నా, నీకంత భయంలేదు" అన్నాడు.

ఛాయ ఏదో చెప్పబోయింది. పరంధామయ్య వినకుండా వెళ్ళిపోతూ, "సాయంత్రానికల్లా గది ఖాళీ చేసెయ్ ఛాయా!" అంటూ వెళ్ళిపోయాడు.

"కాదు కూడదంటే అతనికి కోపం వచ్చి, అద్దె యివ్వమంటాడో లేక యిల్లు ఖాళీచేయమంటాడో అక్కా! ఆయనే చెబుతున్నాడుగా ఆ అబ్బాయి మంచివాడని'' అన్నాడు బాలు.

"ఊఁ..." అంది ఛాయ ఆలోచిస్తూ.

ఆ సాయంత్రం, ఛాయ రాములమ్మతో కలిసి బజారుకెళ్ళి సామాన్లుతీసుకొని వచ్చేసరికి, బాలు సంతోషపడుతూ ఎదురయ్యాడు సందు చివర్లో.

"అక్కా!" మనింట్లోకి కొత్తతను అద్దెకు వస్తాడని చెప్పలేదూపరంధామయ్యగారు ఆ అబ్బాయి మరెవరో కాదక్కా! ఆ రోజు హాస్పిటల్‌కు నిన్ను తీసికెళ్ళినవాడే. అతను చాలా మంచివాడక్కా! మనం అనవసరంగా భయపడ్డాం'' అంటూ

ఎంతో ఉత్సాహంగా చెబుతున్న బాలు మాటలను నిశ్చేష్టగా వింటూ వుండి పోయింది ఛాయ. బాలు పక్కనే నడుస్తూ ఏమిటేమిటో చెబుతున్నాడు.

వరండా మెట్లెక్కి, వరండా మీదిగా వెళ్ళగానే పరంధామయ్య ఎదురయ్యాడు.

"అమ్మాయ్ ఛాయా!" అంటూ ఆపేసాడు. అతను లోపల వున్నట్టున్నాడు.

"ఇతను బాలుకు బాగా తెలుసట. నువ్వేం భయపడకు. బాత్‌రూమ్ కెళ్ళాలన్నా మీకేం యిబ్బంది లేకుండా యిటుగా చుట్టూ తిరిగి వెడతాడు. సరేనా!" అంటూ వెళ్ళిపోతూ, "నే వెడతాను అబ్బాయ్" అంటూ పరంధామయ్య వెళ్ళి పోయాడు. ఛాయ చటుక్కున లోపలికి వెళ్ళిపోయింది.

"అతను...అతనే కదూ!" అన్న అనుమానం పీడిస్తోంది ఛాయను. అయినా వంటింట్లోనుండి బయటికి రాలేదు. బాలుమాత్రం అతడి గదిలోకెళ్ళి కూర్చున్నాడు తప్ప ఛాయ చాయలకు కూడా రాలేదు.

వంట ముగించేసమయంలో బాలు ఆత్రుతగా వచ్చి,—"అక్కా అతను వెళ్ళిపోతున్నాడు భోజనంచేసి వెళ్ళమని చెప్పనా?'' అన్నాడు ఛాయ వెంటనే సమాధానం చెప్పలేదు. తమ యింట్లో విలువైనది, చివరికి మిగిలింది, ఇత్తడి బిందె అమ్మేసింది. నలభైరూపాయలపైన వస్తే, నెలకు సరిపోయే సామాన్లు తెచ్చేసింది. అతనికి భోజనం పెట్టొచ్చు. కాని...తను ఎదురుపడి.. ఊహుఁ.

"అతను మనకెంతో సహాయంచేసాడు కదూ అక్కా''అన్నాడు బాలు ఛాయ మౌనం చూసి.

''ఊఁ...కాని .. మనింట్లో అన్నం,చారు తప్ప మరేంచేయలేదు బాలూ"అంది.

''పోనీ.. రేపు భోజనానికి రమ్మని చెప్పనా?'' అన్నాడు. ఛాయ మౌనం వహించేసింది.

వెళ్ళినట్టే వెళ్ళి మళ్ళీ తిరిగివచ్చాడు బాలు.

''అక్కా! అతను బజారుకు రమ్మంటున్నాడు వెళ్తున్నా" అన్నాడు ఛాయ వారించేలోగానే బాలు గబగబా కర్రలసహాయంతో బయటికి వెళ్ళి వరండామెట్లు దిగి, సందువైపు నడవసాగాడు. ఛాయ గుమ్మంలోకి వచ్చింది. సరిగ్గా ఆ సమయంలోనే, అతను గదిబయటికివచ్చి గదికితాళం వేస్తున్నాడు. వెనుకనుండి అతని ఆరడుగుల విగ్రహాన్నిచూసి అడుగు వెనక్కివేసి తలుపుచాటుకు తప్పుకుంది ఛాయ.



అతను ఛాయను చూళ్లేదు. మెట్లు దిగి, బాలును చేరుకొని భుజంమీద చేయి వేసి, బాలుతోపాటు మెల్లిగా నడుస్తూ వెళ్లిపోతున్న అతడ్ని చూస్తూ వుండిపోయింది ఛాయ.

హఠాత్తుగా చీకటి అలుముకున్న గదిలో వెలుగ రావడంతో ఛాయ ఉలిక్కిపడుతూ చూసింది. మూర్తి ఎప్పుడు వచ్చాడో...చీకట్లో గమనించలేదు. అతను లోపలికివచ్చి, లైటువేసి, కుర్చీలో కూర్చున్నాడు. అతణ్ణి చూస్తూనే ఛాయ కళ్ళు ఎఱ్ఱబారి నిప్పులు కురిపించసాగాయి. జుగుప్స నిండిన చూపులతో అతడివంక చూసింది. ఛాయ అలా చూడ్డంతో అతను తలవాల్చుకున్నాడు.

"నన్ను క్షమించు ఛాయా! ఆ రోజు సిగరెట్లకోసం నేను నిన్ను ఒంటరిగా వదిలి వెళ్ళడం...వర్షంలో తిరిగి చాలాసేపటివరకు రాకపోవడం, ఆ వెధవ...ప్చ్...నేను తిరిగి వెళ్లేసరికి అతనునన్ను తిట్టాడు. అంతేకాదు. .నీకు ఉద్యోగం యివ్వనన్నాడు. అతడి మాటలనుబట్టి అక్కడేం జరిగిందో ఊహించుకున్నాను. జరిగిందానికి నేను చాలా సిగ్గుపడిపోతున్నాను," అన్నాడు.

''మళ్ళీ ఎందుకొచ్చారు?" కటువుగా అడిగింది. అతను తలెత్తి దీనంగా చూసాడు. "నన్ను క్షమించు ఛాయా! నిజంగా అలా జరుగుతుందనుకోలేదు.

ఈ వీధిలోవాళ్ళందరికి, మా అమ్మకుకూడా నీ మీద సదభిప్రాయం లేదు. కాని ...నే నెప్పుడూ నిన్ను అలా చూడలేదు. నాకు.. నువ్వంటే ఇష్టం" అన్నాడు మెల్లిగా.

"ఇదో కొత్త వలనా మూర్తిగారూ! నన్నిలా బ్రతకనివ్వండి. మీ యిష్టాలు, జాలి నాకక్కర్లేదు. ఆనాడు జరిగిందానికి బాధ్యులు మీరు కాకున్నా...జరిగిందానికి నేను మిమ్మల్ని ద్వేషించినా మీ కవసరంలేదు. దయచేసి వెళ్ళిపోండి." అంది.

"ఛాయా! అంత నిర్దాక్షిణ్యంగా మాట్లాడకు. నేను...నిన్ను ప్రేమిస్తున్నాను" అన్నాడు ఆవేశంగా దగ్గరికి వచ్చి ఆమె భుజాలమీద చేయివేస్తూ.

నిర్ఘాంతపోయింది ఛాయ. "నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను" మూర్తిమాటలకు అర్థంకానట్టు చూసింది ఛాయ.

"పదండి మాస్టారూ!" అంటూ బాలు అనక్షంతో తలుపుతోసి ఒక్క అడుగు లోపలికి వేసిన అతను, ఛాయ భుజాలమీద చేతులువేసి ఆమె మొహంలోకి చూస్తున్న మూర్తిని చూస్తూనే ఆగిపోయాడు. అతణ్ణి చూస్తూనే ఛాయ ఉలిక్కిపడుతూ, మూర్తి చేతులను తీసేసి దూరంగా నిలబడింది. మూర్తి వెనక్కి తిరిగి చూసేసరికి అక్కడెవరూ కన్పించలేదు.

"అదేమిటి మాస్టారూ? అక్కతో మాట్లాడాలన్నారు. యింట్లోకి వెళ్ళరేం? అక్కలేదూ?" అన్న బాలు ప్రశ్నలకు అతను సమాధానం చెప్పకుండా గది తాళం తీసి లోపలికి వెళ్ళిపోయాడు. బాలు రావడంతో, మూర్తి వెళ్ళిపోయాడు.

జరిగిందానికి విస్తుపోతూ, అర్థంకాని, అయోమయంలోపడి బొమ్మలా నిలబడిపోయింది ఛాయ.

"మూర్తిగారెందుకు వచ్చారక్కా! ఆ రోజు చెప్పిన ఉద్యోగం విషయమేనా? ఏంజరిగిందట?" అన్నాడు బాలు. ఛాయ సమాధానం చెప్పకుండా గదిలోకి వెళ్లిపోయింది.

"పోనీలెద్దూ అక్కా! నీకు ఇవ్వరని చెప్పారా! వెధవ ఉద్యోగం రాకపోవడమే మంచిది. నీకు అంతకంటె మంచి ఉద్యోగం..." బాలు మాటలు పూర్తి కాకుండానే అర్థంచేసుకున్న ఛాయ కోపంగా "బాలూ!" అరిచినంతపనిచేసింది.

"నాకే ఉద్యోగం అక్కర్లేదు. నాకెవ్వరూ జాలీ, దయతో ఉద్యోగం చూసి పెట్టక్కర్లేదు. నే నసలు ఉద్యోగంచేయను" అంది గట్టిగా.

ఏనాడూ ఛాయ మొహంలో కనిపించని కోపానికి, కళ్ళలో చూడని ఎరుపు దనానికి, అర్థం తెలీక బిత్తరపోతూ చూసాడు బాలు.

"బాలూ! యింకెప్పుడూ నా ఉద్యోగం గురించికాని, మన యింటి పరిస్థితులను గురించికాని ఎవ్వరితో ఏమీ చెప్పకూడదు. తెలిసిందా?" అంది కోపంగా. బాలు తమ యింటి విషయాల గురించి అతను అడిగితే చెప్పాడేమో! అతనందుకే ఉద్యోగం యిప్పిస్తానన్నాడేమో! ఉహు ... అతని సహాయం తానుఅంగీకరించి భరించలేదు ఎందుకంటే ఆ సహాయం వెనక...

''సరే అక్కా? నీ యిష్టం వచ్చినవాళ్ళకే చెప్పకో. నే నెప్పుడూ ఏంచెప్పను" అంటూ బయటికి వెళ్ళిపోయిన బాలు వెనకేవెళ్ళింది, బాలుతోఅతను ఏమంటాడో వినాలని, తాను అన్నమాటలు విన్పించిన అతని వైఖరి గమనించాలని. కాని అతను గదిలో లేడు.

వారంరోజులు గడిచిపోయాయి. అతనితో బాలు స్నేహం ఎక్కువైంది. అతను యింట్లో వున్నంతసేపు బాలు అతనిగదిలోనే వుంటాడు. ఛాయ భోజనానికి పిలిచినా రాడు. చాలాసార్లు ఛాయకు అనుమానం కలిగేది! అతను తనగురించి అడుగుతున్నాడేమోనని. కాని బాలు, "ఛ...ఆయన ఒక్కసారి కూడా నీగురించి అడగలేదు. పొరపాటున నేను చెప్పినా మాట మార్చేస్తాడు. అయినా అతను నీ గురించి ఎందుకు అడుగుతాడు" అంటూ ఎదురు ప్రశ్నించేవాడు.

అతను యింట్లో వున్నంతసేపు, బాలుతో క్యారమ్స్, చెస్ ఆడుతూ గడిపేవాడు. బాలుకు పండ్లు, స్వీట్లు తెచ్చిపెట్టేవాడు. బాలుకు ఛాయ గుర్తుకొచ్చేది.

"మీ అక్కగారు చూస్తే తిడతారు! వద్దు బాలూ! నేను నీకోసమే తెచ్చాను. నువ్వు తింటేనే నాకు తృప్తి" అంటూ బాలుచేత తినిపించేవాడు.

అతను ఎన్నోసార్లు ఏమిటేమిటోతెస్తే తినేసాడు బాలు. అందుకే ఒక్కసారైనా అతనికి కాఫీ యివ్వాలన్పించేది. ఓ పూట భోజనానికి పిలవాలనిపించేది. కాని...ఛాయ ఏమంటుందోనన్న భయంతో ఊరుకునేవాడు.

అసలు అక్కకు అతనంటే ఎందుకు కోపం? అతనెప్పుడూ అక్కను ఒక్కసారీ పలుకరించలేదే? మరెందుకు కోపం? అర్థంకాలేదు, బాలుకు. ఛాయను అడగాలనుకునేవాడు. కాని...అతను వచ్చినప్పటినుండి అస్తమానం ఛాయ విసుక్కుంటూనేవుంది. గట్టిగా అరిచి మాట్లాడుతుంది.

ఆ పదిహేనురోజుల్లో మూర్తి ప్రతిరోజూ వస్తున్నాడు. ఎప్పుడూ ఏదో ఒకటి తీసుకొస్తున్నాడు.

"రేయ్ బాలూ! మూర్తిగారు వచ్చినప్పుడు నా దగ్గిరనుండి కదిలావంటే చంపేస్తా"నంటూ కఠినంగా శాసించింది ఛాయ. మూర్తి రావడం, రెండు నిమిషాలు మాట్లాడి, వెళ్ళిపోయాక అతను టేబుల్ మీద వొదిలిపోయిన పళ్ళూ, స్వీట్లు అవీ చెత్త డబ్బాలోకి విసిరేసేది.

"అలా విసిరేయకపోతే వద్దని చెబితే సరిపోతుంది" అన్నాడు బాలు ఓసారి ఉండబట్టలేక.

"మనిషి అన్నాక ఓసారి చెబితే వింటారు. వినకపోతే-మరి యిక యింతే" అంది ఛాయ.

"అక్కకు మూర్తిగారన్నా కోపమే. అయితేనేం, అతను మాట్లాడుతుంటే వింటుంది. తను మాట్లాడుతుంది. అలాగే అతనితో మాట్లాడకూడదూ!" అనుకునేవాడు బాలు అమాయకంగా.

ఆ రోజు ఆదివారం. ప్రొద్దుటినుండి అతను యింట్లోలేడు. బాలుకు ఎటూ తోచడంలేదు. వరండాలో కూర్చొని అతని రాకకోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు. ఐదున్నర అవుతూవుండగా అతను హడావుడిగా వచ్చాడు.

"ప్రొద్దుటినుండి ఎక్కడికెళ్ళారు. నాకేం తోచక పిచ్చెత్తిపోయింది" అని అంటున్న బాలు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతను చటుక్కున బాలుకు ఆసరాగా వున్న రెండు కర్రలను లాగిపారేసి అమాంతం లేవనెత్తి గుండెలకు హత్తుకున్నాడు.

"బాలూ! నేనంటే నీకు చాలా ఇష్టం కదూ?" అన్నాడు.

"అవును. చాలా ఇష్టం. మీరెప్పుడూ ఇలా నాతో మాట్లాడుతూ ఎదురుగా వుంటే ఎంతో బావుంటుంది" అన్నాడు.

''అమ్మ దొంగా, మరి నా ఉద్యోగం'' అంటూ నవ్వి, ''సరే మనిద్దరం సినిమాకి వెడదాం. ఇవాళ రామకృష్ణాలో మంచి సినిమా రిలీజ్ అయింది. కాని...వెళ్ళి మీ అక్కతో చెప్పిరా!'' అన్నాడు.

బాలుకు చాలా సంతోషం వేసింది. దాదాపు మూడు నాలుగు నెలలక్రితం ఏదో పాత సినిమాకి, మార్నింగ్ షోకి వెళ్ళాడు. ఆ తరువాత యిన్నాళ్ళకి... బాలుకు చాలా సంతోషంతోపాటు ఉత్సాహం వచ్చింది. కర్రలను గబగబా టాటిస్తూ ఛాయదగ్గరికి వెళ్ళి విషయం చెప్పాడు.

''వీల్లేదు,'' అంది ఛాయ కటువుగా.

"నువ్వు తీసికెళ్ళవు. నన్ను వెళ్ళనివ్వవు. ఎప్పుడూ యిలాగే ఈ కర్రల సహాయంతో యింట్లోనే తిరగాలి. ఎలాగు బజారుచూసే అదృష్టం కూడా లేదు" అన్నాడు బాలు ఏడుస్తూ.

"బాలూ! ఒక్కసారి చెప్పాగా వెళ్ళడానికి వీల్లేదని, ఏడ్పు మానెయ్ లేకపోతే—"

"ఏంచేస్తావ్! కొడతావ్ అంతేకదూ!'' అన్నాడు.

"ఆఁ...నా కిష్టంలేనిపని చేస్తే కొడతాను" అంది.

"నేను సినిమాకు వెళ్ళడం నీకిష్టమే. నీకిష్టంలేనిదెందుకో నాకు తెలుసు. నేను వారితో వెళ్తానన్నాననేగా? అసలు ఆయనెంతో మంచివాడు. ఆయనంటె నీకెందుకంతకోపం? రోజూవచ్చి మాట్లాడే మూర్తిగారిలా ఆయన ఒక్కసారి కూడా నీతో మాట్లాడాడా? అసలు ..నువ్వు..." బాలుమాట పూర్తికాకముందే ఛాయ చేయి విసురుగా లేచింది. అది బాలు చెంపను తాకకముందే ఆమె చేతిని ఓ బలమైన చేయి పట్టి ఆపింది. విసురుగా చూసింది ఛాయ

"అనవసరంగా బాలును కొట్టకండి ఛాయా! మీ కిష్టంలేనిపని బాలుచేత నేనెప్పుడూ చేయించను," అంటూ, ఆమె ముందే టిక్కెట్లు చించేసి, బాలువైపు తిరిగి "పద బాలూ! అలా పార్కుదాకా వెడదాం!" అన్నాడు.

బాలు ఛాయవంక నిరసనగా చూస్తూ వెళ్ళిపోయాడు అతను గదికి తాళం వేసి వెళ్ళిపోయాడు. స్థాణువులా నిలబడిపోయింది ఛాయ.

చాలాసేపటికి ఛాయ వరండామీదికొచ్చి నిలబడింది. అలుముకుంటున్న చీకటితోపాటు, ఆ వీధిలో నిశ్శబ్దం చోటుచేసుకోసాగింది. తమ యింటికి అతి దగ్గరగావుండే సుందరమ్మ భర్తతో షికారుకెళ్ళినట్టుంది. ఆ పక్క నుండే మరో రెండు యిళ్ళవాళ్ళుకూడా లేరు. గోడకిచేరగిలబడి నింగుని ఆకాశం వంక చూస్తున్న ఛాయ, మూర్తి రావడం గమనించలేదు.

"ఛాయా!" ఆమె భుజంమీద చేయివేస్తూ పిలిచాడు.

ఛాయ ఉలిక్కిపడింది.

"బాలు లేడూ?" అన్నాడు లోపలికి చూస్తూ.

''లేడు?" అంది.

"యిలా నిలబడ్డావేం? నాకోసమేనా?" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వెందుకో ఛాయ కతనిమీద జుగుప్స కలిగేలా చేస్తుంది.

"లేదు. బాలుకోసం చూస్తున్నాను" అంది నిర్లక్ష్యంగా.

మూర్తి దీక్షగా, మత్తుగా, కోర్కెగా ఆమెవంక చూస్తూ నిలబడ్డాడు. అతని వాలకం గమనించలేదు ఛాయ.

అతను కూర్చోవడానికి కుర్చీ తీసుకువచ్చి, వరండాలో వేస్తే తనకు కాస్త భయంలేకుండాపోతుందని "కుర్చీ తెస్తాను" అంటూ లోపలికి వెళ్ళిన ఛాయ వెనుకే వెళ్ళాడు మూర్తి.

"నాకిక మరో వారంరోజుల్లో ప్రమోషన్ వస్తుంది ఛాయా ప్రమోషన్‌తో పాటు వైజాగ్‌కు ట్రాన్స్‌ఫర్ అయింది. వెంటనే వెళ్ళిపోవాలి. అందుకని..." అంటూ ఆగిపోయాడు

ఛాయ పరీక్షగా చూసింది.

"నాతో నిన్ను తీసికెళ్ళా లనుకుంటున్నాను ఛాయా!" అన్నాడు.

ఛాయ బదులివ్వకుండా చూసింది.

"వస్తావుకదూ ఛాయా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను ఛాయా! నిజంగా నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను" అన్నాడు ఆవేశంగా ఛాయ భుజాలనుపట్టి తనవైపు తిప్పుకుంటూ. అతని కళ్ళలో, మొహంలో ఛాయ భయపడిపోయే భావం కదలాడింది.

"నువ్వు నాకు కావాలి ఛాయా!"అంటున్న అతని ధోరణికి ఛాయ విస్తుపోతూ విసురుగా తోసేయాలనుకుంది. రాను రాను అతనిలో మార్పురాసాగింది. అతను కప్పుకున్న మేకతోలు జారిపోసాగింది. ఆ నిశబ్దాన్ని కప్పుకున్న చీకటిలో మూర్తి కోరిక, ఆశ స్పష్టంగా తెలుస్తుంటే ఛాయ నిలువునా వణికిపోయింది. అతనిలోని పశుత్వం క్షణక్షణానికి విజృంభిస్తుంటే ఛాయ ధైర్యం, బలం నశించి పోసాగాయి. చివరికి, ఓడిపోయేముందు కనిపించే వెర్రి ఆవేశంతో ఛాయ అతణ్ణి విసురుగా, బలంగా తోసేసింది. అతను పక్కకు తిరిగి పడ్డాడు. ఛాయ రెండు అంగల్లో బయటికి వచ్చేసింది. ఎవరో తరుముతున్నట్టుగా వీధిలోకి పరుగెత్తింది.

"ఛాయా!" రాఘవ పిలుపు వింటూనే ఆగిపోయింది. అతని పక్కనే ఆయన పెళ్ళాం. ఛాయనుచూసి, యింట్లోకి తీసికెళ్ళింది. త్రాగడానికి మంచినీళ్ళు యిచ్చింది.

"ఛాయా! ఒక్కసారి ఆలోచించు! నువ్విలా ఒంటరిగా ఈ సంఘంలో వుండలేవు. ఎంగిలి విస్తరాకులా మిగిలిపోయే బదులు రమాపతిరావుగారి మాట

మృగాల్లా నీ వెంటపడే ఈ మనుష్యులకు దూరంగా, దర్జాగా, దర్పంగా, హుందాగా, గౌరవంగా బ్రతుకుతావు. బాలు సుఖపడాలనే నీ ఆశ తీరుతుంది."
రాఘవ, అతని భార్య చెప్పే మాటలు వింటూ వుండిపోయింది. ఆమె మనసు, వాళ్ళమాటలకు లొంగిపోసాగింది. చాలాసేపటికి యింటికి వచ్చింది ఛాయ. బాలుతోపాటు అతను ఆతురతగా వరండాలో నిలబడి ఎదురు చూస్తున్నాడు. ఆ రాత్రంతా ఛాయ ఏడుస్తూనే వుండిపోయింది. ఛాయ ఏడ్పును పసికట్టిన బాలుకు కారణం అడగడానికి సిగ్గువేసింది. కారణం తనే అనుకున్నాడు.

ఆ మర్నాడు ప్రొద్దుననగా బయటికి వెళ్ళిన ఛాయ సాయంత్రం ఏడుదాటినా యింటికి రాలేదు. భయంతో, దిగులుతో, బెంగతో వరండా మెట్లమీద కూర్చున్న బాలుకు కళ్ళలో నీళ్ళు తిరగసాగాయి. ప్రొద్దుననగా బాలుచేత అన్నం తినిపించి వెళ్ళిన ఛాయకోసం ఎదురుచూస్తూ ఆకలిమంట సైతం మరిచి ఎదురుచూస్తున్న బాలుకు అలుముకుంటున్న చీకటి రాత్రి భయాన్ని పెంచుతుంటే, పంచుకోవడానికి తోడుగా అతనుకూడా యింట్లోలేడు. ఒంటరితనం రాక్షసిలా బాలు పసి మనసును భయపెడుతుంటే రెండుచేతులతో మొహం కప్పుకొని కుళ్ళి కుళ్ళి ఏడవసాగాడు బాలు. క్రితంరోజు రాత్రంతా ఛాయ ఏడుస్తూ గడపడం, తెల్లవారగానే వంటచేసి తనచేత తినిపించి వెళ్ళిపోవడం గుర్తుకువచ్చి 'అక్క ఏమైపోయింది? ఎక్కడికి వెళ్ళింది?' అన్న ప్రశ్నలకు సమాధానం దొరకక, ఏడుస్తున్న బాలును ఓదార్చే దిక్కులేకపోయింది.

ఎనిమిది కావస్తుండగా అతను వచ్చాడు. అతణ్ణి చూస్తూనే బాలు బావురుమని ఏడుస్తూ అతన్ని చుట్టేసి అసలు విషయం చెప్పాడు. బాలు చెప్పినమాట వింటూనే నిర్ఘాంతపోయాడతను.

"నిన్న రాత్రంతా అక్క ఎందుకో నిద్రపోకుండా ఏడుస్తూ వుందండి. ప్రొద్దున మామూలుగానే లేచి వంటచేసి, మీరు వెళ్ళిపోగానె తను బయటికి వెళ్ళింది. యింతవరకు యింటికి రాలేదు" అన్నాడు బాలు.

"నిన్న రాత్రంతా ఛాయ ఎందుకు ఏడ్చిందో అర్థంకాలేదు అతనికి. నిన్న బాలును తనతో సినిమాకు పంపలేదు. బాలు బాధపడతాడని, పార్కువరకు వెళ్ళి కాసేపు కూర్చొని-తిరిగివచ్చేశారు. తిరిగి వచ్చాక కూడా బాలును ఛాయ ఏమీ అన్లేదు. మరి...ఉదయంనించి ఛాయ ఎక్కడికి వెళ్ళింది? యింత రాత్రి వరకు ఏంచేస్తోంది?''

"అక్కను వెతకాలి, పదండి! మీరు నాతో వస్తారుకదూ!" అంటున్న బాలు కళ్ళనీళ్ళు తుడిచి భుజంతట్టి ఓదారుస్తూ, "బాలూ! నువ్వు నడవలేవు. ఈ కర్రల సహాయంతో ఎంతదూరం అని వస్తావు! బహుశా మనం అటు వెళ్ళాక మీ అక్క వస్తే నువ్వు కనపడకపోతే కంగారుపడతదేమో! నువ్విక్కడే వుండు, నేను వెళ్ళి చూస్తాను" అన్నాడు.

"నాకు భయంగా వుందండి!'' అన్నాడు.

''ఫర్వాలేదు. మీ అక్కకేంకాదు. నువ్వు ధైర్యంగా ఈ వరండామెట్లమీద కూర్చో. నే వెళ్తాను. త్వరగా వచ్చేస్తాను." అంటూ అతను వెనక్కి తిరిగాడు.

సందు చివరికి వచ్చి రోడ్డువైపు చూసిన అతని కళ్ళు విశాలమై, మరుక్షణంలో కనుబొమ్మలు ముడుచుకున్నాయి. ఎదురుగా రోడ్డుమీద ఆగిన కారులోనుంచి దిగిన ఛాయను చూస్తూనే అతని మనసులో ఏమిటో ఆవేదన కదలాడింది. ఆ కారు ఎవరిదో అతనికి బాగా తెలుసు. అంతేకాదు. కారులో డ్రయివింగ్ సీటులో కూర్చున్న వ్యక్తిని, కారు దిగి అతనితో ఏదో మాట్లాడి తలూపిన ఛాయను చూసిన అతను తలపంకిస్తూ, ఇంటివైపు బయలుదేరాడు.

"నే వెళ్తానండి" అంటూ, రోడ్డు దిగి, సందు చివరకు వచ్చి గబగబా అడుగులు వేస్తున్న ఛాయ, కొద్ది దూరంలో, రెండు చేతులను పేంటు జేబుల్లో పెట్టుకుని మెల్లగా నడుస్తూ వెడుతున్న అతణ్ణి గుర్తించింది.

"అక్క వస్తోందా?" అంటున్న బాలు ప్రశ్నకు అతను సమాధానం యివ్వలేదు గది తలుపుల తాళం తీసి తన గదిలోకి వెళ్ళి తలుపువేసుకొని దీర్ఘంగా నిట్టూర్చి, కుర్చీలో కూలబడిపోయాడు.

"ఇంత సేపు ఎక్కడికి వెళ్ళావ్ అక్కా?" అంటున్న బాలు ప్రశ్నకు, ఆత్రుతగా జవాబుకు ఎదురుచూసాడు అతను.

"భయపడిపోయావా బాలూ! నే నెక్కడికి వెడతాను బాలూ! నిన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళను బాలూ! నీకోసమే...నీకోసమే వెళ్ళాను." ఛాయ మెల్లిగా చెప్పినా అతనికి విన్పించింది.

"ఎక్కడికి?''

"త్వరలో నీ కాళ్ళు బాగవుతాయి బాలూ! నిన్ను పెద్దాసుపత్రిలో చేర్పించి, నీ కాళ్ళు బాగుచేయిస్తాను. నువ్వు అందరిలా నడవగలుగుతావు. చక్కగా చదువుకొని, చాలా పెద్దవాడివి అవుతావు" అంది.

"మరి...నువ్వు...ఎందుకు ఏడుస్తున్నావు అక్కా?"

"ఛ...నేను ఏడవడంలేదురా బాలూ! నీ కాళ్ళు బాగవుతాయనే సంతోషం. అంతే." గాద్గదికంగా అంది ఛాయ. బాలుకేం అర్థంకాలేదు.

"మరి...డబ్బు...డబ్బు ఎలా వస్తుందక్కా? నీకు ఉద్యోగం దొరికిందా?"

"అఁ...చాలా డబ్బు వస్తుంది. నేను...నేను ఉద్యోగం వెతుక్కున్నాను కాదు కాదు. ఉద్యోగమే నన్ను వెతుక్కుంటూ వచ్చింది బాలూ. అదృష్టం కాదూ?" అంది కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ. "పద అన్నం తిందువుకాని" అంటూ బాలు మరేం అడగకుండా వంటింట్లోకి దారితీసింది. లీలగా విన్పించిన ఛాయ మాటలకు అర్థం అతనికి మెల్లగా బోధపడింది. సాలోచనగా తలపంకించా డతను.

* * *

"ఊఁ, అయితే బాలుకు కాళ్ళు బాగవ్వాలి-చదువుకోవాలి అంతేకదూ ఛాయా నీ ఆశ. ఓ...కె అలాగే" అన్నాడు రమాపతిరావు. అతనలా రెండురోజులుగా గంటకోసారైనా అనివుంటాడు. ప్రతిసారి అతనిమాటలకు ఛాయ అవునన్నట్లుగా తలూపింది.

"అయితే ఎల్లుండే బొంబాయికి వెడదాం. అక్కడే మంచి డాక్టర్‌కు చూపించి నర్సింగ్‌హోమ్‌లో బాలును చేర్పిద్దాం అంతేకాదు...ఈ చోటు వదలివెళ్ళితే, నీ క్కూడా ప్రశాంతంగా వుంటుంది. నీ కక్కడ బావుంటుంది అక్కడ నాకో మేడవున్న విషయం నీకు తెలుసుకదూ, అక్కడే శాశ్వతంగా నువ్వు వుండిపోవచ్చు. ఈ హైద్రాబాద్ వాతావరణం నాకు విసుగ్గావుంది...అన్నట్టు ఛాయా...మనం అక్కడికి వెళ్ళడంలో హనీమూన్ ట్రిప్ పూర్తిచేసుకున్నట్టు వుంటుంది," అన్నాడు ఛాయవంక చూస్తూ.

ఛాయ మాట్లాడలేదు. తల వాల్చుకుంది. సిగ్గుపడుతుందనుకున్నాడు రావు.

"ఛాయా, ఎన్నాళ్ళకు నా కోరిక తీరింది. నువ్వు ఒకనాడు, పిల్లలకు ఆయాగా ఈ యింట్లో ఉద్యోగానికి ప్రవేశించిన నాటినుండి...నిన్ను నాదాన్ని చేసుకోవాలని...నేను చాలా అదృష్టవంతుణ్ణి భాగ్యవంతుణ్ణి కావాలని అనుకునే వాణ్ణి...కాని నీ మొండితనం నన్నెంతో బాధపెట్టినా నీమీది అభిమానాన్ని మాత్రం తగ్గించలేకపోయింది. ప్చ్...ఏమైతేనేం, యిన్నాళ్ళకు నా చేతుల్లోకి వచ్చావ్!" అంటూ, ఆశగా ఛాయను సమీపిస్తున్న అతను, గుమ్మంలో బూట్ల చప్పుడు కావడంతో వెనుతిరిగాడు.

గుమ్మంలో నిలబడ్డ ఆరడుగుల నిండైన విగ్రహాన్ని చూస్తూనే కలవరపడి పోయాడు రావు. భృకుటి ముడివడిపోయింది. మొహం చిట్లించి చూస్తూ, కటువుగా అడిగాడు.

"ఎందుకొచ్చావ్?"

రావు మాటలకు తలవాల్చుకొని నిలబడ్డ ఛాయ కళ్ళెత్తి గుమ్మంలో నిలబడ్డ అతణ్ణి చూస్తూనే ఉలిక్కిపడిపోతూ, చటుక్కున తలవాల్చుకుంది. మనసులో ఏ మూలో వణుకులాంటిది ప్రారంభమై, తెలియని సిగ్గు, నిప్పులా కాలుస్తుంటే నిలబడలేక సోఫాలో కూలబడిపోయింది, బయటికి వెళ్ళిపోలేక.

"నేను వెళ్ళిపోతున్నాను. ఈ రాత్రికి నేను ఎక్కడికీ వెళ్ళడంలేదు" అన్నాడు.

"ఏం? ఒంట్లో బావులేదా?" ఆత్రుతగా అడిగాడు.

"ఊహు ... మనసేం బావులేదు. ఓ రెండురోజులు సెలవుకావాలి" అన్నాడు.

"ఎందుకు? ఆ...ఎందుకైతేనేంతే, నువ్వు రాకుండా ఉండడమే మంచిది. వెళ్ళు..." అన్నాడు.

"రేపు మీరు యింట్లోనే వుంటారా?" అతని ప్రశ్నకు రావు తడుముకుంటూ, "ఉండక ఎక్కడికి పోతాను. ఈ వారమంతా ఎక్కడికీ వెళ్ళటంలేదు." అంటూ హడావిడిపడుతూ అతణ్ణి పంపించి ఛాయవైపు తిరిగాడు.

"ఈడ్రయివరు చాకులాంటి కుర్రాడు ఛాయా. వాడి మంచితనం వాణ్ణి ఎన్నో చిక్కులు పెట్టింది. అయినా దాన్ని వొదులుకోడు. మత్తులా మనసంతా పాకి జిడ్డులా పట్టుకుని ఆ మంచితనం వాడ్ని..." అంటూ నవ్వుతూ, "ఆ మంచితనం వెనుకదాగిన మొండిపట్టుదలను నేనుసడలించగలిగితే-వాడు నా గుప్పెట్లోకి-ఓహ్ ...నాకు అడ్డు వుండదు." అని అనుకుంటూ తల పంకిస్తూ. 'అందుకే వాడికి నేను లొంగినట్టే లొంగి, వాణ్ణి లొంగదీసుకోవాలి' అని ఛాయవైపు తిరిగి వెయ్యిరూపాయలిస్తూ-

"ఎల్లుండి ప్రొద్దున్నే మన ప్రయాణం. రేపుసాయంత్రం రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్దాం. ఆ...ఈ డబ్బుతో అప్పులేమైనా వుంటే తీర్చి, యింటి అద్దె కట్టేసెయ్. రేపు మధ్యాహ్నం లాల్‌గారి దుకాణంలోకెళ్ళి నీ కిష్టమైనవి, నచ్చినవికావలసినన్ని చీరలు, ధర ఎక్కువైనా ఫరవాలేదు, కొనుక్కో! నేను ఫోన్‌చేసి చెబుతాను. నేను వచ్చేవాణ్ణే కాని...బొంబాయివెళ్ళి మనం తిరిగి రావడానికి ఎంతకాలం పడుతుందో-యిక్కడ పనులన్నీ చూసుకోవాలి" అన్నాడు.

కీ బొమ్మలా తలూపింది ఛాయ. కాని ఆమె మనసులో అతనిముందు రావు అలా మాట్లాడ్డం రావు ధోరణి నచ్చలేదు. ఏదో అనుమానం, నీడలా భయం...

అర్థంకాని ప్రశ్నలు...రావు మాటల్లో, 'అతను మంచివాడు...మంచితనం' అని విన్నాక ఛాయ ఆలోచనలకు అంతం అంటూ లేకుండాపోయింది.

రావు కార్లో యింటిదగ్గర ఛాయను దింపేసి వెళ్ళిపోయాడు.

వరండా మెట్లెక్కుతున్న ఛాయకళ్ళు అకస్మాత్తుగా అతని గదివైపు తిరిగాయి. రెండు మోకాళ్ళమధ్య తలానించి కూర్చున్న అతణ్ణిచూస్తే ఆ క్షణంలో ఎవరికైనా జాలివేస్తుంది. అతని కెదురుగా కూర్చున్న బాలు ఏమిటో అడుగుతున్నా, అతను సమాధానం చెప్పడంలేదు. క్షణంసేపు అక్కడాగిన ఛాయ తలుపు తీసుకొని తమ యింట్లోకి వెళ్ళిపోయింది. తలుపు చప్పుడుకు, బాలు తలతిప్పి వెనక్కి చూసి, లేచి గబగబా వచ్చాడు.

"అక్కా...ఆయన వెళ్ళిపోతున్నారక్కా!" అన్నాడు. బాలు కళ్ళు తడిసి వుండటం చూసి, "నువ్వెందు కేడుస్తున్నావ్?" అంది.

"అతను వెళ్ళిపోతున్నాడక్కా! మళ్ళీఎప్పుడూ మనకు కనిపించడట. నిజంగా అతనెంతో మంచివాడక్కా; నేనంటే ఆయనకు చాలా ఇష్టం."

"ఊఁ..." అంది ఛాయ ఆలోచిస్తూ. రావు నతడు రెండురోజులేగా సెలవు అడిగింది, అన్న విషయం గుర్తుకు తెచ్చుకుంటూ.

"సాయంత్రం ఆరుగంటలు దాటాక యింటికి వచ్చాడు. అప్పటినుండి ఇలాగే కూర్చున్నాడు. నేను ఎంత అడిగినా చెప్పడంలేదు."

"ఊఁ- ఆయనగొడవ మనకెందుకు పోనీలెద్దూ!" అంది.

"ఆయనంటె నీకెందుకు అక్కా అంతకోపం! ఆయన వెళ్ళిపోతున్నాడని తెలిసికూడా వెళ్ళి అడగవేం? ఎందుకో? ఎక్కడికో?" అని.

"చెప్పాగా బాలూ! ఆయన గొడవ మనకెందుకుగాని...పద భోజనం చేద్దువు గాని..." అంది.

"ఊహు నాకు ఆకలిగా లేదక్కా!" అంటున్న బాలు ఏడుస్తూ "వెళ్ళొద్దని చెప్పనా అక్కా!" అన్నాడు.

"బాలూ! పిచ్చిపిచ్చిగా వాగకు" అంది కోపంగా.

"నేను తినను పో..." విసురుగా బయటికి వెళ్ళబోయాడు బాలు.

"బాలూ! నీ మొండితనం మరీ పెరుగుతోంది! నేను అడుగుతాకాని...నువ్వు అన్నం తిందువుకాని రా..." అంది, బుజ్జగిస్తూ నచ్చజెప్పే ధోరణిలో.

"నిజంగా అడుగుతావా" అన్నాడు బాలు, నమ్మలేనట్టు. తలూపింది ఛాయ.

"అయితే పద" అన్నాడు బాలు.

"ముందు నువ్వు అన్నం తినరా బాలూ! నువ్వు తినగానే వెళ్ళి అడుగుతాగా" అంది. బాలు వినలేదు. "నువ్వు యిక్కడే వుండు అక్కా! ఆయన్ని నేనే యిక్కడికి పిలుచుకువస్తాను" అంటూ వెళ్ళాడు. ఛాయ కెందుకో ఆ క్షణంలో అతనికి తన మొహం చూపించాలన్నా, అతనితో మాట్లాడాలన్నా ఇష్టంలేదు. ఆ విషయం అర్థం చేసుకొని బాలును ఏమనాలో తోచలేదు. బాలు రెండు క్షణాల్లో తిరిగివచ్చాడు.

''ఆయన లేడక్కా! బహుశా హోటల్ కెళ్ళాడేమో భోజనంచేసి రావడానికి'' అన్నాడు బిక్కమొహం వేసుకొని—ఛాయ తృప్తిగా, తేలిగ్గా గాలిపీల్చుకుంది.

"ఆయన వచ్చేసరికి మనం భోజనం పూర్తిచేద్దాం రా బాలూ!'' అంది.

బొంబాయి వెళ్తున్నట్టు బాలుకు చెప్పాలన్పించింది ఛాయకు. కాని అంతలోనే బాలు, అతని కావిషయం చెబుతాడని, అతనికి తెలియడం అంత బావుండదని, మౌనం వహించింది.

భోజనం అయిందనిపించి, అతనికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు బాలు. "నువ్వు పడుకోకూడదు అక్కా! ఒకవేళ అతను వచ్చేసరికి నువ్వు పడుకుంటే, అతను ప్రొద్దున్నే వేకువజామునే లేచి వెళ్ళిపోతాడు" అంటూ ఛాయను పడుకో నివ్వలేదు.

రాత్రి పదకొండు దాటిపోయింది. కళ్ళమీదికొస్తున్న నిద్రను అతిప్రయత్నం మీద ఆపుకుంటున్న బాలూ అవస్థను, ఆ అవస్థ వెనుకే, అతనిపై బాలుకున్న అభిమానం చూసిన ఛాయ ఆశ్చర్యపోయింది.

బాలుకు అతనంటే ఎందుకంత అభిమానం? తను గుర్తించని, అర్థంచేసుకోని అతని మంచితనాన్ని బాలు గుర్తించి అర్థంచేసుకున్నాడా? అతనికికూడా బాలు అంటే చాలాఇష్టం. ఆ విషయం బాలు ఎన్నోసార్లు చెప్పాడు. కాని.. బాలుఅంటే అతని కెందుకంత ఇష్టం? బాలుఅంటే ఇష్టమేనా లేక, నడవలేడన్నజాలి, సాను భూతివల్ల ఇష్టం అని చెబుతున్నాడా- లేక...అతని మనసులో మరేదైనా ఆశ వుందా? బాలు ద్వారా తన మంచితనం, అభిమానం పొందాలనా? ఏమో! ఆలోచిస్తున్న ఛాయకు కొన్ని గంటలక్రితం రమాపతిరావు అన్న మాటలు గుర్తు కొచ్చాయి. 'అతను మంచివాడే' అన్న పదం చెవుల్లో మరోసారి మార్మోగింది. ఛాయ బాలువంక చూసింది. బాలు గాఢనిద్రలో వున్నాడు.

ఎక్కడో గడియారం పన్నెండుగంటలు కొట్టడంతో ఉలిక్కిపడుతూ తలుపు వేయడానికి లేచింది ఛాయ. గుమ్మంలో అతను. ఛాయ తీక్షణంగా చూసింది.

"ఛాయా! మీతో మాట్లాడాలి! ఒక్కసారి నా గదిలోకి రండి! బహుశా బాలు లేస్తాడేమో! మన మాటలు బాలు వినటం నా కిష్టంలేదు'' అన్నాడు.

ఛాయ కదల్లేదు. తిరస్కారంగా చూసింది.

"ప్లీజ్! ఒక్కసారి రండి! నేను మీతో మాట్లాడ్డం ఇదే చివరిసారి."

''ప్రామిస్ చేస్తారా?" అంది కటువుగా. అతను క్షణంసేపు ఆమె మొహంలోకి చూసాడు.

''ఆ...ప్రామిస్‌చేయటం నాకిష్టంలేదు. కాని మాట యిస్తున్నాను. మరెప్పుడూ మిమ్మల్ని విసిగించను, మాట్లాడను" అన్నాడు.

"ఏం మాట్లాడాలి?''

''ఛాయా! నా గదికి రండి! నేను...మామూలు మనిషిని మీ దృష్టిలో మంచి వాడిని కాకపోయినా...మనిషిని. మరో మనిషితో మనిషిలా తప్ప పశువులా ప్రవర్తించే క్రూరత్వంలేని మనిషిని," అన్నాడు. ఛాయ కదల్లేదు అతను నెమ్మదిగా తనగదిలోకి వెళ్ళిపోయాడు.

"బహుశా ఛాయకు నిజంచెప్పే అవకాశం నాకు కలగదు.'' అంటూ కిటికీ ఊచలకు తలానించి నిలబడ్డ అతను దీర్ఘంగా నిట్టూర్చి, ''ఛాయా! మొండి తనంతో జీవితాన్ని నరకంలోకి తీసుకెళ్తున్నావ్! నీకు నిజం ఎప్పుడు తెలుస్తుంది? ఎప్పుడో తెలిస్తే లాభమేమిటి...ప్చ్...''అంటూ మెల్లగా గొణుక్కున్నాడు అతను.

"నేను వచ్చాను," అంది ఛాయ గదిలోకి వస్తూ

అతను వెనుతిరిగాడు. దగ్గరగా వచ్చాడు.

''ఛాయా! ఓర్పుతో నేను చెప్పేది విని, నిజం అని నమ్మండి. ఆ తరవాత మీకేది మంచిదని తోస్తే అలా చేయండి. అంతేకాని...మీ మొండితనంతో నా మాటలు పూర్తిగా వినకుండా మాత్రం వెళ్ళకండి," అన్నాడు.

"ఊఁ...'' అంది కోపంగా. కోపంలో ఆమె చాలా అందంగా వుంటుందన్న నిజం అతనికి తెలుసు. రెండు క్షణాలు మైమరచి చూసి అసలు విషయం చెప్పాడు.

''అబద్ధం...'' గట్టిగా అరిచింది.

"లేదు ఛాయా, నేను నిజమే చెబుతున్నాను. అందుకే మీతో ముందుగానే చెప్పాను. రమాపతిరావులో అంతమంచితనంలేదు. అంత ఉదారత్వం లేదు. అంతే కాదు, స్త్రీని స్త్రీగా గుర్తించి గౌరవించే సహృదయత లేదు. ఆడదాన్ని ఆట బొమ్మగా ఆడించడమేకాదు, అతను ... అతను ఆడవాళ్ళతో వ్యాపారం

చేయిస్తాడు. వేలు గడిస్తాడు. తనకు కావలసిన పనులు చేయించుకోవడానికి వాళ్ళను ఫణంగా పెడతాడు. మిమ్మల్ని బొంబాయి తీసికెళ్ళి, తన అవసరానికి..."

"ఆపండి...నే నింక విన్లేను. ఇదంతా మీ కల్పితం, కట్టుకథ. అతనునన్ను ...నన్నలా చేయడు" అంది.

"వద్దు ఛాయా! అంత గుడ్డిగా అతణ్ణి నమ్మవద్దు...అతనికి నిజంగా మీమీద అభిమానంలేదు, బాలూమీద జాలీలేదు. అతని అవసరం తీరగానే మిమ్మల్ని అక్కడి నరకంలో వొదిలి, కదలకుండా, చివరికి చావకుండా కాపలాపెట్టి, బాలును ఏమైనా చేస్తాడు..." అతని మాటలు పూర్తికాకముందే ఛాయ అడ్డుకుంది.

"బాలు అంటే మీకెందుకంత ఇష్టం? అసలు బాలుద్వారా మీరు ఆశించేదేమిటి? మీకేంకావాలి? ఈ కట్టుకథలన్నీ చెప్పి ఎందుకు నన్ను భయపెట్టాలని చూస్తారు? నాకు తెలుసు మీకు బాలు అంటే జాలి. కాని...ఇష్టం అని అలంకారం చేసారు. బాలుద్వారా నన్ను...నన్ను..." ఛాయ మాటలు పూర్తి కాకముందే, ఛాయ చెంప చెళ్ళుమంది.

"ఛాయా! యిన్నాళ్ళూ మీరువొట్టి మొండివాళ్ళనే అనుకున్నాను. కాని...ఇంత సంస్కారహీనంగా, నీచంగా ఆలోచిస్తారని, ఎదుటి మనిషినింత అసహ్యంగా అంచనావేస్తారని అనుకోలేదు. సరే...మీకిప్పుడు మంచిచెప్పినా చెడుగా వుంటుంది-కాని...ఛాయా నా చివరిమాట వినండి. మీరంటే యిన్నాళ్ళూ నాలో అభిమానం వుండేది...కాని...ప్చ్...మీ రేమైనా నాకేంబాధలేదు. కాని...బాలును బొంబాయి వంపించి అక్కడి వీధుల్లో బిక్షమెత్తించే రమాపతిరావుతో బాలు వెళ్ళడు. వెళ్ళనీయను. బాలు నాతో వుంటాడు. బాలుకు వైద్యం నేను చేయిస్తాను. యింతే_యిక మీరు వెళ్ళండి" అన్నాడు కటువుగా.

*　　*　　*

కలతనిదురలోవున్న ఛాయ ఎవరివో మాటలు వినరావడంతో ఉలిక్కిపడుతూ లేచి కూర్చుంది. బాలు కన్పించలేదు. గాబరాగా బయటికి వచ్చింది.

"బాలూ! నువ్వు నాతో వచ్చేస్తావా? నేను నీకు వైద్యం చేయిస్తాను నీ కాళ్ళు ఎప్పటిలా మామూలుగా అయిపోతాయి. నాతో బాబాగారి దగ్గరికి వచ్చేస్తావా?" అంటున్నాడతను.

"మరి ..అక్క..."

"నేను నీ విషయం అడుగుతున్నాను బాలూ!" అతని కంఠంలో తొలిసారిగా కఠినత్వం ధ్వనించింది.

"అక్క ఒక్కత్తే వుంటుంది... పాపం! అక్కను తీసికెళ్దాం."

"గుడ్...అయితే నువ్వు వస్తున్నావ్‌కదూ! మీ అక్క రాకున్నాసరే, నువ్వు నాతో రావాలి" అంటూ బాలు దగ్గరగావచ్చి, బాలును గుండెలకు హత్తుకుంటూ, "బాలూ! ఈ కాళ్ళులేని నీ కుంటితనం ఆసరాతో ఆ దుర్మార్గుడు, నీతో వీధిలో బిక్షమెత్తిస్తాడు. నిన్ను చూడాలనుకునే మీ అక్కయ్యకళ్ళకు సైతం కనపడ నీయకుండా ఆ కసాయివాడు ఏమైనా చేయగలడు. వీల్లేదు, నిన్నలా అన్యాయంగా చచ్చిపోనివ్వను బాలూ!" అతని కన్నీళ్ళు బాలు తలమీద పడ్డాయి-అతని మాటలు విన్న బాలు భయంగాచూస్తూ, అర్థంకానట్టు చూశాడు.

"ఓహ్...భయపడకు బాలూ! నే నిందాక అన్నమాటలు నీగురించికాదు. సరే కాని...వస్తావుకదూ నాతో!" అతని ప్రశ్నకు బాలు అమాయకంగా తలూపాడు. అతను బాలు నుదుటిమీద ముద్దుపెట్టుకొని," అయితే పద...మీ అక్కకుచెప్పి వెళ్ళిపోదాం" అంటూ సూట్‌కేసు అందుకొని, బాలు భుజం చుట్టూ చేయి వేసి, గుమ్మంవైపు తిరిగిన అతను, గుమ్మంలో నిలబడి, చూస్తున్న ఛాయను చూసి, బాలు భుజాన్ని చుట్టిన చేయి లాక్కొని, "వెళ్ళి చెప్పిరా బాలూ!" అన్నాడు.

"అక్కా! ఆయన...నన్ను...బాబాగారిదగ్గరికి...తీసికెళ్ళి...నా కాళ్ళుబాగు చేయిస్తారట. నన్ను...రమ్మంటున్నారు. నువ్వు. .నువ్వు రా అక్కా!"అన్నాడు దగ్గరిగావెళ్ళి భయంగా.

ఛాయ పక్కున నవ్వింది. బాలును దగ్గరికి లాక్కొని గుండెలకు హత్తుక్కుంది. "వెళ్ళు బాలూ! నేను రాను. కాని. .నువ్వు వెళ్ళు. వెళ్ళాలికూడా."

అతను కళ్ళెత్తి చూసాడు. ఛాయ నవ్వుతూ చెబుతోంది మాటలు. కాని కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. అతను నిర్ఘాంతపోతూ చూశాడు.

"అక్కా!..." బాలు ఏదో అనబోయాడు.

"వెళ్ళు బాలూ!" అంటూ బాలును వొదిలేసి, యింట్లోకి వెళ్ళి తలుపులు వేసుకుంది ఛాయ.

"అక్కా! తలుపు తీయవూ?" బాలు ఏడుస్తూ పిలిచాడు.

"బాలూ! తలుపుతీయమని చెప్పు బాలూ!" అతని గొంతులో కంగారు, బాధ స్పష్టంగా కనిపిస్తోంది.

"బాలూను తీసికెళ్ళండి! నాకేం ప్రమాదం జరగదు. నేను నిక్షేపంగా

వుంటాను. బాలును తీసికెళ్ళండి ప్లీజ్! యింకా యిక్కడే వుంటే...మీ భయాన్ని నిజంచేస్తాను...నేను...మొండిదాన్ని. మొండిగా బ్రతికేయగలను. బాలును తీసి కెళ్ళండి" లోపలినుండి చాయ గొంతు వింటూనే అతను బాలును తీసుకొని వెళ్ళిపోయాడు

వాళ్ళు వెళ్ళినచాలా సేపటికి ఛాయ తలుపు తెరిచి బయటికి వచ్చింది. వరండాలో రాఘవ నిలబడివున్నాడు.

"రాఘవగారూ! ఈ కవరు రమాపతిరావుగారికి అందజేయండి. నేను మరో గంటలో వస్తున్నానని చెప్పండి...బజారుకెళ్ళాలన్నారు" అంది. అనుమానంగా నిలువుగా తనను పరీక్షిస్తున్న రాఘవతో ఛాయ నవ్వేస్తూ, రాఘవను తనకు కాపలాగా రమాపతిరావు పంపించాడన్న నిజాన్ని అర్థంచేసుకుంది ఛాయ.

"ఛాయా! అలావున్నావేం..." అతనేదో అడగబోయాడు.

"రేపు నేనూ, రమాపతిరావుగారూ బొంబాయి వెళ్తున్నాం! ఇవాళ బజారు కెళ్ళాలి! ఆఁ...త్వరగా వెళ్ళండి! నేను స్నానంచేసి తయారై వస్తాను" అంటూ రాఘవను తరిమేసింది ఛాయ.

అతను వెళ్ళిపోయిన పావుగంటకు తనకున్న రెండు చీరలు సంచీలో కూరు కొని, గబగబా నడుస్తూ రోడ్డుమీదికొచ్చింది ఛాయ.

* * *

కెవ్వున కేకవేస్తూ కదిలింది రైలు. అరటిపళ్ళు కొని, కిటికీలోనుంచి బాలుకు అందించి, కంపార్టుమెంటులోకి వెళ్ళబోతున్న అతను, దూరాన్నుండి ఛాయ పరుగెత్తుకుంటూవస్తూ "బాలూ" అంటూ పిలిచిన పిలుపు వింటూనే ఆగి చూశాడు.

రైలు అంతకంతకు వేగాన్ని అందుకుంటోంది. ఛాయ కాళ్ళలో బలం నశించి పోయి, నీరసం ఆక్రమించుకోసాగింది. చేతిలోని సంచీ పెద్ద బరువుగా తోచసాగింది. కళ్ళముందుచీకటి...కాళ్ళు తేలిపోతున్నాయి. గాలిసరిగ్గా అందడం లేదు...వేగంగా పరుగులాంటి నడకతో స్టేషన్ చేరుకొని, తీరా రైలు కదులు తుందనగా ఆదరాబాదరాగా టికెట్టు లేకుండానే ప్లాట్‌ఫామ్ వైపు పరిగెత్తుతూ ఓవర్‌బ్రిడ్జిని దాటివచ్చేసరికి, ఆయాసం ఎక్కువైపోయింది. ఇక పడిపోతానేమో అనుకుంటున్న ఛాయ, కంపార్టుమెంటును చేరుకుందేకాని ఎక్కలేకపోయింది.

కళ్ళకు చీకటితప్ప మరేం కనిపించడంలేదు. కంపార్టుమెంటును చేరుకున్నా నన్న ధ్యాసలేదు. యింకా ముందుకు వెళ్ళిపోబోయింది, కాని..."అక్కా" అన్న

బాలు పిలుపుకు, బరువుగా మూతలుపడుతున్న కళ్ళను తెరిచి, తూలిపోతున్న శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ, "బాలూ!" అంది. ఆశబ్దం ఆమెకే విన్పించలేదు. పడిపోతున్న ఆమె నడుంచుట్టూ ఎవరిదో బలమైన హస్తం పెనవేసుకుపోయి, అమాంతం గాలిలోకి లేపింది.

ఛాయను పడిపోకుండా, రైలు తప్పిపోకుండా ఆమెను చేతితో చుట్టేసి లేపాడే కాని, తల వాల్చేసిన ఛాయను ఓచేత్తో, తలుపు పక్కనున్న మరోచేత్తో రాడ్‌ను పట్టుకొని, కంపార్టుమెంటులోకి ఎలాదింపాలో తెలీలేదు. అంతకంతకు వేగాన్నందు కున్న రైలు ప్లాట్‌ఫాం దాటేసింది. బాలు ఏడ్పుకు, ఇద్దరుముగ్గురు సాయం రావడంతో, ఛాయతోపాటు అతను, కంపార్టుమెంటులోకి వెళ్ళిపోయాడు.

చాలాసేపటికి తెలివి వచ్చింది ఛాయకు. ఆత్రుతగా ఆమె మొహంలోకే చూస్తున్నాడతను. ఛాయకళ్ళు తెరవడంతోనే అతని కళ్ళు వెలుగుతో నిండాయి. చూపు తిప్పుకొని బాలువంక చూసాడు

''ఎలావుందక్కా! అప్పుడే మాతో వచ్చేస్తే పోయేదిగా" అన్నాడు బాలు ఆప్యాయంగా, ఆనందంగా చూస్తూ. మెల్లగా లేచి కూర్చుంది ఛాయ

"కాఫీ వుంటే యివ్వు అబ్బాయి. కాస్త కోలుకుంటుంది'' ఎదురుగా కూర్చున్న ఓ నడివయసావిడ అంది.

అతను ఫ్లాస్కులో కాఫీ వొంపి యిచ్చాడు. కాఫీతాగి కాస్త స్థిమితపడింది ఛాయ. తను పరుగెత్తుకు రావడం తప్పితే రైల్లోకి ఎలా వచ్చిందో అర్థం కాలేదు. కాని, తనకు తెలివొచ్చాక, చుట్టుప్రక్కలవాళ్ళు అనుకుంటున్న మాటలనుబట్టి విషయం అర్థంచేసుకొని, తొలిసారిగా కృతజ్ఞతాపూర్వకంగా అతనివంక చూసింది ఛాయ. కాని...అతను, కిటికీ పక్కనే కూర్చుని, బయటికి నిర్లిప్తంగా చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

'తను రావడం ఇష్టంలేదేమో!' అనుకుంది అంతలోనే.

'బాలును వొదిలి తానుండలేదు. అందుకే వస్తోంది. బాలును తీసుకువెళ్ళ డానికి అతనికి అధికారం ఎవరిచ్చారు? తనే...తీసికెళ్ళమని చెప్పింది-తను కూడా వస్తోంది.'

'కాని...అతనితో వెళ్ళడానికి నీకున్న హక్కేమిటి?' ఏ మూలోవున్న అంతరాత్మ ప్రశ్నించింది.

'నేను అతనితో వెళ్ళడంలేదు. బాలుతో వెడుతున్నాను అంతే.'

'కాని...బాలు అతనితో వెళ్తున్నాడు.'

"అయితే బాలుకు ఏ అధికారం, హక్కు వున్నాయ్?"

"బాలు అంటే అతని కిష్టం, బాలుకు అతనంటే ఇష్టం. వాళ్ళిద్దరి మధ్య స్నేహం, ఆత్మీయత వున్నాయి...మరి నీకో..."

"నాకు...నాకు...జవాబుకు తడుముకుంటూ అతనివంక చూసింది. అతనిలో ఎలాంటి మార్పూలేదు. తదేకంగా బయటికే చూస్తున్నాడు.

'అతను ఏ అధికారంతో, ఏ హక్కుతో తనను...రాత్రి చెంప చెళ్ళుమనిపించాడు?'

'నీ మూర్ఖపు పట్టుదలకు నంస్కారం, వివేకం మరిచి, అతనిలోని మంచితనాన్ని అర్థంచేసుకోకుండా నీచంగా మాట్లాడితే-అలా కొట్టాడు. ఆ కొట్టడానికి హక్కు, అధికారం వుండక్కర్లేదు. అతణ్ణి నువ్వుఅవమానించావ్, అతను కొట్టాడు.'

కాని...నిజానికి అతను తనను ఆ దెబ్బ కొట్టినందుకు తను బాధపడుతోందా? లేదు. ఆ దెబ్బ తన కళ్ళు తెరిపించింది. తన భావికి దారిచూపించింది. అతనికి తను ఎంతో రుణపడివుంది' అని అనుకుంటూ అతనివైపు చూసింది. అతనూ సరిగ్గా అదేక్షణంలో ఆమెవంక చూసాడు.

"టికెట్!'' అంటూ వచ్చిన వ్యక్తిని చూస్తూనే ఛాయ మొహం వెలవెలబోయింది. అంతకు క్రితమే, తనది, అతనిది అన్నట్టుగా జేబులోని టికెట్లు తీసి చూపించాడు బాలు. ఛాయ బిక్కమొహం వేసింది.

"ఆ అమ్మాయి రైలు కదిలాక వచ్చింది బాబూ! హడావుడిలో కొనలేదేమో!" అంది ఛాయ ప్రక్కన కూర్చున్న ఆమె.

''అయితే యిప్పుడు కొనండి !" అన్నాడతను.

ఛాయదగ్గిర డబ్బులేదు.

"యివ్వవేం? ఘరానాగా..." అంటూనే భుజంమీద ఎవరిదో చేయిపడ్డంతో ఆగిపోయాడు.

"ఇదిగో డబ్బు. రైలు కదలడంవల్ల టికెట్టు తీసుకోలేకపోయాం. క్షమించాలి!" అని అంటూ అతను డబ్బు చేతిలో పెట్టాడు.

''అలా ఊరికే కూర్చుంటావేం తల్లీ! అబ్బాయితో చెప్పవేం?" అన్నది ఇందాకటి ఆమె.

''మొగుడూ పెళ్ళాం పోట్లాడుకున్నారు కాబోలు. అతను వచ్చేసాక బుద్ధికుదిరి ఆ అమ్మాయి వెనకే వచ్చింది" అంటూ తన ఎదురుగా కూర్చున్న ఆవిడ,

పక్కనే కూర్చున్న భర్తతో గుసగుసగా చెప్పడం విని ఛాయ ఉలిక్కిపడుతూ బాలు పక్కనున్న అతన్ని చూసింది.

సాయంత్రం నాలుగు కావస్తోంది. ఓ చిన్న పల్లెటూరులో దింపేసి వెళ్ళిపోయింది రైలు. క్రిక్కిరిసి పోట్లాడుకుంటున్న బస్సులో బాలు, ఛాయ కూర్చోవడానికి చోటుచూసి, కూర్చోబెట్టి తను నిలబడ్డాడు. దాదాపు ముప్పావుగంటసేపు ఊగుతూ, సాగి ఆగిపోయింది బస్సు. అతనితోపాటు ఛాయను, బాలును దింపి దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయింది బస్సు.

"యింకా ఎంతదూరం వెళ్ళాలి?" స్వగతంగా అనుకోబోయి, గట్టిగానే అంది ఛాయ, అతను దిక్కులు చూడ్డం గమనించి, కనుచూపుమేరలో యిళ్ళుకాని, చివరికి మనుషుల అలికిడికాని కనిపించకపోవడంతో.

"బాలూ! దాదాపు మైలున్నర దూరం వుంటుంది! నువ్వు నడవగలవా! లేక ...ఎత్తుకోనా?" అన్నాడు.

"రైల్లో, బస్సులో కూర్చొని విసిగిపోయాను. నేను నడుస్తాను," అంటూ హుషారుగా కర్రలను ఆసరాచేసుకొని కదిలాడు బాలు. ఓ చేత్తో సూట్‌కేసు, మరో చేత్తో బాలు భుజాన్ని పట్టుకొని, ముందు నడుస్తున్న అతణ్ణి అనుసరించింది ఛాయ.

"అబ్బా!" అంటూ నిలబడ్డచోటే కూలబడిపోయింది ఛాయ. రైలుకోసం పరిగెత్తి వచ్చేటప్పుడు చెప్పులు మొండికేయడంతో ఈడ్చుకురాలేక, విసిరేసి వచ్చేసింది. అసలే అడవిప్రదేశంలా వున్న ఆ దారిలో పల్లేరుకాయలు పరుచుకొనివున్నాయి. అరికాలిని గుచ్చుకున్న పల్లేరుకాయలను లాగేసి, కాలు నేలను మోపిన ఛాయ కాలును పొడుగాటిముల్లు, ఆప్యాయతగా ముద్దుపెట్టుకుంది. రక్తం బొటబొట కారుతుంటే ముల్లును లాగలేకపోయింది ఛాయ. ముందుగా వెళ్తున్న వాళ్ళు ఛాయను గమనించలేదు. చాలాదూరం వెళ్ళాక, వెనుక ఎలాటి సవ్వడీ రాకపోవడంతో అతను ఆగి వెనక్కి తిరిగిచూసాడు.

బాలును అక్కడేనుంచోబెట్టి తను వెనక్కితిరిగి వచ్చాడు. అరికాలుపట్టుకొని చూస్తున్న ఛాయ దగ్గిరికి వచ్చి, మోకాళ్ళమీద కూర్చొని, ముల్లు లాగేసి, తన జేబులోని కర్చీఫ్‌ను కట్టి, తను వేసుకున్న రబ్బర్ స్లిప్పర్లు అక్కడే వొదిలేసి ముందుకు కదిలాడు. ఓ మూల రోషం, అభిమానం పెల్లుబికి రాగా మౌనంగా స్లిప్పర్లు వేసుకొని అనుసరించింది ఛాయ.

* * *

బాబాగారి వయసు అరవై సంవత్సరాలుంటుంది. పండిన జామపండులాంటి

దేహచ్ఛాయతో, వెండిలా మెరిసే బారెడు గడ్డంతో, ఆరడుగులకంటే కూడా ఎత్తుగా వుండి నిండుగా వుండే బాబాను తొలిసారిగా చూసిన, ఎవరికైనా చేయెత్తి నమస్కరించాలనిపిస్తుంది. అరవైఏళ్ళు దాటినా, కంటిచూపు సరిగ్గా వుందతనికి. పెదవులమీద ధైర్యాన్నిచ్చే చిరునవ్వు...ఆశ్రితులపాలిటి అభయ ముద్రలా వుంటుంది.

సాయంత్రం వేళ కుటీరంలాంటి యింటిముందు వాలుకుర్చీలో కూర్చొని, ఏదో పుస్తకం చదువుకుంటున్న అతడు, "బాబా!" అన్న పరిచితమైన పిలుపు వింటూనే తలెత్తిచూసాడు. బాబా కళ్ళు క్షణంలో మెరిసాయి.

"వాసూ!" అంటూ చేయిచాచి, అతణ్ణి గుండెలకు హత్తుకున్నాడు. పసి పాపలా ఆయన పరిష్వంగంలో వొదిగిపోయాడు. అంతవరకు రైల్లో, బస్సులో చేసిన ప్రయాణపు బడలిక, నడిచివచ్చినందువల్ల పడ్డ శ్రమ, బాధ మరిచి పోయాడు

"చాలారోజుల తరువాత నన్ను చూడాలనిపించిందా వాసూ! బాబా యిన్నా ళ్ళకు గుర్తుకొచ్చాడా? ఎన్నాళ్ళకు మళ్ళీ వచ్చావ్ వాసూ!" అంటూ వొళ్ళంతా నిమురుతూ, "చిక్కిపోయావేం, మొహం అలా పీక్కుపోయిందేం?" మొహాన్ని రెండుచేతుల్లోకి తీసుకుంటూ అడిగాడు. బాబా ఆప్యాయతకు, ఆదరణకు, వాసుకళ్ళు నీళ్ళతో నిండాయి

"బాబా! ఎవరొచ్చారో చూడు! నీకో మంచి స్నేహితుడిని తీసుకువచ్చాను" అన్నాడు వాసు, బాలూని చూపిస్తూ.

వాసు వెనకేవున్న బాలును, అతని కర్రలను చూసి దగ్గరగా వెళ్ళి "నేస్తం! నడవలేక నడవలేక, నడవరాక, నా యీ కుటీరానికి వచ్చావ్! పరుగు నేర్చు కొని పారిపోవు కదూ! నీకు నేను పరుగు నేర్పుతానోయ్" అంటూ బాలును దగ్గరికి తీసుకొని తలనిమురుతూ, ''వాసూ! ఈ బాబును ఎందుకు తీసు కొచ్చావో నాకు తెలుసు బాబుని బాగుచేస్తాను" అంటూ, "నీ పేరేమిటోయ్ నేస్తం అన్నాడు."

"బాలు...బాలసుబ్రహ్మణ్యం" అన్నాడు.

"ఓహ్...బాలు...చాలా అందమైన పేరు," అంటున్న బాబా చూపు అల్లంతదూరంలో దీక్షగా తనవంకే చూస్తున్న ఛాయమీద పడింది. వాసువంక చూసాడు.

"బాలు అక్కగారు బాబా!" అన్నాడు వాసు

"రామ్మా ! అక్కడే ఆగిపోయావేం ?" అన్నాడు. ఛాయ నెమ్మదిగా కదిలివచ్చింది. ఆ మెకళ్ళలో బాబా రూపం, చెవుల్లో బాబా పిలిచిన అతని పేరు .. వాసు...వాసు...అన్న రెండక్షరాలు సముద్రపు ఘోషలా వినపడుతుంటే, బాబా చేయూపడంతో కదలివచ్చింది బాబా ఛాయను వేసే ప్రతి ప్రశ్నకు బాలు సమాధానం చెప్పాడు. ఛాయ తలవాల్చుకొని కాలికి కట్టుకున్న కర్చీఫ్‌వంకే చూస్తూ వుండిపోయింది.

"బాధగా వుందా ఛాయా ! నేను మందువేస్తాలే అమ్మా ! ముందుగా వెళ్ళి, చన్నీళ్ళతో స్నానం చేసెయ్. కాస్త ప్రయాణపు బడలిక పోతుంది" అన్నాడు. ఛాయకు ప్రాణం వచ్చినట్టయ్యింది. బాబా కుటీరం వెనుకవున్న బావిని చూపించాడు. ఛాయ వెళ్ళేసరికి, వాసు బావిలో నీళ్ళు తోడుకొని స్నానం చేసి వచ్చేసాడు.

ఛాయ స్నానం ముగించుకొని వచ్చేసరికి ఛాయ గురించి, బాలు గురించి వివరాలన్నీ క్లుప్తంగా చెప్పాడు.

"బాబా ! ఛాయకు బాలు తప్ప మరెవ్వరూ లేరు. ఆ అబ్బాయి కాళ్ళు బాగు చేయించాలనే కోర్కె, ఆశతో రమాపతిరావు వెంటకూడా వెళ్ళడానికి అంగీకరించింది. కాని...బాలును నేను బాగుచేయిస్తానని తీసుకువచ్చాను. ఈనాటి నుండి బాలు బాధ్యత మీమీద పెడుతున్నాను బాబా! బాలును బాగుచేయండి. ఛాయ చాలా మొండి స్వభావిలా కన్పిస్తుంది. అభిమానం అణువణువునా నింపుకొన్న, ఛాయ ఏనాడూ బాధపడకుండ చూడండి ! ఈ సంఘంలోకి, తిరిగి ఛాయ వెళ్ళాలనుకునేలోగానే, బాలును బాగుచేసి అందించండి బాబా ! ఒంటరి ఆడపిల్ల అనగానే మృగాల్లా వెంటపడే వాళ్ళనుండి తనను తాను రక్షించుకోవడానికి, ఛాయకు ఒక్క ఆత్మస్థైర్యమేకాదు, బాలు తోడు అవసరం. కనీసం ఛాయ తనకు ఓ తోడు వెతుక్కునే వరకు.'' వాసు చెప్పే మాటలన్నీ శ్రద్ధగా విన్నాడు బాబా.

వాసు వెళ్ళిపోతుంటే బాలు కళ్ళలో నీళ్ళుతిరిగాయి.

"మీరు మళ్ళీ ఎప్పుడొస్తారు ? తర్వగా వచ్చేస్తారు కదూ!" అన్నాడు. వాసు బాలు తలని ఆప్యాయతగా నిమురుతూ, "చాలా త్వరగా నిన్ను చూడ్డానికి వస్తాను బాలూ! నేను రాకపోతే బెంగపడకు. బాబాగారున్నారు కదూ ! నిన్ను బాగుచేయించాలనే నా ఆశ ఎలాగైనా తీరుతుంది బాలూ ! ఒంటరిగా ఆత్మీయత అంటే ఏమిటో తెలియని నాకు తొలిసారిగా నీ పసిమనసులో నన్ను మంచి

వాడిగా తలచి, స్నేహాన్ని పంచావ్! ఈ విధంగా నీ రుణం తీర్చుకోలేను. అంటూ బయలుదేరాడు.

"వాసూ! ఉద్యోగ ప్రయత్నం ఫలించినా ఫలించకపోయినా నువ్వు త్వరగా తిరిగిరా! బాలు బెంగపడిపోతే బావుండదు" అన్నాడు బాబా!

"అలాగే బాబా!" అంటూ మరోసారి బాబా చేతులు పట్టుకొని, "వాళ్ళు జాగ్రత్త" అని చెప్పి వెళ్ళిపోయాడు వాసు.

వాసు బయలుదేరాడన్న మాటేగాని, తొలిసారిగా అతని మనసులో, మెదడులో, రేపటిగురించి ఆలోచనలు చోటుచేసుకున్నాయి. తను ఒంటరిగా వున్నప్పుడు, 'రేపు' అనేదాన్ని గురించి ఆలోచించే అవసరం కలగలేదు. తన సంపాదనలో తన ఖర్చులు పోగా, మిగిలింది బాబాకు పంపించేవాడు. మిగలక పోతే లేదు. తనకో పూట గడవదేమో నన్న బెంగ, దిగులు వుండేవికావు.

కాని...ఈనాడు బాబాకు ఛాయను,బాలూని అప్పగించి బయలుదేరాడు. బాబా ప్రకృతి వైద్యంలో నిపుణుడు. ఆ కుటీరానికి దూరంగా వుండే పల్లెలోని వాళ్ళు చుట్టుప్రక్కల పల్లెవాళ్ళలో అందరికి బాబా తెలిసినా, చాలా తక్కువ మంది బాబా దగ్గరికి వైద్యానికి వస్తారు. కారణం మరేంలేదు. బాబా వైద్యం వారాలతరబడి, నెలల తరబడి, ఒకోసారి సంవత్సరాల తరబడి జరుగుతూ వుంటుంది. ఆయన వాళ్ళదగ్గరినుండి తీసుకునేది చాలా స్వల్పం. అయినా అంతకాలం నిరీక్షణ వాళ్ళ ఓర్పుకు ఓ పరీక్షకాగా, ఊళ్ళోకి, డాక్టర్ చదువు పూర్తిచేసుకొని, పల్లె సీమలకు ఆదర్శం అంటూ వచ్చే డాక్టర్లవల్ల, బాబా రాబడి తగ్గిపోయింది. ఈ విషయంలో బాబా బాధపడలేదు. "నిజమే" అని నిట్టూర్చి "పాపం! ఎవరైతేనేం! వాళ్ళ జబ్బులను బాగుచేస్తే చాలు" అనుకునే వాడు. అతని ఒక్కడి జీవితం ఎంతో హాయిగా, సాఫీగా, ప్రశాంతంగా గడిచి పోతోంది. వాసు పంపే డబ్బు ఎవరికైనా సహాయం చేయడానికి ఉపయోగించే వాడు తప్ప తన అవసరాలకు ఉపయోగించుకునేవాడుకాదు. తన అవసరా లేమిటి? అందులో తీరనివంటూ లేవే అనుకునేవాడాయన.

ఇప్పుడు బాబాకు తోడు ఛాయ, బాలూ! వాళ్ళిద్దరికి భోజనానికి అయ్యే ఖర్చు బాబా భరించలేకపోవచ్చు. వాళ్ళను తీసికెళ్ళి బాబాకు భారం పెంచడం వాసు కిష్టంలేదు. అంతేకాదు. బాలును తీసుకురావడంవల్ల, వెంటనే ఛాయకూడా వస్తుందని ఊహించాడు. అతని ఊహ తప్పలేదు. ఛాయను రమాపతిరావు చేతుల్లో నుండి కాపాడాననే తృప్తితోపాటు, తనవెంట వచ్చినందుకు ఇబ్బందిపడ

కూడదనే ఆలోచనతో వాసుకు బుర్ర వేడెక్కిపోయింది. ఉన్నఫళాన తనకు ఉద్యోగం దొరకాలి. ఎలా ?

ఈ పాటికి ఛాయ వెళ్ళిపోయిందని, తనవెంట రావడంలేదని తెలిసిన రమాపతిరావు, ఏమనుకుంటున్నాడో ! అతను ఎంతటి ప్రమాదకరమైన వ్యక్తో బాగా తెలిసిన వాసుకు ఎక్కడికి వెళ్ళాలో ఏంచేయాలో తోచలేదు.

రైలుదిగి, ఆలోచిస్తూ నడుస్తున్న వాసుకు పోలీసులు స్వాగతం పలికారు.

రెండురోజుల క్రితం, రమాపతిరావును, అతని గేంగును పోలీసులు కస్టడీ లోకి తీసుకున్నారని, తను కూడా అతని గేంగులోవాడే కావడంవల్ల, పోలీసులు తనకోసం వెతుకుతూ పట్టుకున్నారని తెలియగానే క్రుంగిపోయాడు వాసు. అతనికి తప్పించుకోవాలనే ఉద్దేశ్యం లేదు. అతనికి తెలుసు తను దోషినని. తనచేత తప్పపనులు రమాపతిరావు చేయించాడు. అందులో అతనికి బాధ్యత వున్నా, తప్పని తెలిసి కూడా తను తప్పుచేసాడు. తను శిక్షార్హుడే. కాని... యిప్పుడు, ఈ సమయంలో పోలీసులకు చిక్కడం.. ఓహ్...అంటూ బాధపడి పోయాడు.

ఆడపిల్లలను అమాయకంగా ఉద్యోగాల పేరిట, పెళ్ళిపేరిట, వాళ్ళ బీద తనాన్ని, అమాయకత్వాన్ని, అవసరాన్ని ఆసరాగా తీసుకొని, మోసగించి, వాళ్ళ జీవితాలతో ఆటలాడి, అమ్ముడుపోయే స్త్రీలలా మార్చి, వాళ్ళ శరీరాలతో వ్యాపారాలు చేయిస్తున్న నేరానికి రమాపతిరావుకు, అతనికి సహాయంచేసిన నేరానికి అతని గేంగుకు కఠిన శిక్షలు విధించింది చట్టం.

నేరస్తుడిగా, రమాపతిరావు డ్రయివరుగా, అతను చేసే పనులకు సాక్ష్యంగానే కాక సహాయంగా వున్నందుకు వాసుకు మూడు సంవత్సరాల కఠిన కారాగార శిక్షపడింది విషయం వింటూనే నిలువునా క్రుంగిపోయాడు వాసు.

పుట్టకముందే తండ్రి, పుట్టగానే తల్లి వొదిలి వెళ్ళిపోవడంతో, మానవత్వం గల మనిషిగా బాబా చేరదీసాడు వాసుని. వాసు స్కూల్‌ఫైనల్ పాసవగానే ప్రపంచంలోకి పంపించాడు, జీవితాన్ని వెదుక్కోమని.

డిగ్రీలు సంపాదించుకొని, ఏళ్ళతరబడి కాలేజీలో చదువుకున్న విజ్ఞానాన్ని మూటగట్టుకొని, ఆ డిగ్రీని, ఆ విజ్ఞానపు బరువును మోస్తూ, ఉద్యోగాలు దొరకక, చివరికి తమకో డిగ్రీ వుందన్న విషయాన్ని మరిచి, గ్రాడ్యుయేట్లమని చెప్పుకోవడానికి సిగ్గుపడుతున్న నిరుద్యోగులను చూసాక, తనకు ఉద్యోగం దొరకడం అంత తేలికైన విషయం కాదని తెలుసుకున్న వాసు, ఒక మెకానిక్

షాపులో చేరాడు. రిపేరు చేయడంతోపాటు డ్రయివింగ్ కూడా నేర్చుకున్నాడు. ఎవరైనా కారు రిపేరుకిస్తే బాగుచేసి, కాసేపు తిరిగి వచ్చేవాడు. ఆ ఉద్యోగంతో తృప్తిపడాలనుకున్న వాసుని, దురదృష్టం, రమాపతిరావుదగ్గరికి చేర్చింది.

కారు రిపేరుచేసిన వాసుని, అతని తెలివిని, బలిష్ఠమైన అతని ఆరడుగుల విగ్రహాన్ని చూసి, రమాపతిరావు, వాసుని తన కుడిభుజంగా చేసుకుందే బావుంటుందని అనుకున్నాడు. డ్రయివర్ ఉద్యోగం ఆశచూపించి తీసుకువచ్చాడు. ఉద్యోగాలకోసం ఢక్కా మొక్కీలు తిని అవమానంపాలైన వాసులోని అభిమానాన్ని, ఆవేశాన్ని రెచ్చగొట్టి తనదారిలోకి మళ్ళించుకోవాలని అతడు చేసే ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. వాసు లొంగలేదు. వెళ్ళిపోవాలనుకున్న వాసు చుట్టూ వల అల్లిపెట్టాడు రమాపతిరావు

అతని వలనుండి తప్పించుకోవడం అంత సులభంగా సాధ్యంకాదని తెలిసిన వాసు, అవకాశంకోసం చూడసాగాడు.

"ఫలానా అమ్మాయి ఫలానా యింట్లోవుంది. వెళ్ళి తీసుకురా వాసూ!" అన్న రమాపతిరావు మాటప్రకారం అమ్మాయిలను అతనింటికి తీసుకువచ్చేవాడు.

"ఈ అమ్మాయిని ఫలానా హోటల్లో దింపేసి, మళ్ళీ ఫలానా టైముకి తీసుకురా" అని అంటే అలాగే చేసేవాడు. అలా చేస్తున్నప్పుడు, తన వొంట్లో ప్రవహించేది రక్తంకాదు, నీళ్ళు అని అనుకుంటూ తెగ బాధపడిపోయేవాడు.

అలా శరీరాలను అమ్ముకునే ఆడవాళ్ళను చూసి జాలిపడిపోతూ, వాళ్ళ అమాయకత్వాన్ని చూసి బాధపడిపోతూ, దారి మళ్ళించాలని చూసేవాడు. ఒక్కో అమ్మాయి వాసు చెప్పే మాటలు విని, ఏడ్చేస్తూ వెనక్కి వెళ్ళిపోయేది. మరో అమ్మాయి వాసునే నిందించి విషయం రమాపతిరావువరకు తీసికెళ్ళేది. ఫలితంగా రమాపతిరావు వాసును కఠినంగా శాసిస్తూ, హెచ్చరించేవాడు. ప్రతిక్షణం రమాపతిరావును కనిపెట్టే వాసును, కనిపెట్టేందుకు మరో మనిషిని నియమించాడు రమాపతిరావు.

ఒకనాడు_ఆ రోజు వాసుకు బాగా గుర్తుంది.

రమాపతిరావుకు భార్య వొదిలివెళ్ళిన ఇద్దరి పిల్లలను చూడడానికి అందమైన అమ్మాయి ఆయాగా కావాలని చేసిన ప్రకటనకు, రమాపతిరావు గుమస్తా అయిన రాఘవ ఛాయను తీసుకువచ్చాడు.

''ఈ అమ్మాయికి మీరెలాగైనా ఉద్యోగం యిప్పించాలి" అంటూ గుంభనగా నవ్వుతూ, "అమ్మాయి బి.ఏ. వరకు చదువుకుంది. అందమైంది. మీరు చెప్పినట్టే

వింటుంది'' అంటూ వెకిలిగా నవ్వుతున్న రాఘవ మాటలకు, రమాపతిరావు నవ్వుతూ, పరీక్షగా ఛాయను చూస్తూ "ఊ..." అన్నాడు తలపంకిస్తూ.

"అమ్మాయి చాలా అందంగా వుంది" అన్నాడు. అతని మాటలకు ఛాయ తీవ్రంగా చూసింది. రమాపతిరావు పక్కనే చేతులు కట్టుకొని నిలబడ్డ వాసు ఆ అమ్మాయి అలా చూడ్డంతోనే, "రమాపతిరావుకు లొంగేఘటంకాదు" అనుకున్నాడు.

"ఏమంటావ్" అన్నాడు వాసు వైపుతిరిగి.

''ఊ..." అన్నాడు వాసు దీక్షగాచూస్తూ.

'ఈసారి ఓ ఛాన్సు నీకిప్పిస్తాను వాసూ! బహుశా ఇంతవరకు ఏ అమ్మాయితో నీకు ఎలాంటి సంబంధం లేకుండా చూసినందుకేమో నువ్వింకా నా దారిలోకి రావడంలేదు. ఈ అమ్మాయి నిన్ను ఆకర్షించినట్టనిపిస్తోంది. ఈ ఛాన్సుతో నాకు నువ్వు అందుతావు' అనుకున్నాడు.

రానురాను ఛాయ అందం ముందుగా రమాపతిరావును పిచ్చివాణ్ణి చేసింది. ఆమెను ఏదో మిషమీద గదిలోకి పిల్చేవాడు. అతనిని ఓ కంట కనిపెడుతూ, "కనీసం ఛాయనైనా అతనికి అందకుండా చేయాలనుకున్న వాసు, వెంటనే ఏదో పనున్నట్టు రమాపతిరావు దగ్గరికెళ్ళేవాడు.

"ఏమిటోయ్..." అంటూ కటువుగా అడిగే అతడి ప్రశ్నకు, ఆ రోజు తను ఎప్పుడెప్పుడు వెళ్ళాలో కనుక్కోవడానికి వచ్చానని మాటల్లో పెట్టేవాడు. ప్రొద్దున్నే పన్లోకి వచ్చే ఛాయ తిరిగి యింటికి వెళ్ళేవరకు, తన రెండు కళ్ళను వేయికళ్ళలా చేసుకొని కాపాడేవాడు వాసు.

కాని, ఛాయకుమాత్రం. మొదటిసారి వాసును చూసినప్పుడు, రమాపతిరావు "ఏమంటావ్?'' అంటూ వాసునడిగినప్పుడు, "ఊ..." అంటూ తనవంకే దీక్షగా చూసిన వాసుపట్ల కోపం, అసహ్యం చోటుచేసుకున్నాయ్.

ప్రతిరోజు వెళ్ళినప్పటినుండి, అతని రెండుకళ్ళు తననే చూడ్డం ప్రతిక్షణం, అతని చూపు తననే వెంటాడ్డంతో రోజు రోజుకూ ఆమెకు అతనిపై అసహ్యం పెరిగిపోయింది. అతణ్ణి, చూపులతోనే మందలించింది. ఆమె తీక్షణమైన చూపును కాని, ఆ చూపులో మెదిలే తిరస్కారభావాన్నికాని వాసు—అర్థంచేసుకోలేక పోలేదు. ఆమెను చూస్తుంటే అతనికి ఎందుకో 'ఈ అమ్మాయి ఓడిపోదు. రమాపతిరావు ముందు తల వాల్చదు. అవసరం బాధించినా, ఆత్మాభిమానాన్ని చంపుకోలేదు. నిప్పులా వుంటుంది. జీవితాన్ని ధైర్యంతో సాగిస్తుంది' అన్న

భావం కలిగేది రాను రాను, ఆమెపట్ల అతనికి గౌరవభావం కలిగి, పెరిగి పోయింది.

పిల్లల విషయంలో తప్ప మరేవిషయంలో జోక్యం కలిగించుకునేది కాదు ఛాయ. యింటికి ఎవరెవరు వస్తున్నారో, ఎవరెవరు వెళ్తున్నారో గమనించేది కాదు. ఒకోసారి అనుకోకుండా ఆమెకు అసహ్యకరమైన దృశ్యాలు కంటబడి, రమాపతిరావుమీద జుగుప్స కలిగేది. కాని...తన హద్దేమిటో గుర్తించి, తన జోక్యం అనవసరమని గుర్తించి ఊరుకునేది.

ఓరోజు—

ఛాయ ఇద్దరు పిల్లలను ముస్తాబుచేసి ఆడిస్తున్న సమయంలో రమాపతిరావు పిలిపించాడు. అతని పక్కనే ఓ అమ్మాయి కూర్చొని వుంది. మరో పెద్ద మనిషి వాళ్ళ కెదురుగా కూర్చొని చూస్తున్నాడు. రావు కెదురుగావున్న టేబుల్ మీది మత్తుపానీయాలను రావుతోపాటు, ఆ అమ్మాయి తాగుతోంది.

ఛాయకు అక్కడికి వెళ్ళడం ఇష్టంలేదు. అయినా తప్పనిసరై వెళ్లి నిలబడింది. రావు పరిచయం చేసాడు. ఆ పెద్దమనిషి రెప్పలార్పకుండాచూసి, సంతృప్తిగా తలూపి రావువంక చూసాడు.

"ఛాయా! ఈయన ఓ పెద్ద ఫ్యాక్టరీకి యజమాని. ఓ ప్రయివేటు సెక్రటరీ కావాలట. కన్నెపిల్లవు. తల్లిగా ఈ పిల్లలను చూడ్డం...ప్చ్...నాకెందుకో ఇష్టం లేదు. ఏ ముసలమ్మనో చూసి ఏర్పాటుచేసుకుంటాను. అతను నీకు ఉద్యోగం ఇవ్వడానికి అంగీకరించాడు. జీతం నాలుగువందలు. రేపోసారివెళ్లి కలిసిరా!"

రమాపతిరావు మాటలను గుడ్డిగా నమ్మేసింది ఛాయ

మర్నాడు వాసుకు అప్పగించాడు రమాపతిరావు.

"ఇంటర్వ్యూ అయ్యేవరకు నువ్వు వుండి, వెంట తీసుకురా" అన్నాడు. రమాపతిరావు మాటలకు వాసు నవ్వి, "మీ రంతగా చెప్పాలా! నిజంగా ఆమె ఇంటర్వ్యూకు వెడితే.. నేను అక్కడే వుంటాను. వెంట క్షేమంగా తీసుకువస్తాను" అనుకుంటూ, తలూపాడు.

అది చాలా పెద్ద యిల్లు. నగరానికి చాలా దూరంగా వుంది. ఆ విశాలమైన మేడలో, ఆ పెద్దమనిషి ఒంటరిగా వున్నాడు. అక్కడ ఆవరించుకున్న నిశబ్దాన్ని చూసి ఛాయ భయపడిపోయింది. మనిషి నిలువునా కంపించిపోతూ, బెదిరిపోతూ వాసువంక చూసింది.

"సేట్ జీ!" అంటూ వాసు విస్కీ బాటిల్ తెరిచి సేట్ జీ ముందుపెట్టాడు.

మాటల్లో, మాటల్లో, సేట్‌జీచేత ఆ సీసా త్రాగించేసి, ఛాయను తీసుకొని బయలుదేరాడు. మనసులో ఏ మూలో తొలిసారిగా అతనికి కృతజ్ఞత చెప్పు కోవాలనుకుంటున్న ఛాయ, కారు కొత్తదారివెంట పరుగుతీయడం చూసి వణికి పోయింది.

ఆ క్షణంలో ప్రతిసారి వాసు తనను చూసే చూపు గుర్తుకొచ్చింది. అనుమానం పెనుభూతంలా పీకించసాగింది. పైగా సేట్‌జీతోపాటు, అతనూ తాగాడు. కారు వేగంతోపాటు వాసు కూనిరాగాలు తీయడం ఎక్కువై పోయింది. సందడిగావుండే రోడ్లమీద రివ్వున సాగిపోతూ టాంక్‌బండ్‌మీద ఆగిపోయింది.

"దిగండి!" అన్నాడు. అప్పటికి రాత్రి ఏడుదాటింది. పలచగావున్న జనం సిమెంటు బెంచీలమీద కూర్చున్నారు. ఛాయకు కాస్త ధైర్యం కలిగింది. అతను అతిగా ప్రవర్తిస్తే అరిచినా వినే జనం వున్నందుకు సంతోషించింది.

కారు దిగింది. అతను ముందుకు సాగాడు. ఛాయ సిమెంటు బెంచీమీద కూర్చోకుండా నీటివంక చూస్తూ నిలబడింది. చల్లటి గాలికి భయంతో పట్టిన చెమట, మబ్బులా పేరుకున్న అనుమానం కరిగిపోసాగింది. వాసు ఒక్కడే చాలా దూరం వెళ్లి తిరిగివచ్చాడు.

"యిక పదండి! ఇంటర్వ్యూ జరిగిందని చెప్పటానికి ఈ మాత్రం ఆలస్యం చాలుగా" అంటూ, కారును పరిగెత్తించాడు.

ఆ రోజు వాసుపట్ల మంచి అభిప్రాయం ఆవగింజంత కలిగినా, అతను చాలా సార్లు అమ్మాయిలను యింటికి తీసుకురావడంతో, అతనిపట్ల అసహ్యంతప్ప ఆమె మనసులో అభిమానం మిగల్లేదు.

అతను తనకేదైనా సహాయం చేస్తానంటే—'స్వార్థం' అనుకునేది.

అతను మంచివాడిలా ప్రవర్తించి, తనను నమ్మించడానికి ప్రయత్నిస్తున్నా డనుకునేది. అందుకే అతని సహాయాన్ని సైతం భరించలేకపోయింది.

కాని వాసు ఏనాడూ ఛాయ ముందు నటించలేదు. మంచివాడినని ఆమెచేత అన్పించుకోవాలన్న ఆశ, తపన అతనికి క్షణంమాత్రం ఏనాడూ కలగలేదు. రమాపతిరావు చేతిలోచిక్కి తను ఎంతగా పతనమయ్యాడో అతనికి తెలుసు. అందుకే, ఒక్క ఛాయనేకాదు, బలవంతంగా ఏ అమ్మాయినైనా రమాపతిరావు బురదలోకి లాగాలనుకున్నప్పుడు, అతనికి తానుగా తెలియకుండా వాళ్ళను రక్షించేవాడు.

తొలిసారిగా ఛాయను రమాపతిరావు కోరినప్పుడు— ఆ రాత్రి తప్పతాగి,

రమాపతిరావు ఛాయపట్ల పశువులా ప్రవర్తించబోతున్నప్పుడు సర్వాన్నీ మరిచి, నిజం తెలిసి, రమాపతిరావు తననేం చేసినా ఫర్వాలేదన్న తెగింపుకువచ్చి, మైకంలోని రమాపతిరావునుండి ఛాయను రక్షించాడు. యింటివరకు క్షేమంగా దింపి వచ్చాడు. కాని...అతని సహాయాన్ని ఛాయ, పులిబోనులోనుండి సింహం నోటిదగ్గరి కొచ్చినట్టుగా భావించింది.

ఆనాడే ఆమెను అతను అర్థిస్తున్నట్టుగా, రమాపతిరావు దగ్గిరికి మరెప్పుడూ వెళ్లొద్దని చెప్పాడు.

జరిగిన అవమానానికి ఛాయ వెళ్ళలేదు. కాని...రమాపతిరావు వాసుమీద పగసాధించాడు. ఫలితంగా రెండురోజులు వాసుకు స్పృహలేకుండా పోయింది. తన గేంగులోని వాళ్ళతో చితకబాదించి, తిరిగి నయంచేయించాడు రమాపతి రావు. వాసును వొదిలేస్తే తన రహస్యం బయటికి పొక్కుతుందనే భయమే అతనిని అలా చేయించింది.

ఆ తరువాత ఛాయ సేల్స్‌గర్ల్‌గా సబ్బులు పట్టుకు తిరగడం చూసి హెచ్చరించాడు. చివరికి ఛాయ ఆ ఉద్యోగం వదులుకుందన్న విషయం, వదులుకోవడానికి కారణం తెలిసి, బాధపడ్డాడు రాత్రి తొమ్మిదివరకు, శాస్త్రిదగ్గర హాస్పిటల్‌లో గడిపే ఛాయ విషయం తెలిసి, రావు తన మనుషులకు చెప్పాడు. ఒంటరిగా ఆ చీకట్లో యింటికి వెళ్ళి ఛాయను ఏ మూలనుండి రావుమనుషులు వచ్చి నోరు నొక్కి కార్లో తీసికెడతారో ఊహించిన వాసు, ప్రతిరాత్రి ఛాయకు నీడగా అనుసరించేవాడు.

శాస్త్రి పోవడం, వరలక్ష్మి ఛాయను ఒంటరిగా వదిలి వెళ్ళిపోయిందని రాఘవ్ ద్వారా విన్న రావు ఓనాడు రాత్రి ముగ్గురు మనుషులను ఛాయ యింటికి పంపాడు. సరిగ్గా ఆ రాత్రి తొలిసారిగా ముఖాముఖిగా రావును అడ్డగించాడు వాసు.

"చెడిపోవాలనుకునేవారిపట్ల నువ్విలా ప్రవర్తిస్తే బావుండదు వాసూ!" అన్నాడు రావు.

"ఏ ఆడపిల్లా, అవసరాలకు లొంగిపోయి శరీరాన్ని అమ్ముకోవడానికి అంగీకరించదు రావుగారూ! తన చదువు, విలువ మరిచి, అంట్లు తోమడానికైనా అంగీకరిస్తుందే తప్ప, తనను తాను డబ్బుకు అమ్ముకోవాలనుకోదు."

"అయితే వీళ్ళంతా ఎందుకిలా అయ్యారు?" అన్నాడు తానింతవరకు మోసగించిన స్త్రీలవిషయం చెబుతూ, హేళనగా.

"అమాయకంగా మోసపోయినవాళ్ళు అలా కావడానికి కారణం మీరే రావుగారూ! వాళ్ళందర్నీ ఈనాడు శరీరాలను అమ్ముకునే పతితలుగా మార్చింది మీరే. మీరు వాళ్ళను బ్రతికున్న శవాలుగా మార్చినా, వారి గుండెల్లో మీ పట్ల ద్వేషం, అసహ్యం తప్ప మరేం లేవు రావుగారూ! వాళ్ళ జీవితాలను ఇటికలుగా మార్చి నిర్మించుకుంటున్న మీ యీ జీవితం...ఏనాడు..."

"వాసూ!" అరిచాడు రావు.

ఆ రాత్రి ఒంటరిగావున్న ఛాయ యింటికి వెళ్ళాడు వాసు. ఆ ఒక్కరాత్రి ఛాయను రావు మనుషులనుండి రక్షించాడు.

"వాసూ! ఛాయను నేను...బొంబాయికి తీసికెళ్తాను. ఎలా అడ్డుకుంటావో అడ్డుకో! ఛాయ తనకు తానుగా నాతో బొంబాయికి రావడానికి అంగీకరించిన నాడు...నువ్వేకాదు...ఏ దేవుడూ ఏంచేయలేడు. ఛాయ నిప్పులాంటిదైనా నీళ్ళు పడగానే చల్లారిపోతుంది" అని సవాలుచేసాడు.

ఫలితంగా రాఘవ్‌ను నియమించి, రాఘవ్ ద్వారా మూర్తిని రెచ్చగొట్టాలనుకున్నాడు. వాసు, రావు ఆలోచనను పసికట్టి, మూర్తిని అనుమానించకపోయినా, ముందు జాగ్రత్తకోసం ఆలోచించాడు.

వాసు పరంధామయ్యను మంచిచేసుకొని ఛాయ యింట్లో ఓ గది సంపాదించాడు. బాలుకు తనకు తెలీకుండానే సన్నిహితుడయ్యాడు.

రావుకి విషయం తెలిసి హేళనగా నవ్వాడు. "వాసూ! చాలామంది అమ్మాయిలను నానుండి తప్పించాలని నువ్వు చేసిన ప్రయత్నం నిన్నే ఎదురుదెబ్బ తీసింది. ఈ ఛాయ విషయంలో చివరికి నీకు మిగిలేది ఓటమి...అవమానం." అన్నాడు.

"రావుగారూ! ఈ విషయంలో పందెం వేసినా సరే. ఛాయను మీకు కాకుండా చేస్తాను. ఛాయను తప్పకుండా రక్షిస్తాను" అన్నాడు పందెం కాస్తున్నట్లుగా.

"పందెం కాసేముందు ఒక్కవిషయం గుర్తుంచుకో వాసూ! ఆ అమ్మాయిని రక్షించి, పెళ్ళిచేసుకుందామనో...మరేదనో అనుకుంటున్నావ్! కాని...నువ్వు నా మనిషివని, నాలాంటివాడివని ఛాయకు తెలుసు. నిన్ను అసహ్యించుకుంటుంది, అవమానిస్తుంది."

"నాకు ఆశ, అవకాశం లేదన్న నిజం తెలుసు రావుగారూ?" అన్నాడు దృఢంగా వాసు.

"తెలిసికూడా ఎందుకంత ప్రయత్నిస్తున్నావ్? నీకేం లాభం?"

"నేను మీ చేతిలో చిక్కి మీ మనిషినైనా...మనిషిగా ఓ మంచిపని చేయా లనుకుంటున్నాను" అన్నాడు వాసు.

ఇద్దరిమధ్య పోటీ పెరిగింది. చివరికి...రాఘవ మాటలకు ఛాయ తనకు తానుగా రావు దగ్గరికి వచ్చింది. విజయగర్వంతో నవ్వాడు రావు. కాని... ఎత్తుకు పైఎత్తుగా 'బాలుకోసమే ఛాయ రావుకు చిక్కిపోతుందని గుర్తించిన వాసు బాలును తనతో తీసికెళ్ళడానికి నిర్ణయించుకొని బాలు వెంట ఛాయ రాక మానదని అంచనా వేసుకొని బాలును బాబా దగ్గరికి తీసికెళ్ళడానికి బయలు దేరాడు. అతని అంచనా నిజమైంది. ఛాయ రావుకు చిక్కలేదు. ఆత్మీయత నిండిన అధికారంతో బాలును బాబాకు అప్పగించాడు ఛాయ తనకు తానుగా వాసు కొట్టిన దెబ్బకు తలవాల్చి, వాసు అధికారాన్ని అంగీకరించి బాబా దగ్గర వుండిపోయింది.

రావుకు ఈ విషయం తెలిసేలోగానే, ఎన్నాళ్లనుంచో అతనిమీద వున్న పోలీసునిఘా, మరింత హెచ్చి, చట్టానికి అప్పగించింది, చట్టానికి అందరూ రావు మనుషులుగా పట్టుబడిపోయారు.

రోజులు, వారాలు, నెలలు గడిచినా వాసు రాకపోయేసరికి బాబాకు దిగులు కలిగింది. కనీసం ఉత్తరంకూడా రాయలేదు వాసు.

వాసు చేసే ఉద్యోగం 'డ్రయివరు' అన్న విషయం తప్ప మరేం తెలియదు బాబాకు. వాసు ఏనాడూ చెప్పలేదు. బాబాకు తన విషయం తెలిస్తే, వాడిపోతో తున్న చిన్నమొక్కకు తను నీళ్ళుపోసి, ఆదరణతో పెంచి పెద్దచేస్తే, ఆ చెట్టు కుళ్లిపోయిందని తెలిస్తే ఎంత బాధపడతాడో వాసుకు తెలుసు. అంతేకాదు. తానిలా జైల్లో కూర్చున్నానని, చేసిన నేరమేమిటో రాస్తే, బహుశా బాబాకు తనపైన అసహ్యం కలుగుతుందేమో! ఛాయకి విషయం తెలిస్తే, బాలుని తీసు కొని ఎక్కడికైనా వెళ్లిపోతుందేమోనని వాసు ఉత్తరం కూడా వ్రాయలేదు.

ఆరునెలలు గడిచిపోయాయి. ఆరోజు తనకోసం ఎవరో వచ్చారని తెలియ గానే, వాసుకు తన మొహం ఎక్కడ దాచుకోవాలో తెలీలేదు.

కటకటాలకు అవతల నిలబడ్డ బాబాను చూస్తూనే, వాసు శరీరంలోని రక్తం అంతా నీరుగా మారి ఆవిరైపోసాగింది. సూటిగా బాబావంక చూళ్ళేక, తల వాల్చుకున్నాడు. బాబా వాసువంక తిరస్కారంగా, ఏహ్యంగా చూడలేదు. దగ్గరగావచ్చి, కటకటాల మధ్యనుండి చేయిచాచి వాసు మొహాన్ని పైకెత్తి కళ్ళలోకి చూసాడు. వాసు కళ్ళనిండా నీళ్ళు.

"బాబా," ఏదో చెప్పబోయి, చెప్పలేక ఆగిపోయాడు.

"నాకంతా తెలుసు వాసూ! చేసింది నేరం అవునో కాదో, నువ్వలా ఎందుకు చేసావో అడగడానికి రాలేదు నేను. నేరానికి తగిన శిక్షగా చట్టం నీకీ కటకటాలను విధించింది. నువ్వు నీ ఆత్మాభిమానాన్ని ఎంతగా చంపుకొని, నీలో నువ్వెంత కుమిలిపోతూ, వలలోపడ్డ చేపలా ఎంత గిలగిల్లాడిపోతూ ఆ జీవితాన్ని సాగించావో, ఎవ్వరూ అర్థంచేసుకోలేకపోయినా నిన్ను పెంచిన నేను అర్థంచేసుకోలేననుకున్నావా వాసూ?"

"జరిగినదానికి నేను బాధపడ్డంలేదు వాసూ. తెలిసిచేసినా, తెలియకచేసినా అసహాయ స్థితిలోపడి చేసినతప్పు తప్పే. అడ్డదారిలో పడిపోయేవారిని పక్కకు లాగి దారి చూపాలన్న నీ ప్రయత్నం ఫలించలేదు. వాళ్ళను మార్చలేక, రమాపతిరావు చెప్పినట్టు విన్నావు! బలవంతంగా అతని చేతిలో నలిగిపోకుండా ఛాయలాంటివాళ్ళను కాపాడి, నువ్వు ఓ మనిషిగా మర్చిపోలేక, మానవత్వం, సంస్కారం వున్న వ్యక్తిగా నిలిచావు. నువ్వు చేసిన మంచికి నోరులేదు. చేసిన చెడు చట్టానికి కన్పించింది. శిక్ష విధించింది. అనుభవించక తప్పదు వాసూ!"

"కాని...నిజం తెలిసి నేను కాలం సాగించగలను. నీ రాకకు నిరీక్షించగలను. కాని...నీకోసం ప్రతిరోజు, ప్రతిక్షణం బాలు ఎంతో ఆత్రుతగా ఎదురుచూస్తున్నాడు. ఆ పసివాడికి ఏంచెప్పమంటావ్ వాసూ?" బాబా అడిగిన ప్రశ్నకు వాసు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

"వద్దు బాబా! బాలు కీ విషయం చెప్పకండి. ముఖ్యంగా ఛాయకి విషయం తెలీనీయకండి. ఛాయకు అభిమానం ఎక్కువ. అంతేకాదు. నామీద అంతులేని అసహ్యం. ఎందుకంటే ఛాయ కళ్ళారా నేను చేసిన పాడుపనులను చూసింది. అందుకు నేను బాధపడ్డంలేదు. కాని మీరు నన్ను సమర్థిస్తున్నారని తెలిస్తే, మీరెంత అడ్డుకున్నా వినకుండా మొండిగా బాలూని అక్కడినుంచి తీసుకుపోతుంది. బాలు కాళ్ళు బాగుఅయ్యేవరకు ఛాయను అక్కడినుండి వెళ్ళిపోనీకుండా చూసే బాధ్యత మీది బాబా! లేకుంటే, ఆ కుంటితమ్ముడి నిస్సహాయత మీద జాలితో ఛాయ ఏమైపోతుందో, ఛాయకు నా విషయం చెప్పకండి. అసలు ఆమె నా గురించి అడగదు. బాలును నేను బలవంతంగా తీసుకురావడంవల్ల, ఛాయను రమాపతిరావుకు కాకుండా చేసాను. ఛాయ నామీద వుండే అసహ్యాన్ని సైతం పక్కకునెట్టి బాలుకోసం నా వెంటవచ్చింది. యిప్పుడు ఈ విషయం తెలిస్తే... బహుశా అక్కడవుండకుండా వెళ్ళిపోతుందేమో!"

అన్నట్టు బాబా! ఛాయ . . ." అంటూ ఏదో అడగాలనుకుంటున్న వాసు, అంతవరకు కటకటాలమధ్య తలానించి చెబుతూ ఎందుకో పక్కగదివైపు చూసాడు. ఆ గదికి తనగదికి తలుపులమధ్య వున్న గోడనీడలో, ఛాయ నిలబడి వుండడం చూస్తూనే, ఆగిపోయాడు.

"బాబా! ఆవిడ వచ్చిందని . . . నాతో చెప్పలేదేం?" అన్నట్టుగా చూసాడు బాబావైపు.

"వాసూ! నువ్వు యిక్కడికి వచ్చాక నేను ఒక్కడినే నీ గురించి రెండు సార్లు వచ్చి ఏం తెలీకుండా వెళ్ళిపోవడంతో ఈ సారి ఛాయకూడా నిన్ను వెతుక్కుంటూ నా వెంటవచ్చింది. ఆ అమ్మాయి రావడంవల్లనే రమాపతిరావు గురించే కాదు నీ గురించి తెలుసుకోగలిగాను" అన్నాడు.

"ఒహ్ . . . ఎందుకు ఎందుకు వచ్చారు బాబా! వెళ్లిపోండి, వెళ్లిపోండి!" అంటూ కటకటాలకు వీపు ఆనించి మొహం తిప్పుకున్నాడు వాసు

"వెళ్లిపోండి బాబా! వీలైతే బాలునిఛాయ తీసికెళ్లకుండా చూసి బాగు చేయండి. బాలు నా గురించి అడిగితే . . . కన్పించలేదని, కన్పించడని మరెప్పుడూ కన్పించకుండా వెళ్లిపోయాడని..."

"వాసూ!" మృదువుగా విన్పించిన ఆ పిలుపు వాసు మాటలను ఆపేసింది.

"ఈ ఉత్తరం బాలు, నాచేత రాయించి పంపాడు." అంటూ మృదువుగా వున్నచేయి, కటకటాలమధ్యనుండి వాసు భుజం మీదుగా మొహం ముందుకు వచ్చింది. వాసు ఆ ఉత్తరాన్ని అందుకున్నాడు.

ఆ ఉత్తరం చదివి బాలు తన రాకకు ఎంతగా ఎదురుచూస్తున్నాడో అర్థం చేసుకున్న వాసు మనసు ఆర్ద్రమైంది. ఆ ఉత్తరంలోని ప్రతిమాటా గుండెల్లో చోటుచేసుకుంది. 'బాలూ' అంటూ ఉత్తరాన్ని ముద్దుపెట్టుకున్నాడు.

"వాసూ! బాలుకు ఏంచెప్పమన్నారూ?" ఛాయ కంఠంలో ధ్వనించిన మృదుత్వానికి ఉలిక్కిపడిపోయాడు వాసు. ఆ పిలుపులో "వాసూ" అన్న ఆ పిలుపులో ఎంత మాధుర్యం వుంది. అంత మధురంగా గుండెలను తాకేలా ఎవ్వరు పిలిచారు తనని? ఒక్కసారి వెనుతిరిగి ఛాయను చూడాలన్పించింది. కాని వెనక్కిచూడలేకపోయాడు వాసు.

"బాబా! మళ్ళీ మీరు రాకండి! ఈ మూడుసంవత్సరాలు అయ్యేవరకు మీ రెవ్వరూ యిక్కడికి రాకండి బాబా! నేను భరించలేను... పిచ్చిధైర్యం నన్ను

ఏమైనా చేయిస్తుంది. బాలూను చూడాలన్పిస్తుంది బాబా!" అన్నాడు వాసు గాద్గదికంగా.

తన ప్రశ్నకు అదేనా సమాధానం? అక్కడ దూరంగా నిలబడ్డ బాబాకు సమాధానం చెప్పాడే కాని...తను...తనకు తానుగా పలకరించినా తనవంక చూడకుండా ... ప్చ్ ...నిట్టూర్చిన ఛాయమనసు బాధతో నిండిపోయి కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

తనని చూడ్డం, తనతో మాట్లాడ్డం అతని కిష్టంలేదేమో!

ఒకనాడు అతనంటే అసహ్యించుకుంది. ఈనాడు తానంటే అతనికి అసహ్యం. ...ఛ ...కాదు అతను తననెప్పుడూ అసహ్యించుకోడు. నిర్లక్ష్యం కాబోలు.

'అసలు నిన్నెందుకు అసహ్యించుకోడు? అతడెన్నోసార్లు ఎన్నోవిధాలుగా ఆదుకున్నాడు. కృతజ్ఞత చూపించలేదు, సరికదా ... మొహంమీద "మీరంటే నా కసహ్యం" అని చెప్పావ్! అంతేకాదు. మరెప్పుడూ మాట్లాడకుండా వొట్టువేయించుకున్నావ్" అంది మనసు.

'లేదు... ఆనాడతను ప్రామిస్ చేయలేదు.'

'మాట నిలబెట్టుకునే మనిషికి వొట్టుతో అవసరం ఏమిటి?'

'నిజమే. అందుకేనా ఈనాడతను తనతో మాట్లాడలేదు?'

ఆ అనుమానం రావడంతో, ఛాయకు గతంలో తాను అతనితో ఎంత మొండిగా, కటువుగా మాట్లాడిందో, తన కటుప్రవర్తన అతడినెంతగా బాధించిందో గుర్తుకు తెచ్చుకుంటూ సిగ్గుపడిపోయింది.

మరో ఆరునెలలు గడిచాయి. బాలూకు, బాబా చేసిన చికిత్సవల్ల కొద్దిగా మార్పువచ్చింది. అయితే అస్తమానం బాబా కట్టినకట్ల వలన కదలకుండా పడుకోవడంతో దగ్గర ఎప్పుడూ ఎవరో ఒకరు ఉండాల్సివచ్చేది.

"వాసుగారు ఎప్పుడొస్తారు?" ఆ ఒక్క ప్రశ్నతో ఛాయను, బాబాను వేధించేవాడు. ఉద్యోగంకోసం బొంబాయి వెళ్ళాడన్న అబద్ధాన్ని నమ్మిస్తూ, ప్రతిరోజు, ఎన్నోసార్లు అడిగే ఆ ఒక్క ప్రశ్నకే సమాధానం విసుక్కోకుండా చెప్పేవారు బాబా, ఛాయ.

"బాబా! ఓసారి మనం వెళ్ళి చూసివద్దాం" అని అనాలన్పించేది ఛాయకు. కాని అనలేకపోయింది.

చివరికి ఒకనాడు బాబా బయలుదేరాడు. "నేను వస్తాను బాబా!" అని అడగా

లనుకున్న ఛాయకు క్రితంసారి వెళ్ళినప్పుడు వాసు ప్రవర్తన గుర్తుకువచ్చి, అభిమానం అడ్డురావడంతో అడగలేదు. బాబా వెళ్ళిపోయాడు.

బాబా తిరిగి వచ్చాడు. వాసుగురించి బాబా తనకు తానుగా చెబుతాడని ఆత్రుతగా ఎదురుచూసింది ఛాయ. బాలు వేసే ప్రశ్నలకు బాబా సమాధానాలు చెప్పాడేకాని, తనకు తానుగా ఏంచెప్పలేదు.

అక్కడున్నంతసేపు బాలు గురించే అడిగాడమ్మా ఛాయా! అని చెప్పాడే తప్ప, నీ గురించి అడిగాడని బాబా చెప్పకపోవడంతో మనసు చిన్నబోయింది.

"ప్చ్ ... ఇక్కడ బాలు యిలా వున్నాడా! అక్కడ వాసు అంతే—ఏమిటో —వాసుకు ఆ జైలు వాతావరణం బావుందంటాడు. కాని ... మనిషి చాలా మారిపోయాడు. చిక్కిపోయాడు" అంటున్న బాబా గొంతు గాద్గదికమై పోయింది.

"ఆరోగ్యం బావుంది కదు బాబా," అంది ఆత్రుతగా.

"ఊఁ ... వాసు కెప్పుడూ తనగురించి బెంగవుండదు ఛాయా! చిన్నప్పటి నుండీ అంతే—తనగురించి తానెప్పుడూ ఆలోచించుకోలేదు. నిజంగా అలా ఆలోచించుకుంటే, వాసులాంటివాడు రమాపతిరావుచేతుల్లో ఇరుక్కునేవాడుకాడు. తానీనాడు జైలులో వున్నందుకు బాధపడ్డంలేదు పైగా చేసిన తప్పుకు శిక్ష అనుభవిస్తున్నాను బాబా! నా గురించి నాకెప్పుడూ బెంగలేదు. నా కంటూ నువ్వుతప్ప ఎవ్వరూలేరు. కాని బాబా నా హృదయానికి దగ్గరగావచ్చిన వ్యక్తి అసహ్యించుకోడం—ఈ శిక్షకంటే నరకంగా వుంటుంది కదూ? అని అన్నాడు. "బాబా మాటలకు ఛాయ ఉలిక్కిపడుతూ, దోషిలా తలవాల్చుకుంది.

"ఏమిటో ఈసారి వాసు నాకు అర్థంకాకుండా ఏమిటేమిటో మాట్లాడాడు. ఏది ఏమైనా, బాలుకోసమైనా తను బయటికి రావాలనుకుంటున్నాడు. వస్తాడు కూడా. కాని ... ఛాయా, వాసు మనసులో ఏమిటో బాధపడుతున్నాడు. ఎందుకో ఏమిటో నాకు అర్థంకాలేదు." అంటూ, నీకేమైనా తెలుసా? అన్నట్టుగా సాభిప్రాయంగా చూసాడు బాబా.

బాబా చూపుకు ఉలిక్కిపడిపోతూ తలవాల్చేసుకుంది ఛాయ.

"బాలు విషయం చెప్పానమ్మా! కనీసం బాలుకోసమైనా ఉత్తరాలు రాయమని చెప్పాను" అన్నాడు బాబా!

బాబా మాటలు ఛాయ మనసుమీద బాగా పనిచేశాయి. ఆలోచిస్తూ, ఆందోళన పడిపోతూ కాలం గడిపేయసాగింది.

మొదటిసారిగా బాబా పేర ఓ ఉత్తరం వచ్చింది. ఉత్తరం విప్పి ఆత్రంగా చదివింది ఛాయ, బాబా ముందు.

ఆ ఉత్తరం మొత్తంలో ఒక్కసారి కూడా తన పేరు రాయలేదు. తనగురించి రాయలేదు వాసు, బాలు గురించే వ్రాశాడు తప్ప. కనీసం తన క్షేమం కూడా అడగని వాసుమీద కోపం వచ్చింది ఛాయకు. బాధపడిపోయింది. ఆమెలోని అభిమానం వరదలా పొంగింది. జవాబు బాబా రాయించేటప్పుడు పొరపాటున కూడా తన విషయం రాయలేదు-బాబా చెప్పినా రాయలేదు.

ఆ తరువాత వచ్చిన ఏ ఉత్తరంలో కూడా తన ప్రసక్తి లేకపోవడంతో ఛాయ అభిమానం దెబ్బతింది. అతనికి తనంటే కోపం ...... నిర్లక్ష్యం అనే భావం అణువణువులో నాటుకుపోసాగింది. అయినా వాసుదగ్గరినుండి ఉత్తరం రాగానే, ఆమె రెండుకళ్ళూ ఆత్రుతగా తనగురించి రాసాడేమోనని ఉత్తరం అంతా వెతికి వెతికి ఓడిపోయి, నీళ్ళతో నిండిపోయేవి. చటుక్కున ఉత్తరాన్ని బాబాకు అందించి, లోపలికి వెళ్లిపోయేది. ఛాయ ప్రవర్తన ఓ కంట కనిపెడుతున్న బాబాకు అయోమయంగా అన్పించేది. అటు వాసు ప్రవర్తన తలచుకుంటుంటే, ఇటు ఛాయను చూస్తూంటే.

మూడుసంవత్సరాలు ఎంతో మెల్లిగా గడిచిపోయాయి. బాబా ప్రతిరోజు ఎదురుచూసే ఆ రోజు రానేవచ్చింది. బాలు ప్రతినిమిషం అడిగేప్రశ్నకు జవాబు దొరికే ఆ రోజు వచ్చింది. ఛాయ ప్రతిక్షణం ఆత్రుతగా ఎదురుచూసే ఆ రోజు మెల్లగా వచ్చింది.

"నేను వెళ్లి తీసుకొస్తానమ్మా!" అంటూ బాబా బయలుదేరాడు. బాలూకు పూర్తిగా నడవడం రావడంవల్ల తనూ బయలుదేరాడు. ఛాయ మౌనంగా నిలబడి పోయింది. ఛాయ మౌనం చూసి, బాబా ఛాయను రమ్మని అడగలేకపోయాడు. బాలు తో బయలుదేరాలనుకున్న బాబాను ఆపేసింది ఛాయ.

"బాబా! వాసుగారంటే బాలూకు సదభిప్రాయం వుంది. కాని...జైలు చూసి బాలు ఏమైనా ఊహించుకునే అవకాశం వుంది. వారిగురించి బాలు చెడ్డగా ఊహించడం, ఊహూ... వారు బాధపడతారు. బాలూని యిక్కడే వుంచండి బాబా! తీసికెళ్ళకండి," అంది. బాబాకు నిజమే అనిపించింది.

ఛాయ విశాలనయనాలలో కదిలిన నీటితెరకు విస్తుపోతూ, బాలూను వొదిలి వెళ్లిపోయాడు.

బాబా వెళ్ళేసరికే వాసు విడుదలఅయి వెళ్లిపోయాడు. బహుశా తను యిటు రావడం, వాసు అటువెళ్ళడం ఒకేసారి జరిగాయనుకొని, వెంటనే తిరుగుప్రయాణం అయ్యాడు బాబా.

ఒంటరిగా వచ్చిన బాబాను చూసి, ఛాయ ఆందోళనపడిపోయింది.

వాసు అక్కడికి కూడా రాలేదని తెలిడంతో బాబా దిగులుపడిపోయాడు.

వాసు ఎక్కడికి వెళ్ళాడో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

"బహుశా...యికరాడేమో!" అన్న ఆలోచనరావడంతో ఛాయ తొలిసారిగా వాసుగురించి కన్నీళ్ళు కార్చింది.

"బాలు సరేసరి. బాబాను రెండుచేతులతో కౌగలించుకొని, బావురుమని ఏడ్చేస్తూ, "వెళ్లి వెతుకుదాం బాబా!" అన్నాడు అమాయకంగా.

మూడురోజులు గడిచాక, వాసుదగ్గరినుండి ఉత్తరం వచ్చింది. ప్రస్తుతం తను ఉద్యోగ ప్రయత్నంలో వున్నట్టు, త్వరలోనేవస్తానంటూ రాసాడు.

ఆ రోజునుండి ప్రతిక్షణం ముగ్గురికళ్ళూ, దూరాన కనిపించే రోడ్డు వంక నిరీక్షిస్తూ చూసేవి.

ఒక్కనెల గడిచిపోయింది.

ఆ రోజు.....

సాయంత్రం నాలుగుదాటింది. కుటీరం వెలుపల వాలుకుర్చీలో కూర్చొని చదువుకుంటున్నాడు బాబా! ప్రక్కనేవున్న బాదంచెట్టు నీడలో, రోడ్డువంక చూస్తూ కూర్చున్నాడు బాలు. లోపల వంటప్రయత్నంలో వుందిఛాయ.

కుటీరం ముందు టాక్సీ వచ్చి ఆగింది.

"బాబా!" పరిచితమైనగొంతు. ఉలిక్కి పడ్డాడు బాబా!

కుర్చీలోనుండి బాబా లేచేలోగానే, వాసు దగ్గరగావచ్చి మోకాళ్ళమీద కూర్చొని అతని వొళ్ళో తలదాచుకున్నాడు.

"వాసూ!" ఆప్యాయతగా తలనిమురుతూ వుండిపోయాడు బాబా! "బాబా!" అన్న వాసు గొంతు వింటూనే బయటికి ఒక్క పరుగులో వచ్చేసిన ఛాయ, వరండాలోనే ఆగిపోయింది.

చాలాసేపటికి, వాసు తలెత్తి బాబా మొహంలోకి చూసాడు. బాబా చెక్కిళ్ల మీద కన్నీటి తడి చూస్తూనే చలించిపోయాడు.

"బాబా!" అంటూ ఏదో అనబోతున్న వాసు మొహాన్ని రెండుచేతుల్లోకి తీసుకొని, 'బాలు . . . బాలూని చూసావా వాసూ! బాలు నడుస్తున్నాడు. నీ కోరిక

తీర్చాను వాసూ! బాలు ఎంతో బాగా నడుస్తున్నాడు. బాలుకాళ్ళు పూర్తిగా నయమై పోయాయి" అన్నాడు. వాసు చటుక్కున లేచినిలబడి బాలువంకచూస్తూ దగ్గరికి పిలిచాడు.

"బాలూ!" అంటూ రెండుచేతులు చాచిన వాసుచేతుల్లో వాలిపోవాలనుకున్న బాలుకు ఆ క్షణంలో వాసుమీద కోపంవచ్చి, కదలకుండా నిలబడిపోయాడు.

"బాలూ! నామీద కోపంగా వుందా?'' దగ్గరగా వెళ్లి బాలుమొహాన్ని ఎత్తుతూ అడిగాడు. బాలు కళ్ళనిండా నీళ్ళు.

''ఊహుఁ... నేను...మీతో మాట్లాడను" అంటూ, వాసు చేతులను విడిపించుకొని పరుగెత్తబోయాడు. బాలూ అంటూ ఆపిన వాసు గుండెలమీద పిడికిళ్ళు బిగించి కొడుతూ''నేను మీతో మాట్లాడను ... మాట్లాడను" అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూనే వాసు మెడను చుట్టేసి, బావురుమన్నాడు బాలు.

ఆ దృశ్యం చూసిన బాబాకళ్లు, ఛాయకళ్ళు తడిసాయి.

"మరెప్పుడూ ఇక నన్ను విడిచి వెళ్లిపోరుకదూ వాసుగారూ! రోజూ మిమ్మల్ని చూడాలన్పించి, మీరు రాకపోయేసరికి ఏడుపువచ్చి ... చచ్చిపోవాలనిపించేది.'' బాలు మాటలు వింటూనే వాసు హృదయం ఆనందంతో, ఆత్మీయతతో నిండిపోయి, బాలు మొహాన్ని చేతులతో నిమురుతూ ''బాలూ! . .బాలూ'' అంటూ వుండిపోయాడు. అంతకంటే ఆ క్షణంలో వాసు ఎక్కువగా మాట్లాడలేకపోయాడు.

చాలా సేపటికి బాలుని తీసుకొని, యింట్లోకి రాబోతున్న వాసు, గుమ్మంలో నిలబడి తనవంకే చూస్తున్న ఛాయవంక రెండు క్షణాలు చూసి, తలవాల్చుకున్నాడు. నల్లటి అంచుతో వున్న తెల్లటి ఖద్దరుచీరలో నిండుగా కనిపించింది ఛాయ.

తనను చూసి తలవాల్చుకొని లోపలికి వెళ్ళిపోయిన వాసును చూసిన ఛాయ మనసు గాయపడింది. "తనను పలకరించలేదేం? బాలును దగ్గరికి తీసుకున్న వాసు కనీసం తనను . . . ఒక్కసారి కూడా పలకరించలేదేం?''

అతను పలకరించలేదు. కాని నువ్వు మాట్లాడవచ్చుగా! మనసు నిలదీసింది. కాని ఛాయలోని అభిమానం ఛాయచేత 'ఊహుఁ' అనిపించింది.

ఆ రాత్రి నిద్రపోయేముందు, బాబా చెప్పాడు. ''వాసూ! నువ్వోసారి ఉత్తరంలో వ్రాసావ్ బాలుకు చదువు చెప్పమంటూ. ఛాయ ఈ మూడు సంవత్స

రాలుగా నేర్పింది. స్కూల్లో చేర్పిస్తే బావుంటుంది. యిక్కడే ఊళ్ళో హైస్కూల్‌లో చేర్పిస్తే చదువుకుంటాడు. రేపే నేను మాస్టారును కనుక్కుంటాను" అన్నాడు.

"లేదు...లేదు బాబా! నేను యిక్కడ వుండి చదువుకోను. వాసుగారితో నేను వెళ్ళిపోతాను" అన్నాడు వాసుపక్కనే వున్న బాలు.

బాబా చెప్పింది బావుంది బాలూ! చూడు నేను ప్రతివారం యిక్కడికి వస్తుంటాను. ఈ వాతావరణం, పరిసరాలు చాలా బావున్నాయ్. రంగురంగుల కలయికగా కన్పించి మోసంచేసే నగరజీవితంకంటే యిక్కడే ఎంతో బావుంటుంది. చూడు, చిన్నప్పుడు నేను యిక్కడే పెరిగి, యిక్కడే చదువుకున్నాను అన్నాడు.

"అయితే-నేను మీ అంత మంచివాడినవుతానా?" అమాయకంగా అడిగాడు బాలు.

"ఓహ్ .. వద్దు బాలూ! నాలాంటి దౌర్భాగ్యుడు మరొకడు వుండడు. నేను చెప్పే విషయం అదికాదు. ఆడంబరమైన ఆ నగరజీవితంకంటే ప్రశాంతమైన యిక్కడి జీవితమే నిన్ను ఓ మంచివాడుగా తీరుస్తుంది. బాబా, మీ అక్కయ్య నీకు తోడుగా వుంటారు" అన్నాడు.

"అయితే నిజంగా ప్రతివారం మీరు వస్తారుకదూ! మళ్ళీ..."

"ఛ . . .లేదు బాలూ! ప్రతివారం తప్పకుండా వస్తాను" అన్నాడు వాసు.

మరో రెండురోజులు వుండి బయలుదేరాడు వాసు.

సేట్ చమన్‌లాల్ చాలా మంచివాడని, దయామయుడని విన్న వాసు, అతడి దగ్గరికి వెళ్ళాడు ఉద్యోగంకోసం. విషయం అంతా వినికూడా చమన్‌లాల్ టాక్సీ డ్రయివరుగా వాసుకు ఉద్యోగం యిచ్చాడు. సేట్ చమన్‌లాల్ దగ్గర ఓ పది టాక్సీలు వున్నాయ్. ప్రతిరోజు టాక్సీ కింతచొప్పున యివ్వాలి. లేదా రోజు సంపాదించిదంతా సేట్‌జీకి యిచ్చేస్తే నెలజీతంగా అతనే కొంతయిస్తాడు. ఈ వివరాలు విన్నవాసు —"రోజూ సంపాదించిందంతా మీకు ఇస్తూవుంటే ఏనాటికైనా స్వార్థంగా ఆలోచించి మిమ్మల్ని మోసగించే అవకాశం వుంటుంది సేట్‌జీ! రోజు కింతగా నేనే మీకు యిస్తాను" అంటూ సేట్‌జీ చెప్పిన మొదటి పద్ధతికే అంగీకరించి, టాక్సీ తీసుకున్నాడు వాసు. రోజూ సేట్‌జీకిఇవ్వగా తన ఖర్చులు పోగా నెలకు నాలుగువందలవరకు వెనకేసేవాడు వాసు.

నెల గడిచిపోయింది. ఈసారి బాలూదగ్గరికి వెళ్ళేటప్పుడు, పండక్కి బాలుకు బట్టలు తీసుకువెళ్దామని షాపుకెళ్ళాడు వాసు.

లేతగులాబి రంగుకు, నల్లటి బోర్డరుతో మెత్తగా వున్న అందమైన చీరను చూస్తూనే వాసుకు ఛాయ గుర్తుకు వచ్చింది. పండగ అన్న విషయం గుర్తుకు వచ్చింది. మరేం ఆలోచించకుండా కొనేసి, టాక్సీలో పెట్టుకొని బయలు దేరాడు.

తీరా ఊరు చేరుతూవుండగా, వాసుకు అనుమానం కలిగింది. తను తీసుకెడు తున్నాడేకాని ఛాయ తీసుకుంటుందో లేదో_తీసుకోనంటే- యిన్నాళ్ళుగా తాను ప్రతివారం వెడుతున్నా, ఒక్కసారి పలుకరించని ఛాయ, ఈనాడు తను చీర తీసికెళ్ళి యిస్తే... "స్వార్థం" అనుకుంటుందేమో!

ఛ...తనెంత పొరపాటువేసాడు. వెనకా ముందూ ఆలోచించకుండా కొనేసాడు. ఇప్పుడు ఛాయ తీసుకోకపోతే—తానలా చేయడం, మరోలా అర్థం చేసుకుంటే——

వాసు మనసంతా ఆలోచనలతో గజిబిజిగా మారిపోయింది.

టాక్సీ కుటీరంముందు ఆగుతూనే బాలు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"రేపు పండగకదూ! మీరు ఈసారి రేపే వెళ్ళిపోవడానికి వీల్లేదు. రెండు మూడు రోజులుండాలి'' అన్నాడు బాలు.

"ఊఁ..." అంటూనే లోపలికి వెళ్ళాడు వాసు. బాబా కనిపించలేదు.

"బాబా లేడా బాలూ!" అన్నాడు, తను తెచ్చినవి చూపిస్తూ.

"బాబా ఊళ్ళోకి యిందాకే వెళ్ళాడు. నేను వెళ్ళి పిలుచుకువస్తాను" అంటూ, తనకు తెచ్చిన బట్టలను చూసి మురిసిపోతూ, వాసు యివ్వకుండా చేతిలో పట్టు కున్న ప్యాకెట్టును చూస్తూ, "అదేమిటి? అక్కయ్యకోసమా?'' అన్నాడు, బాలు. ఉలిక్కిపడుతూ, "వెళ్ళి పిలుచుకురా బాలూ, బాబాని. తర్వాగా రమ్మని చెప్పు'' అంటూ బాలును పంపించాడు. హుషారుగా పరిగెత్తాడు బాలు.

ఆ చీర బాలు చూడకుండా వుంటే దాచేసి, తిరిగి వెళ్ళగానే వాపస్ యిచ్చేద్దా మనుకున్న వాసు అంచనా తారుమారైంది. బాలు చూసాడు. బాబాతో ఈ విషయం చెబుతాడు. ఛాయకు కూడా తెలుస్తుంది. తానిప్పుడు దాచి ప్రయోజనం లేదు. బాబా ముందు, ఛాయ ఆ చీర తీసుకోవడానికి నిరాకరిస్తే...ఊహుఁ... అలా కాకూడదు. బాబా రాకముందే ఛాయకు ఆ చీర యివ్వాలి. బాబా రాకముందే జరగాల్సింది జరిగిపోతే——

చటుక్కున చీర తీసుకొని లేచి నిలబడి ముందుకు కదలబోతున్న వాసు, గుమ్మంలో నిలబడి తనవంకే చూస్తున్న ఛాయను చూస్తూనే తన ఆలోచనలను

ఆమె పసికట్టిందేమోనని అనుకుంటూ, కాసేపు తటపటాయించి, మెల్లిగా గుమ్మందగ్గరికి వెళ్ళి, అరుగుమీద చీర పెడుతూ—

"షాపులో కెళ్ళగానే ఎంతో బాగా అనిపించింది. తీసుకొచ్చేసాను. యిలా తేవడంలో స్వార్థం, ఆశ అనేవేవీ లేవు. పండగ వస్తోందని, తీసుకొచ్చేశాను. ఈ చీర యిప్పుడు మీరు తీసుకోకపోతే-బాబా ముందు...ఊహుఁ..." అంటూ ఆగిపోయాడు.

ఎదుటిమనిషినుండి ఎటువంటి సమాధానం రాకపోవడంతో తలెత్తి చూసాడు. ఛాయ సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తోంది.

"మీరు తీసుకోవడానికి అనుమానిస్తున్నారా ఛాయా! సరే..." అంటూ, చీర అందుకోబోయేలోగానే, ఒక్క అంగలో ముందుకువచ్చి అతని చేతిలోని చీరను లాక్కొని లోపలికి వెళ్ళిపోయింది ఛాయ. బిత్తరపోయి నిలబడ్డాడు వాసు.

లోపలినుండి వెక్కిళ్ళు వినరావడంతో కంగారుపడిపోయాడు.

"ఆనాడు మీరు ప్రామిస్ చేయమంటే-మాట నిలబెట్టుకుంటానని, యిన్నాళ్ళు మీ కోరిక ప్రకారమే మాట్లాడలేదు ఛాయా! కాని...ఈనాడు మాట్లాడి మీకు బాధ కలిగించాను. నన్ను..." వాసు మాట పూర్తి కాకముందే, విసురుగా తలెత్తి చూసింది ఛాయ. వాసు చూపు తిప్పుకున్నాడు

"నాతో మాట్లాడ్డమే అంత అసహ్యంగా తోస్తే ఈ చీర తేవడం దేనికి? ఎందుకు? మీకు కావలసింది బాలు కదూ!" అంది.

కళ్ళు తిప్పి చూసాడు వాసు.

"ఒకనాడు నా మొండితనంతో మిమ్మల్ని బాధపెట్టాను. ఆనాటి నా ప్రవర్తన గురించి ఇప్పుడు ప్రతిక్షణం సిగ్గుతో చచ్చిపోతున్నాను. కాని...ఈనాడు నాపట్ల మీరు చూపే నిర్లక్ష్యం నన్నెంత బాధపెడుతుందో ఒక్కసారి ఆలోచించరేం?"

వాసు నిర్ఘాంతపోయాడు.

"నేను మిమ్మల్ని నిర్లక్ష్యంగా చూసానా?" అన్నట్టుగా చూసాడు.

"అవును. ఈ యింట్లో బాబా, బాలు తప్ప మరో వ్యక్తి వున్నట్టు, బాబా బాలులాగే మీ రాకకోసం, ఆత్రుతగా, ఆశగా ఎదురుచూసే మరో మనిషి వుందన్న గుర్తింపే మీకుంటే-నేనింత ఒంటరిదాన్నయిపోయేదాన్ని కాదు. మీరు బాబాకి కావాలి. బాలుకు కావాలి. మీకు వాళ్ళిద్దరూ కావాలి. చివరికి...నేనే



ఒంటరిదాన్నయిపోయాను. నా ఒంటరితనానికి కారణం మీరే'' అన్నట్టుగా చూసి, ఏడుస్తున్న ఛాయ మాటలకు నిశ్చేష్టగా నిలబడిపోయాడు వాసు.

అతని మనసులో ఆందోళనలాంటిది ప్రారంభమైంది.

"క్షమించండి ఛాయా! మీ ఒంటరితనానికి కారణం నేనే అయితే–మీ ఒంటరితనాన్ని పోగొట్టే బాధ్యత నాదే. మీరు అంగీకరించరని, నేనేంచేసినా, "స్వార్థం" అంటూ మీరు అసహ్యించుకుంటారనే నేను మౌనం వహించాను. ఈ సారి నేను వెళ్ళి, తిరిగి వచ్చాక..." అంటూ ఆగిపోయాడు.

అతని మాటలకు ఛాయ కళ్ళు క్షణంసేపు మెరిసినా, అతడు మధ్యలో ఆగిపోవడంతో తలెత్తి చూసింది.

''మూర్తిగారిని కలుసుకోమంటారా?'' అన్నాడు. ఉలిక్కిపడుతూ చూసింది ఛాయ.

"ఎందుకూ?"

''మీ...గురించి..."

అతనేమంటున్నాడో, ఎందుకంటున్నాడో అర్థంచేసుకుంది ఛాయ ఆనాడు మూర్తి తనకు దగ్గరగా నిలబడ్డం చూసిన అతను...అలా ఊహించుకోవడం... తన దురదృష్టం.

"నామీద మీకెందుకింత కసి చెప్పండి వాసూ?" అంది ఏడుస్తూ.

తానేం మాట్లాడినా ఛాయ ఎందుకలా అర్థంచేసుకుంటుందో అర్థంకాలేదు వాసుకు. తానిప్పుడేం తప్పుగా మాట్లాడాడని ఆమె 'కసి' అనుకుంటోంది?

"అందరూ నన్ను మోసంచేయాలని, బలవంతంగానైనా నన్ను ప్రాణంవున్న శవంగా మార్చాలని చూసారు. కాని...మీరు...ప్రాణంకంటె ఎక్కువ విలువ యిచ్చి, నాకు ఊపిరనుకుంటున్న నా అభిమానాన్నే చంపాలనుకుంటున్నారు కదూ? ఒకనాడు మిమ్మల్ని నేను అసహ్యించుకున్నాను. కాని...ఈనాడు మీరు ప్రతీకార వాంఛతో నన్ను..."

"ఛాయా!" సహనాన్ని కోల్పోయాడు వాసు.

"ఆఁ...అవును. మీరు అరిస్తే నేనేం భయపడను. నిజంగా నామీద పగతీర్చుకోవాలని వుంటే, నా గొంతునులిమి చంపేయండి అంతేకాని...నన్ను పణంగా పెట్టి ప్రమోషన్ సంపాదించుకోవాలని చూసిన మూర్తితో మీరు మాట్లాడి నాకు ...వీల్లేదు...అలా నన్నో పశువుకు అప్పచెప్పేబదులు చంపేయండి. యిలాగైనా మాకు మీరు చేసిన ఋణం తీర్చుకుంటాను..." అంటున్న ఛాయవంక చూళ్లేక తలవాల్చుకున్నాడు.

"నన్ను చంపడానికి కూడా అసహ్యపడుతున్నారా?" ఛాయ ప్రశ్న సూటిగా గుండెను తాకడంతో, తననంతగా ఆమె మాటలతో బాధిస్తూ, ఎందుకు తన ఆవేశాన్ని రెచ్చగొడుతుందో అర్థంకాలేదు వాసుకు.

"వాసూ!" బాబా పిలుపు వింటూనే బయటికి వెళ్ళాడు వాసు ఛాయ కళ్ళు గట్టిగా తుడిచేసుకొని పెరటివైపు వెళ్ళిపోయింది.

వాసు మొహం చిన్నబోయి వుండడం, ఛాయ కళ్ళుఎర్రబారి వుండటం చూసిన బాబాకు మనసులో ఏ మూలో శంకలాంటిది మెదిలింది. ఛాయ, వాసు మొదటి రోజునుండి అతనికి అర్థంకాని సమస్యగానే మిగిలినా అతడేనాడూ ఎవ్వరినీ నిలదీసి అడగలేదు.

కాని, ఈనాడు ఛాయ ఎర్రబారిన కళ్ళు, వాడిపోయిన వాసు మొహం చూసాక బాబా ఆగలేకపోయాడు.

ఆ రాత్రి నిద్రపోయేముందు అడిగాడు.

"వాసూ! బాలును స్కూల్లో చేర్పించాం, బాగానేవుంది. కాని...ఛాయ ఎన్నాళ్లిలా వుంటుంది?" బాబా ప్రశ్నకు ఉలిక్కిపడుతూ చూసాడు వాసు. దిండులో మొహందాచుకొని నిశ్శబ్దంగా ఏడుస్తున్న ఛాయకూడా, లీలగా

విన్పించిన బాబా ప్రశ్నకు, వాసు చెప్పే జవాబుకోసం ఆశగా, ఆత్రుతగా ఎదురుచూడసాగింది.

"ఆ అమ్మాయికి బాలుతప్ప ఎవ్వరూలేరు బాబా! తల్లీ, తండ్రీ బాలు చిన్నగా ఉన్నప్పుడే పోయారనుకుంటా? యిన్నాళ్ళూ వాళ్ళ మేనత్త దగ్గరుండేది. కాని... ఛాయ అక్కడికి వెళ్ళి ఆవిడదగ్గర ఉండలేదు." అంటూ రెండు నిమిషాలు ఆగి ఏదో అనబోయాడు.

"అదికాదు వాసూ? నువ్వెన్నాళ్ళు యిలావుంటావు? ఆ అమ్మాయిని..."

"బాబా!" ఆవేదనగా పిలిచాడు వాసు. బాబా అభిప్రాయం అర్థం అయిందతనికి.

"ఆ అమ్మాయికి నేనెన్నడూ తగినవాణ్ణికాదు బాబా! ఆ అమ్మాయి చదువులో, సంస్కారంలో, గుణంలో నాకంటె అధికురాలు. నేను...చరిత్రహీనుణ్ణి. ఆడపిల్ల అయినా నిప్పులాంటి ఆ అమ్మాయికి, నావంటి దౌర్భాగ్యుణ్ణి తోడుగా... ప్చ్...బాబా! నా గతచరిత్ర నీకంటె బాగా ఆ అమ్మాయికి తెలుసు. అంతే కాదు, మూడేళ్ళ జైలుశిక్ష గడిపి వచ్చిన నావంటివాణ్ణి ఆ అమ్మాయి ఎప్పుడూ కోరుకోదు" అన్నాడు.

"వాసూ! ఆ అమ్మాయిని నువ్వు అర్థంచేసుకోలేదేమో!" అన్నాడు బాబా, వాసు ఉత్తరం రాగానే, వాసు వస్తాడనగానే ఛాయ కళ్ళలో మెరుపులు మెరవడం గుర్తుకు తెచ్చుకుంటూ.

"అర్థంచేసుకున్నాను కాబట్టే బాబా!"

"అయితే...నువ్విలా చేయడం...బాలు కోసమేనా?"

"ఆc...నాలో మంచితనం వుందో లేదో కాని బాబా, నాలోని మంచితనాన్ని చూసి, ఆదరించి, అమాయకంగా నన్ను అభిమానించిన బాలు అభిమానాన్ని నేను ఎప్పుడూ మర్చిపోలేను బాబా! జీవితమంతా బాలు స్నేహంలో గడిపేస్తాను."

వాసు మాటలకు బాబా జాలిగా నవ్వాడు.

"రేపు ఛాయ వెళ్ళిపోతానంటే బాలు వెంట వెళ్ళిపోతాడు వాసూ!"

"అవును. కాని.. ఛాయ ఎక్కడికి వెడుతుంది బాబా?"

"అమాయకంగా ఆలోచించకు వాసూ! ఆ అమ్మాయికి అభిమానం ఎక్కువ. ఎప్పటికీ యిలాగే యిక్కడే వుండిపోతుందా ఏమిటి? వాళ్ళ అవసరాలని..."

"నేను వున్నాగా బాబా! నేనుండగా వాళ్ళకెలాంటి లోపం.."

"వాళ్ళకు నువ్వు ఏమౌతావు వాసూ?"

బాబా అడిగిన ఆ సూటి ప్రశ్నకు బిత్తరపోతూ 'అవును నేనేమౌతాను?' అని తనను తానే ప్రశ్నించుకున్నాడు.

"అందుకే—నువ్వు ఛాయను పెళ్లిచేసుకో..." గట్టిగా అన్నాడు బాబా!

"బాబా!" కంగారుగా పిలిచాడు వాసు.

"అవును వాసూ! నీ ఆదరణలో ఎలాంటి అధికారం, హక్కు లేకుండా ఛాయ వుండలేదు, వుండదు. నీ ఆదరణ అందించడానికి నీ హీనచరిత్ర అడ్డు రానప్పుడు..."

"ఓహ్...అదికాదు బాబా! ఛాయకు,నేనంటే...నేనంటే.." అంటూ అనాల్సిన మాట అనలేక, "నేను ఆ అమ్మాయికి తగను బాబా! ఆ అమ్మాయికి పెళ్లి చేసేద్దాం మంచికుర్రాణ్ణి చూసి. బాలు నాదగ్గరే వుంటాడు" అన్నాడు.

"వాసూ! ఆ అమ్మాయి నీ సహాయాన్ని భరించలేదు. ఛాయకు అభిమానం ఎక్కువన్న విషయం మర్చిపోతున్నావ్. అయినా నీకెందుకు నువ్వు పడుకో, రేపు నేనే అడుగుతాను" అన్నాడు బాబా.

"వద్దు బాబా! అనవసరంగా ఆ అమ్మాయిని బాధపెట్టకు. అసలు నువ్వు చెప్పేది ఆ అమ్మాయి అర్థంచేసుకోదు. నన్ను అపార్థంచేసుకుంటుంది. నేను పట్టి స్వార్థపరుడినైపోతానప్పుడు" అని అనాలనుకున్న వాసుకు, హఠాత్తుగా సాయంత్రంవేళ ఛాయ అన్నమాటలు గుర్తుకురావడంతో ఆగిపోయాడు.

అర్ధరాత్రి దాటిపోయింది.

ఛాయ మాటలకు అర్థాన్ని వెతుక్కుంటూ, ఆమె అభిప్రాయం ఏమిటో అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తున్న వాసుకు నిద్రరావడంలేదు. అశాంతిగా గుండెలమీద రాసుకుంటూ, ఆలోచిస్తున్న వాసు ఛాయ బయటికి రావడంచూసి ఉలిక్కిపడిపోయాడు. ఛాయ నిశబ్దంగా తనదగ్గరికివచ్చి, బాలుని చూసి, మెల్లిగా బయటికి వెళ్ళిపోవడంచూసి కంగారుపడిపోయాడు. కుటీరందాటి, వంపు దాటి, రోడ్డెక్కిన ఛాయను ఆపేసాడు వాసు.

"ఎక్కడికి?" అన్నాడు ఎదురుగావెళ్ళి నిలబడి చూస్తూ.

"చచ్చిపోవడానికి మాత్రంకాదు." నిర్లిప్తంగా అంది ఛాయ.

"మరి...ఎక్కడికి? మీరిలా వెళ్ళిపోవడానికి నేనే కారణం కదూ!" అన్నట్టుగా చూసాడు వాసు.




"ఇన్నాళ్ళూ నేను ఒంటరిదాన్నన్న నిజం తెలియలేదు వాసూ! ఈనాడు, నేను ఒంటరిదాన్నే కాదు. ఒక దౌర్భాగ్యురాలినన్న సత్యం తెలిసి వెళ్ళిపోతున్నాను. నాకిక్కడ వుండాలనిలేదు." మెల్లిగా అంది ఛాయ.

"ఎందుకు?" వాసు ప్రశ్నకు చివ్వున తలెత్తి చూసింది.

"ఒకనాడు బాలూతోపాటు నన్ను బాబా దగ్గరికి మీరు రమ్మన్నారు. ఆ పిలుపులో మామీద జాలితోపాటు, ఏదో అధికారం ధ్వనించింది. ఆ అధికారం నీడలో వుండాలనే చివరికి నేను వచ్చాను. కాని...ఇన్నాళ్ళు, బాలూకు మీ ఆత్మీయతతో నిండిన ఆదరణ, నాకు జాలితో నిండిన ఆదరణ అందింది. బాలూకు మీరంటే అభిమానం. నేను...మీకేం కాకుండా, మీ ఆదరణను, అయాచితంగా పొందడం నాకిష్టంలేదు.

"అంతే..."

"బాలు చాలా అదృష్టవంతుడు. అందరిని మరిపించే ఆత్మీయుణ్ని సంపాదించుకున్నాడు. మీ జీవితానికి సర్వస్వం అయాడు. కాని...నేను మీకేం కాలేకపోయాను. మీ దయా..."

"కాని...ఛాయా బలవంతంగా మీ వద్దనుండి నేనేం ఆశించటంలేదు. నా దయాధర్మాలమీద ఆధారపడ్డానన్న విషయం మరిచిపోండి. అలా అని నేను మీపై అధికారం చలాయించను. నాకా...అభిప్రాయం కూడా..."

"బాలు కుంటివాడనే జాలి ప్రేమగా మారింది. మీ అభిమానానికి పాత్రుడయ్యాడు. కాని...నేను బ్రతగ్గలను. నాకు మీ జాలీ, సానుభూతీ అక్కర్లేదు." కటువుగా అంది ఛాయ.

"కాని...మీరు ఒంటరిగా..." వాసు ఆగిపోయాడు.

"ఎక్కడున్నా హక్కుగా, అధికారంగా వుండడానికే ప్రయత్నిస్తాను" అంది.

అర్థంకానట్టు చూసాడు.

"ఇక్కడ మీ అధికారం ఎవ్వరు కాదన్నారు?" అన్నాడు.

"మీరే...అవును ముమ్మాటికీ మీరే! ఒకనాడు మొండితనంతో మీకు చేరువ కాలేకపోయాను. ఈనాడు బాబాతో మీరన్నమాటలు విన్నాక, జీవితంలో మరెన్నడూ మీకు చేరువకాలేనన్న నిజం తెలిసాక...యిక్కడే వుండడానికి నాకు అధికారం, హక్కు ఎక్కడ వున్నాయ్," అంది ఛాయ.

"ఛాయా!" నిశ్చేష్టగా చూస్తూ వుండిపోయాడు వాసు.

"మీరు నాకు చేరువ కావాలనుకుంటున్నారా?" ఏ మూలో హృదయంలో వెలుగుతున్న చిన్న ఆశాకిరణం, ఆ క్షణంలో పెద్దగామారి గుండెనిండా నిండి కళ్ళను వెలుగుతో నింపాయి. గుండెలోతుల్లోని ఏ పలుచటిపొరల క్రిందో బలవంతంగా అణచి నొక్కిపెట్టిన ఆశ, ఉవ్వెత్తున, ఎగిసిపడే తరంగంలామారి ఆనందాతిశయంతో వాసును ముంచేసింది.

"నిజంగానా ఛాయా!" ఉద్వేగంగా ఆమె రెండు చేతులను పట్టుకొని అడిగాడు వాసు.

"అబద్ధం! నేను చెప్పేది అబద్ధం కదూ! ఎందుకు నన్ను యిలా పరీక్షిస్తూ బాధపెడుతున్నారు? నన్నెందుకు నమ్మడంలేదు?" అంది ఛాయ, పిడికిలి బిగించి అతని గుండెలమీద పసిపిల్లలా కొడుతూ, ఏడుస్తోంది ఛాయ. వాసుకు బాలు గుర్తుకువచ్చాడు.

"నన్ను మరెవ్వరికో అప్పగించకండి వాసూ! నన్ను యిలాగే మీ ఛాయగా మిగిలిపోనివ్వండి" అంది ఛాయ. అతని నీడలో ఆమె నీడ, అతని కళ్ళనిండా—ఛాయ. అతని గుండెల్లో—ఛాయ. అతని ఛాయ.

---




రాత్రి తొమ్మిది దాటింది.

అప్పటివరకు కుండపోతగా కురిసిన వర్షం తగ్గుముఖం పట్టింది. వీధి కాలవ లోని మురికినీరు స్వేచ్ఛగా రోడ్లమీద ప్రవహిస్తుంది. అప్పుడప్పుడు ఆకాశం మెరుస్తుంది.

తీరిగ్గా వీధి వరండాలో కూర్చొని, చుట్ట కాలుస్తున్న శివరాం తనను ఎవరో పిలిచినట్లు వినబడగానే, చుట్ట నుసి కొనవేళ్లతో దులిపి, పక్కకు తిరిగి చూశాడు.

ఎవరో మెట్లమీద నిలబడిఉన్నారు. స్పష్టంగా కనిపించడంలేదు. కరెంటు పోవడంవలన వరండాలో బాగా చీకటిగా ఉంది. శివరాం వచ్చిన వ్యక్తి వేపు తీక్షణంగాచూశాడు. కానీ, అతన్ని గుర్తు పట్టలేకపోయాడు. సదేహంగా చూస్తూ ఉండిపోయాడు.

మళ్లీ అతను పిలిచాడు.

"ఎవరూ?..." ఈసారి శివరాం ప్రశ్నించాడు.

"నమస్కారం సార్...నా పేరు గోపాలం...రామశేషయ్యగారి అబ్బాయిని..." అతను తనను పరిచయం చేసుకున్నాడు. రామశేషయ్య పేరు ఎప్పుడో విన్నట్టుగా తోచినా, అతనెవరో శివరాంకి సరిగా జ్ఞాపకం రాలేదు. గుర్తు రాకపోయినా, ఎరిగున్నట్టుగా సభ్యతగా గోపాలాన్ని పలకరించాడు.

"ఓ...ఓ...నువ్వటమ్మా.. ఎవరో అనుకున్నాను. పోల్చలేకపోయాను ... మీదికిరా...ఇంట్లో అంతాబావున్నారా?" చిన్నవాళ్లనయినా, పెద్దవాళ్లనయినా ఆప్యాయతగా 'అమ్మ' అని పిలవటం అతనికి అలవాటు.

గోపాలం మౌనంగా వచ్చి, శివరాంకి

కొంచెం దూరంలో చేతులు కట్టుకొని నిలుచున్నాడు. శివరాం - వరండాలోకి లాంతరు పట్టుకురమ్మని భార్యను పిలిచాడు.

కామాక్షి వెలిగించిన హరికెన్ లాంతరు తీసుకువచ్చి, బల్లమీద పెట్టి, వత్తి పెద్దది చేసింది. వరండా అంతా వెలుగు పరుచుకుంది.

స్తబ్ధుగా నిల్చున్న గోపాలంవేపు పరిశీలనగా చూశాడు, శివరాం. రెండు పదులు దాటక పోయినా, జీవితంలో ఊగిసలాడి విసిగిపోయిన గోపాలం సన్నగా నిలబెట్టిన వెదురు బద్దలా ఉన్నాడు. వర్షానికి తడిసిన బట్టలు శరీరానికి అతుక్కుపోవడం వలన ముందున్న ఎముకల ఎత్తుపల్లాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి గాజు గోళీల్లాంటి కళ్ళు అతను అనుభవిస్తున్న నికృష్ట జీవితాన్ని దారుణంగా చూపిస్తున్నాయి. ఎప్పుడో చేసుకున్న పాపం, దరిద్రంగామారి అతన్ని పిప్పిచేస్తుందని అనుకోవచ్చును. నిస్తేజంగా ఉన్న అతని ముఖంమీద యింకా నీరు కారుతుంది. ఆ ముఖంలో భయమూ అందోళన చోటుచేసుకున్నాయి.

గోపాలం ముఖంలో పోలికలు చూసిన తర్వాత-రామశేషయ్యతో ఉన్న చిన్న పరిచయం శివరాంకి గుర్తు వచ్చింది. పరిచయం ఎలా కలిగిందో గుర్తు లేక పోయినా, మనిషి 'ఫలానా' అని తెలిసింది.

"మీ నాన్నగారు ?..." శివరాం అర్ధోక్తిలో 'ఆగిపోయాడు. ఏ ప్రశ్న వేయాలో ఆతను ముందుగా ఆలోచించ లేదు.

అయిదేళ్ల క్రిందట గోపాలం తండ్రి చెప్పా చెయ్యకుండా హఠాత్తుగా కళ్ళు మూశాడు. మూసిన కళ్ళు మళ్ళీ తెరవ లేదు. తన ఋణం తీర్చుకోలేకపోయినా ఉన్నవాళ్ల ఋణం తీర్చుకోమన్నట్లు పెద్ద సంసారాన్ని, పుట్టెడు అప్పుల్నీ గోపాలం చేతిలో పెట్టి, కన్నీళ్లు పంచి పెట్టి 'జీవితంలో నాపాత్ర అయిపోయిం' దంటూ చక్కగా వెళ్ళిపోయాడు.

"మా నాన్నగారు లేరండి...ఆయన చనిపోయారు." గోపాలం బరువుగా సమాధానం యిచ్చాడు.

"అయ్యో పాపం!...ఏ మనిషికి ఎప్పుడు చావురానుందో మనకు తెలియదమ్మా...ఇంటికి పెద్దవాడివి నువ్వే కామోసు. మరి బరువు బాధ్యతలు మోయక తప్పదు" చాల అనునయంగా మాట్లాడాడు, శివరాం.

కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి

"ఏంవమ్మా! ... ఉద్యోగం ఏదైనా చేస్తున్నావా ?"

శివరాం అలా అడిగేసరికి, గోపాలంకి కొండంత ధైర్యం వచ్చింది. తన మనసు

లోని విషయాన్ని బయటపెట్టటానికి అవకాశం కలిగింది.

"సార్ నాన్నగారు పోయినప్పట్నించి ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాను. నా ప్రయత్నాలు ప్రయత్నాలుగానే మిగిలిపోయాయి. ఉద్యోగం దొరకలేదు...ఇంతకాలం అమ్మా చెల్లెలూ చాకిరీలు చేసి, ఇల్లు గడుపుతుంటే, దౌర్భాగ్యుడిలా చూస్తూ ఊరుకోవడం తప్ప నేనేమీ చేయలేక పోతున్నాను.

"సార్...నాకు ఒకే ఒక అదృష్టం కలిగింది. మీ ఫ్యాక్టరీలో మెకానికల్ డిపార్టుమెంటులో సెలక్టయ్యాను. మెడికల్ టెస్ట్‌కి రమ్మని పిలిచారు...నేను మెడికల్లో నెగ్గితే, నాకు ఉద్యోగం అవుతుంది...సార్! అంతా మీ చేతుల్లో ఉంది. మీరు డాక్టరుగారితో చెబితే, నాకు తప్పకుండా ఉద్యోగం దొరుకుతుంది. మీరు సహాయం చేసి, మమ్మల్ని కాపాడాలి, సార్.." గోపాలం తనఇంటి పరిస్థితులతోబాటు వచ్చిన పనికూడ వివరించాడు. పెద్దవాడిగా తన బాధ్యత నిర్వర్తించాలనీ, ఇంట్లోవాళ్లని సుఖపెట్టాలనీ మరేమో చేయాలనుకుంటున్నాడు. కటిక చీకటిలాంటి తన జీవితంలో ఓ కాంతిరేఖ మెరిసింది. అది చేజారిపోతుందనే అనుమానం అతన్ని పీడిస్తుంది.

శివరాం మాట్లాడలేదు. అతని భ్రుకుటి ముడిపడింది. సాధారణంగా ఏ ఉద్యోగానికైనా ఎవర్నయినా ఎన్నుకొని తీసుకుంటే, వాళ్లనుఫ్యాక్టరీలో ఉన్న డిస్పెన్సరీ డాక్టరుదగ్గరికి పంపిస్తారు. డాక్టరు మెడికల్‌గా సిఫారసు చేస్తే తప్ప ఎవర్నీ ఉద్యోగంలోకి తీసుకోరు. గోపాలానికీ అస్థిపంజరానికీ అట్టేతేడా ఉండదు. ఎముకలగూడుమీద పలుచని చర్మం అంటించి, మీద బట్టలు కప్పినట్టు ఉంటాడు అతను. అతన్ని ఏ మెడికల్ ఆఫీసరయినా సిఫారసు చేయడని ఖచ్చితంగా చెప్పవచ్చును.

"సార్!...మీరు కాదనరనే నమ్మకంతో మీ దగ్గరికి వచ్చాను...మీ మాట డాక్టరుగారు కాదనరు...నాకు ఉద్యోగం లేకపోతే, మా ఇంట్లో అంతా పస్తులతో మాడి చస్తాం సార్...మా అమ్మ ముసలిదయిపోయింది. ఆమెను కష్టపడమని నేను అసమర్థుడిలా కూర్చోలేను. నన్ను నమ్ముకున్నవాళ్లకి కన్నీళ్లు చూపించి నిరాశలు పెంచలేను...సార్! మీ మేలు ఎప్పటికీ మరిచిపోను...మీ డాక్టరుగారితో చెప్పి ఈ ఒక్క అదృష్టానికి దూరంకాకుండా చేయండి...ఆయనతో చెప్పి నాకు ఉద్యోగం వచ్చేలా చూడండి...ప్లీజ్." గోపాలం ప్రాధేయపడ్డాడు. ఆ మాటల్లో దైన్యభావం నిండిఉంది. కళ్ళలో నీరు నిలిచింది.

శివరాం యిబ్బందిలో పడ్డాడు.

శివరాం పదిహేనేళ్లుగా కాంపౌండరు

ఉద్యోగం చేస్తున్నాడు. పాత డాక్టరు గారు తన మాటను ఎప్పుడూ కాదన లేదు. గోపాలంలాంటి కొందరికి ఉపకారం చేయగలిగాడు. కానీ, పాత డాక్టరు రిటైరయిపోయాడు. కొత్త డాక్టరు వచ్చాడు. అవసరం ఉంటేగాని అతను కాంపౌండర్నిగాని మరెవర్నిగానిపిలవడు. ఎప్పుడూ ముభావంగా ఉంటాడు. కొత్త డాక్టరుతో చనువుగా ఉండాలని తను ప్రయత్నించేడు. ప్రయత్నిస్తు న్నాడుకూడ. కానీ, అతను అవకాశమే యివ్వటంలేదు. ఇప్పుడు తను గోపాలంకోసం ప్రయత్నించినా డాక్టరు గారు తన మాటకి విలువయిస్తారని నమ్మకం కుదరలేదు.

వెంటనే గోపాలంకి మాటిచ్చి ధైర్యం చెప్పలేకపోయాడు శివరాం.

"చూడమ్మా!...నీకు సహాయం చేయటానికి నాకేం అభ్యంతరం లేదు. నీలాంటివాళ్లకి ఉపకారం చేయాలనే ఉంటుంది నాకు...కానీ, మా కుర్ర డాక్టరుగారితో పేచీ ఏంటిటో మనకింకా తెలీదమ్మా...అంటే అతనేదో లంచాలు పుచ్చుకుంటాడని కాదు. రూల్సుకోసం తల బద్దలుకొట్టుకుంటాడు...ఈ కుర్ర డాక్టర్లకి జీవితం గురించి పూర్తిగా తెలీదు. కష్టం, సుఖం అని ఆలోచించ రమ్మా...అయినా నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. తరువాత నీ అదృష్టం."

"సార్!...మీ ప్రయత్నం వృధా కాదు. కొత్త డాక్టరుగారైనా మీరు అడి గితే మాటిస్తారు...నాకు ఉద్యోగం అవుతుంది. సార్...మీరు తప్ప మరెవరూ మమ్మల్ని ఆదుకోలేరు."

"సరే...ఇంతకూ నీకు మెడికల్ ఇంటర్వ్యూ ఎప్పుడు?"

"శనివారం సార్..."

"శనివారమా?...ఆ రోజు డిస్పెన్స రీకి రాగానే మొదట నన్ను కలుసుకో... నీ పేరు గోపాలంకదూ? డాక్టరుగారితో మాట్లాడతాను.. ఈ ఉపకారం చేస్తే అతనికి వచ్చే నష్టం ఏమీ ఉండదమ్మా. ఎటొచ్చీ కాసేపు అతను 'రూల్సు' పక్కకి పెట్టి, రికమెండ్ చేస్తే నీకు ఉద్యోగం అయిపోతుంది."

"ఏవండీ...ఆ అబ్బాయికి ఈ చిన్న సహాయం చేస్తే మీ డాక్టరుగారికి పుణ్యం వస్తుందని చెప్పండి...వాళ్ల కష్టాలు వింటే, అతనికి జాలికలగకపోదు!..." కామాక్షి మాట్లాడకుండా ఉండలేక పోయింది. గోపాలంమీద జాలీ, సానుభూతి.

"అంతా గోపాలం అదృష్టం... గోపాలం! నువ్వెళ్లమ్మా...మళ్లీ వర్షం వచ్చేలా ఉంది." చేతిలో ఉన్న చుట్ట పీకను వీధిలోకి విసిరి, లేచి నిలుచున్నాడు, శివరాం.

గోపాలం కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయాడు. ఆ క్షణంలో తనను అంటి పెట్టుకున్న దరిద్రానికి ఫేర్వెల్

యివ్వగల ధీమా, జీవితంలో ఓ కొత్త అధ్యాయం ఆరంభం అవుతుందనే నమ్మకమూ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేశాయి.

శివరాం చాలసేపు ఆలోచిస్తూ నిద్ర పోలేదు. అతని ఆలోచనల్లో గోపాలం, కొత్త డాక్టరు నిండిపోయారు. గోపాలానికి ఉద్యోగం దొరకాలి. కొత్త డాక్టర్ని సహాయం కోరాలి. తను సాధించాలి. మనసులో మెదిలిన ఆలోచనలకి ఓ రూపం దిద్దుకొని, ఆచరించబోయే కార్యక్రమాన్ని మననంచేసుకొన్నాడు.

సాధించగలననే నమ్మకంతో శ్వాస తీసుకొని శివరాం నిద్రకుపక్రమించాడు.

* * *

అయిదువేలమంది పని చేస్తున్న పెద్ద ఫ్యాక్టరీ. ఆకాశంలాంటి సింహద్వారం. లోపల అన్నివైపుల వివిధ రకాల డిపార్టుమెంట్లు. మెయిన్ గేటుకి నాలుగు ఫర్లాంగుల దూరంలో ఓ చిన్న కొండ. దానిమీద ఫ్యాక్టరీ డిస్పెన్సరీ. అద్దాలగోడల ఆసుపత్రి చుట్టూ అందాల లాను.

డిస్పెన్సరీ లోపలికి అడుగుపెట్టడానికి గోపాలం అడుగులు తడబడ్డాయి. ఏవో సంశయాలతో మనసంతా గజిబిజిగా ఉంది. అవ్యక్తమైన అందోళన చోటుచేసుకుంది.

"చూడమ్మా, గోపాలం!..నా శాయశక్తులా ప్రయత్నించాను. డాక్టరుగారితో అన్నీ చెప్పాను. అతను 'అలాగే' అని మాటిచ్చారు...కానీ, పని అయ్యేవరకు మనం నమ్మకూడదు. పెద్దవాళ్లు కదూ? యిచ్చిన మాటను మరిచిపోవచ్చుకూడ. నీ పరిస్థితులు అతనితో మరోసారి చెప్పటం చాల మంచిది. ఆ రూల్సు మనిషిని జాలితో కరిగించి, మన పనులు చక్కబెట్టుకోవడం తప్ప మరో మార్గం లేదు."

శివరాం ఎవరి విషయంలోనూ అంత శ్రమ తీసుకోలేదనే చెప్పాలి. ముందు రోజున —డాక్టర్ గారితో అవకాశం కల్పించుకొని, తన సొంత కొడుక్కి ఉద్యోగం యిమ్మన్నట్లుగా ప్రాధేయపడ్డాడు. డాక్టరుగారు ఆ చిన్న సహాయం చేస్తే, అతని జీవితాంతం ఋణపడి ఉంటానని ప్రతిమాలుకున్నాడు. గోపాలం ఇంటి పరిస్థితులు చెప్పి, అతనికి ఆసరా కల్పించి, అతని కుటుంబాన్ని కాపాడమని అభ్యర్థించాడు. డాక్టరుగారు అవునని తల ఊపినా ఏదో అనుమానం శివరాంలో మిగిలిపోయింది.

"సార్...మీకు ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియటంలేదు..మీరు చాల శ్రమతీసుకుంటున్నారు." గోపాలం—శివరాం రెండుచేతులు పట్టుకున్నాడు. ప్రవాహంలో కొట్టుకుపోతున్న తననూ తనవాళ్ళనూ ఒడ్డుకిచేర్చే మహానుభావుడిలా శివరాం కన్పించాడా సమయంలో.

"శ్రమాలేదూ పాడూలేదూ...నీకు

ఉద్యోగం దొరికి, మీ ఇంట్లోవాళ్ళంతా హాయిగా ఉంటే నాకెంతో తృప్తిగా ఉంటుందమ్మా...ఆ తృప్తి నాకు చాలు ...గోపాలం! టైం అవుతుంది లోపలికి నడమ్మా." శివరాం లోపలికి దారితీశాడు

వయసు మళ్ళిన తల్లి, వయసొచ్చిన చెల్లెళ్లూ, వయసురాని తమ్ముళ్లూ -తనను చుట్టుకున్న బంధాలన్నీ తనవేపు జాలిగా చూస్తున్నాయి. ఆ చూపుల్లో ఎన్నో ఆశలు కనిపిస్తున్నాయి. వాళ్ళ కన్నీళ్లు తుడిచి, ఆశలు వెలిగించాలని-నెమ్మదిగా శివరాం వెనుక నడిచాడు, గోపాలం.

చెదరిపోయిన హృదయాన్ని చిక్కబట్టుకుంటూ, అసమర్థతను అణచుకుంటూ డాక్టరుగారి ముందుకి గోపాలం వెళ్ళాడు.

డాక్టరు తన విధిని ప్రారంభించాడు.

గోపాలం గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

అంతా చీకటిగా ఉంది. విచిత్రమైన నిశ్శబ్దం మనసుని భయపెడుతుంది. వింత వింత రంగులు, ఊహించటానికి వీలుకాని పిచ్చిగీతలు, నిర్దుష్టంగాలేని ఏవో ఆకారాలు వివిధ భంగిమల్లో-క్షణాల్లో మారిపోతున్నాయి. ఎక్కడికో లాక్కుపోతున్నాయి. కిందికి తోస్తున్నాయి. మీదికి నెట్టుతున్నాయి. మళ్ళీ చీకటి చోటుచేసుకుంటుంది. ఆ చీకటిని చూడలేక గోపాలం బాధతో మెలికలు తిరిగిపోయాడు.

డాక్టరు పరీక్ష పూర్తిచేశాడు.

"ఎప్పట్నుంచి మీ కీ క్షయవ్యాధి."

గోపాలం ఉలిక్కిపడ్డాడు. డాక్టరు వేపు దీనంగా చూశాడు. ఆ చూపులో కోటి వేదనలు, అనంతకోటి అశ్రువులు నిలిచాయి. అబద్ధం చెప్పటానికి వీలుకాని నగ్నసత్యం· తన కీజబ్బు ఎప్పట్నుంచని చెప్పగలడు? కంటికి నిద్రా, మనసుకి శాంతీ లేనప్పట్నుంచని చెప్పాలి.

గోపాలం డాక్టరువేపు ఎక్కువసేపు చూడలేకపోయాడు. సమాధానంకూడ యివ్వలేకపోయాడు.

"నేను డాక్టర్ని... భయపడకండి. నాదగ్గర దాపరికం దేనికి?"

అవును డాక్టరుదగ్గర దాస్తే తన జబ్బు దాగుతుందా? దాగదు. తను అబద్ధం చెప్పకూడదు.

గోపాలం పెదవులు వణుకుతున్నాయి.

"డాక్టరుగారూ?...నేను అయిదేళ్ళ నుంచి ఉద్యోగంకోసం తిరుగుతున్నాను. నేను ఉద్యోగం సంపాదించలేకపోయాను. కానీ...కానీ, ఈ జబ్బును సంపాదించగలిగాను, డాక్టరుగారూ?.."

డాక్టరు మాట్లాడలేదు.

"సార్?...శివరాంగారు మా ఇంటి పరిస్థితులన్నీ మీతో చెప్పే ఉంటారు... మా కుటుంబంలో నేనే పెద్దవాణ్ణి,



డాక్టరుగారూ!...మా నాన్నగారు పోయి చాల రోజులయింది. నేను ఉద్యోగం చేస్తే తప్ప మా ఇల్లు గడవదు సార్! ...ఉద్యోగంకోసం రాత్రీ పగలూ కష్ట పడి తిరిగాను. నా చదువు కొన్ని ఉద్యో గాలకి పనికిరాలేదు...కొన్ని ఉద్యోగా లకి నేను పనికిరాలేదు. ఈ అయిదేళ్ళలో నా ఆరోగ్యం పోయింది, సార్...ఉద్యో గం దొరకలేదు...దయచేసి, మా బతు కులు ఎలాంటివో ఒక్క-క్షణం ఆలో చించండి. నాకు ఆరోగ్యం ముఖ్యం కాదు. ఉద్యోగం ముఖ్యం డాక్టరుగారూ!... మీరు కనికరించాలి!..."గోపాలంకళ్లలో నీరు సుడులు తిరిగింది.

"సార్! ... చిన్నవాళ్ళని మీరు చూడాలి!...మీరు ఆదుకోవాలి సార్. వాళ్ళ ఇంటి కష్టాలు నోటితో చెప్పేవి కావు. స్వయంగా చూడవలసినవి, సార్ .. వాళ్ళకి బతుకు తెరువును చూపించాలి, సార్..." శివరాం చాల నెమ్మదిగా, సాఫీగా మాట్లాడేడు.

డాక్టరు 'రూల్సు మనిషి' కావచ్చును. కానీ, ఆ రూల్సు వెనుక అతనూ అందరి లాంటి మామూలు మనిషే. అతనికీ— కరుణా, జాలీ, ప్రేమా, పేదరికం బాధ్యతా, బరువూ, అన్నీ తెలుసు. లేమిలో మనిషి అనుభవించే కష్టాలు ఎలాంటివో అతను అర్థంచేసుకోగలడు.

అందుకే గోపాలం కళ్ళలో నీటిబిందువులు చూసి, కాదనలేకపోయాడు.

మళ్ళీ మళ్ళీ తన బరువు బాధ్యతల్ని డాక్టరుగారితో చెప్పుకున్నాడు గోపాలం.

డాక్టరుగారు-గోపాలంచేతికి మెడికల్ ఫారమ్స్ యిస్తూ- "నేనొక మెడికల్ ఆఫీసరుగా పనిచేస్తూ, ఈ ఉద్యోగానికి మిమ్మల్ని పంపటానికి విచారిస్తున్నాను...ఈ కాగితాలు డిపార్టుమెంటు ఫోర్మన్‌కి యిచ్చి డ్యూటీలో చేరండి.

"ఆరోగ్యం ముఖ్యం అని మరిచిపోకండి...డబ్బుంటే మీ జబ్బు తగ్గిపోతుంది. ప్రయివేటు డాక్టర్ని కలుసుకొని మంచి మందులు వాడండి. అశ్రద్ధచేస్తే, భవిష్యత్తు ఉండదు." సలహాయిచ్చాడు.

డాక్టరు చాల గంభీరమైన వ్యక్తి. పాతికేళ్లయినా నిండని అతనిలో ఎన్నో అనుభవాలు పండిపోయాయి. అతని ముఖంలో మంచితనం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. దేవుడిలాంటి ఆ మనిషికి గోపాలం రెండుచేతులు పైకెత్తాడు కృతజ్ఞతగా.

"థాంక్యూ ... థాంక్యూ వెరీమచ్ సార్...నాకు పునర్జన్మ నిచ్చారు .. మా జీవితాలకి వెలుగుని ప్రసాదించారు."

"చూడమ్మా, గోపాలం!...డాక్టరుగారు చాల మంచివారు. నీకోసం రిస్క్ తీసుకొని, నిన్ను మెడికల్‌గా రికమెండ్ చేశారు...పెదవి దాటితే పృథివి దాటుతుందంటారు...ఎందుకయినా మంచిదమ్మా, డాక్టరుగారు నీ కిమేలు చేశారని ఎవరితో చెప్పకు... డైరెక్టరుగారికి తెలిస్తే ప్రమాదం." డిస్పెన్సరీ యివతల గోపాలం భుజం మీద చెయ్యివేసి హెచ్చరించాడు, శివరాం.

"సార్... డాక్టరుగారికీ, మీకూ కృతజ్ఞతలు తప్ప మరేమీ యివ్వలేను... సమాధి అయిపోతున్న మా జీవితాలకి మళ్ళీ జీవం పోశారు. జన్మ జన్మలకి మీ మేలు గుర్తుంచుకుంటాను, సార్..." గోపాలం సంతోషానికి హద్దుల్లేకపోయాయి.

*　*　*　*

గోపాలం కొత్తజీవితంలో పదిరోజులు పదిపూటలుగా తిరిగిపోయాయి. ఒడిదుడుకులు లేకుండా జీవితం బాగానే సాగిపోతుందని ఎన్నో ఆలోచనలు చేశాడు. ఏవేవో ఊహించుకొని, అందమైన పేకమేడలు అల్లుకున్నాడు. అల్లుకున్న అందమైన పేకమేడల్ని చూస్తూ, భవిష్యత్తు గురించి ఆలోచనలు చేస్తున్న గోపాలాన్ని మళ్ళీ మెడికల్ టెస్టుకి పిలిచారు.

అతని జీవితంలో ఓ తమాషా జరిగిపోయింది. ఎత్తయిన శిఖరంమీద నిల్చున్న అతను -క్షణంలో కాలుజారి అగాధాల్లోపడిపోయాడు. అతనిఆరోగ్యం ఉద్యోగానికి సరిపడదని, యిచ్చిన ఉద్యోగం లాక్కొని, యింటికి పొమ్మన్నారు.

ఆ సాయంత్రం శివరాం ఇంటికి

వెళ్ళాడు, గోపాలం. జరిగినదంతా చెప్పి, భోరున ఏడ్చాడు. జీవితంలో తిరస్కృతిని తట్టుకోలేకపోయాడు.

శివరాం సానుభూతి చూపించలేదు. గోపాలం మాటలువిని-'అయ్యో పాపం' అనలేదు. మండిపడి, అతనిమీదవిరుచుకు పడ్డాడు.

"చాల్లేమ్మా!...నీ బతుక్కి అర్థం చూపించాలని డాక్టరుగారు ఉపకారం చేశారు. ఆ మాట ఎవరితో అనొద్దని చిలక్కి చెప్పినట్టు చెప్పాను నేను... కానీ, ఏంవయిందీ? ... ఉద్యోగం అయిందని అందరితో గొప్పలుచెప్పావు. చెప్పినందుకు తగిన శాస్తి జరిగింది... నీ ఉద్యోగం పోతేపోయింది, బంగారం లాంటి మా డాక్టరుగారి ఉద్యోగంకూడ పోయింది ... పుణ్యానికిపోతే, పాపం ఎదురవుతుందంటారు...ఇదేకామోసు!"

గోపాలం విస్తుపోయాడు.

"సార్...డాక్టరుగారి ఉద్యోగం పోయిందా?...నన్ను నమ్మండి, సార్... నేనెవరితో చెప్పలేదు." గోపాలం గొంతు పూడుకుపోయింది. నమ్మలేని నిజం ఏదో అతన్ని హేళనచేస్తుంది.

"నిన్ను నమ్మనమ్మా—నమ్మబట్టే, శ్రమ తీసుకొని, డాక్టరుగారితో చెప్పాను. ఆతను నమ్మిన సిద్ధాంతాల్ని నీకోసం పక్కకు నెట్టి - నువ్వు చెప్పిన కథలు విని, ముందు జరగబోయే ప్రమాదాన్ని ఆలోచించకుండా నిన్ను ఆదుకున్నాడు ...ఆదుకున్నందుకు అతనికి అపకారం జరిగిపోయింది. . . నువ్వు చెప్పిన ఆ గొప్పలువిన్న ఎవడో మెయిన్ ఆఫీసులో ఊదుంటాడు. బుద్ధి గడ్డితిని, నీకు హెల్ప్ చేయడమే ఓ పెద్ద తప్పు...వెళ్ళమ్మా వెళ్ళు..." ఇంచు మించుగా శివరాం కసిరాడు.

గోపాలం ఏదో చెప్పబోయాడు.

శివరాం - అతన్ని ఏమీ చెప్పనివ్వ లేదు.

''సార్!...లోకంలో ఉన్న దరిద్రం అంతా నా చుట్టూ తిరుగుతుంది. మీరు చేసిన మేలు—నా దరిద్రాన్ని చూసి బెదిరిపోయింది. ఈ దౌర్భాగ్యుడిమీద జాలిచూపినందుకు డాక్టరుగారి ఉద్యోగం పోయింది ... క్షమించండి, సార్! ... మేము దరిద్రులం. మమ్మల్నెవరూ రక్షించలేరు. మమల్ని మేమే రక్షించుకోవాలి!...సెలవ్." గోపాలం బరువుగా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయాడు.

* * *

ఒక క్షయరోగికి ఉద్యోగం సిఫారసు చేసి, ఫ్యాక్టరీ నిబంధనలు ఉల్లంఘించినందుకు డాక్టరుకు నోటీసు ఇచ్చి, తక్షణం ఉద్యోగంనుండి తొలగించారు పెద్ద ఆఫీసువాళ్లు. వెయిటింగు లిస్టులో ఉన్న డా॥ నీలకంఠాన్ని తీసుకొని డిస్పెన్సరీలో ఖాళీని పూర్తిచేశారు. ఆ ఉద్యోగంకోసం నీలకంఠం ఎన్నాళ్లుగానో కలలు కంటున్నాడు.

"డియర్ శివరాం!...మెనీ మెనీ థాంక్స్. మన ఒప్పందం ప్రకారం ఈ డబ్బు యిస్తున్నాను. తీసుకో ...." పదిహేను వంద నోట్లు డా॥ నీలకంఠం కాంపౌండరు శివరాంకి అందించాడు.

ఇంపోర్టెడ్ విస్కీని సిప్‌చేస్తున్న ఆఫ్టరాల్ వందరూపాయల ఉద్యోగి-శివరాం తన కొత్త బాస్‌చేతిలోని పచ్చ కాగితాలు అందుకున్నాడు.

శివరాం జీవితంలో అది ఖరీదైన రోజు. అతను అన్ని పచ్చకాగితాల్ని కలిపి చూడటం కూడ అదే మొదటిసారి. తృప్తిగా నీలకంఠంవేపు చూశాడు.

డా॥ నీలకంఠం బాటిల్లో ఎర్రటి ద్రవాన్ని మంచుగడ్డల గ్లాసులోకి పోసుకుంటున్నాడు. వెలుగుతున్న సిగరెట్టును పెదవుల మధ్య తమాషాగా ఆడిస్తున్నాడు. అతని ఎర్రటి కళ్ళలో 'తను అనుకున్నది సాధించిన తృప్తి' ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

"బాస్!...ఇది నా జీవితంలో మరపురాని రోజు." శివరాం హృదయాంతరాళ్లో సంతోష తరంగాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి'

"యస్ మై ఫ్రెండ్...ఐ యాం నౌ రియల్లీ సేటిస్ఫైడ్... అనుకున్నది సాధించి, ఫ్యాక్టరీలో ఖరీదైన ఉద్యోగం సంపాయించగలిగాను." డా॥నీలకంఠం గర్వంగా అన్నాడు. గట్టిగా నవ్వేడు.

ఒకరి కొకరు చేతులు కలుపుకొని, గట్టిగా కరచాలనం చేసుకున్నారు.

శివరాం-తన క్రింది ఉద్యోగి అనే భావన డా॥ నీలకంఠం చూపుల్లో లేదు. బాస్‌తో సమానంగా కూర్చున్న భయం శివరాంలో లేదు ఇద్దరూ ఎదురెదురుగా కూర్చుని, సాధించినదాన్ని తలచుకుంటూ తృప్తిగా త్రాగుతున్నారు. పిచ్చిగా నవ్వుకుంటున్నారు

డా॥ నీలకంఠంకి బారులో తిరుగుతున్న మనుషులెవరూ మనుషుల్లా కనిపించటంలేదు. ఆక్వేరియమ్‌లో చేప పిల్లల్లా కనీ కనిపించకుండా కనిపిస్తున్నారు.

నిత్యం నరకాన్ని అనుభవిస్తూ— తనవాళ్ళకోసం, తన ఊపిరిపోయినా ఫరవాలేదని ఉద్యోగంకోసం పిచ్చివాడిలా తిరుగుతున్న అస్థిపంజరంలాంటి గోపాలంగాని; జీవితంలో ఎప్పుడూ అక్రమంగా ప్రవర్తించకపోయినా. ఓ నిర్భాగ్యుని బతుకుకోసం, ఒక్కసారి నమ్మిన సిద్ధాంతాలకి కట్టుబడకుండా అమాయకుడిలా ప్రవర్తించిన రూల్సు మనిషి డాక్టరు గాని - శివరాంకి కనిపించటంలేదు. అతని కళ్ళముందు పచ్చ నోట్లు విలాసంగా తిరుగుతున్నాయి.



(గత సంచిక తరువాయి)

నేను ముందుకు వెళ్లి నగరద్వారం చేరి, భగవంతుణ్ణి స్మరిస్తూ లోపల ప్రవేశించాను. ఒకచోట ఒక మనిషి యూరోపియను దుస్తులు ధరించి కూర్చుని ఉన్నాడు నేను యాత్రికుణ్ణనీ, దేవుణ్ణి స్మరిస్తాననీ తెలియగానే ఆయన నన్ను దగ్గరికి పిలిచాడు. నేను ఆయనను సమీపించి, సలాం చేశాను. ఆయన నాకు ప్రతినమస్కారంచేసి, నాకోసం ఆహారపానీయాలు తెప్పించి, కడుపు నిండా భోజనం చెయ్యమన్నాడు. నేను కొంచెం తిని, మద్యం తాగి, గాఢంగా నిద్రపోయాను.

రాత్రి కాగానే నేను మేలుకుని ముఖమూ, కాళ్ళూ కడుక్కున్నాను. ఆయన నాకు మళ్లీ భోజనంపెట్టి, నా కథ చెప్పమన్నాడు. నేను జరిగిందంతా ఆయనకు చెప్పాను. అంతా విని ఆయన "ఇక్కడికెందుకు వచ్చావు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"మీకేమన్నా పిచ్చా ఏం? అష్ట కష్టాలూ పడి ఇంత కాలానికి మనిషి ముఖం చూశాను. దేవుడు నన్నిక్కడికి చేర్చాడు మీరేమో ఇక్కడి కెందుకు వచ్చానని అడుగుతున్నారు."

"ప్రస్తుతానికి వెళ్లి పడుకో. నీకు చెప్పవలసిందంతా రేపు చెబుతాను,'' అన్నాడాయన.

మర్నాడు ఉదయం ఆయన నాతో, "గదిలో పారా, జల్లెడా, తోలు సంచీ ఉన్నాయి, పట్టుకురా" అన్నాడు.

తిండిపెట్టి ఆయన నాకు ఏం పని అంటగడతాడో ఆ దేవుడికే తెలియాలి, కాని, చేసేదిలేక, నేనా వస్తువులు తెచ్చాను.

అప్పుడాయన నాతో, "నీకు దారిలో తగిలిన నల్లగుట్టవద్దకు వెళ్లి, ఒక గజం లోతు తవ్వి, ఆ మట్టి జల్లించి, జల్లెడలో దిగబడినదంతా తోలుసంచీలో వెయ్యి. ఆ సంచీ నాకు తెచ్చి ఇయ్యి," అన్నాడు.

నేను ఆ పరికరాలు తీసుకుని, ఆయన చెప్పినమేరకు తవ్వి, మట్టిని జల్లెడపట్టి, అందులో దిగబడినవి తోలు సంచీలో వేశాను. జల్లెడలో దిగబడినవి రంగురంగుల రత్నాలు. వాటిని చూసి నా కళ్లు జిగేలుమన్నాయి.

ఇలా తోలుసంచీనిండా రత్నాలు నింపి, తీసుకుపోయి ఆ మనిషికి ఇచ్చాను. అది చూసి ఆయన ''సంచీలో ఏముంటే అదంతా నీదే. దాన్ని తీసుకొని వెళ్లిపో. ఈ నగరంలో ఉండటం నీకు క్షేమంకాదు'' అన్నాడు

"ఈ రాళ్లూ రప్పలూ ఇచ్చి నాకేదో మహోపకారం చేశాననుకుంటున్నారు. ఇవి నా కెందుకు పనికివస్తాయి? ఆకలయితే తినటానికి లేదు. ఇంకా ఇన్ని ఇస్తే మాత్రం నాకేంలాభం?" అన్నాను

ఆయన నవ్వి "నిన్నుచూస్తే జాలి వేస్తున్నది. ఎందుకంటే, నువు కూడా నాలాగే ఉత్తరప్రాంతంవాడివి, అందుకనే నిన్ను ఇక్కడ నిలవవద్దంటున్నాను కాని నిర్ణయం నీదే. నీవు ఇక్కడే ఉండదలిస్తే నాఉంగరం తీసుకో.నువు చౌకుకు వెళ్లావంటే, అక్కడ నీకు తెల్లగడ్డంవాడొకడు కూర్చొని కనిపిస్తాడు అతని ముఖం నా ముఖాన్ని పోలిఉంటుంది. అతను నా పెద్దన్న. నాఉంగరం అతనికి చూపితే అతను నిన్ను చేరదీస్తాడు. అతను ఏంచెయ్యమంటే అది చెయ్యి. లేకపోతే నిష్కారణంగా ప్రాణాలు పోగొట్టుకుంటావు. ఇక్కడే నాఅధికారం నగరంలో నా అధికారం చెల్లదు'' అన్నాడ.

నేను ఆయన ఉంగరం తీసుకొని, ఆయనకు సలాంచేసి, సెలవుపుచ్చుకున్నాను.

నేను నగరం ప్రవేశించి చూస్తే, అది చాలా అందంగా ఉన్నది. దుకాణాలూ. వీధులూ శుభ్రంగా ఉన్నాయి స్త్రీ, పురుషులు సిగ్గులేకుండా బహిరంగంగా తిరుగుతున్నారు అందరూ మంచి దుస్తులు ధరించి క్రయ విక్రయాలు చేస్తున్నారు. నేను నగరం చూసి ఆనందిస్తూ ముందుకు సాగాను

నేను చౌకువద్దకు వెళ్ళేసరికి అక్కడ జనం ఇసకవేస్తే రాలకుండా ఉన్నారు. వారి మధ్యగా పోవటం అసాధ్యమని

వించింది. జనం కదలాడటం చూసి వారి మధ్యగా వెళ్లి, ఎలాగైతేనేం, నాకు కావలసిన మనిషిని చూశాను. ఆయన ఒక కుర్చీమీద కూర్చుని ఉన్నాడు. ఆయనముందు రత్నఖచితమైన దండం ఉన్నది.

నే నాయనను సమీపించి సలాంచేసి, ఉంగరం ఇచ్చాను. ఆయన నాకేసి కోపంగా చూసి, "ఇక్కడికెందుకు వచ్చావు, అపదపాలు కావటానికి? బుద్ధి మాలిన నా తమ్ముడు నిన్ను హెచ్చరించలేదా?" అని అడిగాడు.

"వారు హెచ్చరించారు. నేనే వినిపించుకోలేదు," అన్నాను.

తరువాత నేనాయనకు నా కథ ఆమూలాగ్రం విన్నవించాను. ఆయన లేచి నిలబడి, నన్ను తన ఇంటికేసి తీసుకెళ్ళాడు. ఆయన ఇల్లు రాజభవనంలా ఉన్నది ఆయనకు చాలామంది సేవకులున్నారు.

మేము తన అభ్యంతర మందిరం ప్రవేశించాక, ఆయన సౌమ్యంగా, "నాయనా, ఎంత బుద్ధిమాలినపని చేశావు? నువు నీ సమాధి స్థలానికి నడిచివచ్చావే? అదృష్టహీనుడైన మంద బుద్ధి తప్ప ఈ మాయానగరానికి వస్తాడా," అన్నాడు.

"నన్ను విధి ఎలా ఇక్కడికి తెచ్చిందీ నేను తమకు ముందే మనవి చేశాను. దయచేసి నా కిక్కడి ఆచార వ్యవహారాలేమిటో చెప్పండి. నన్ను మీరూ మీ తమ్ముడుగారు ఇక్కడ ఉండవద్దని ఎందుకంటున్నారో తెలుసుకుంటాను," అన్నాను

ఆయన ఇలా చెప్పాడు :

"ఈ నగరపు రాజూ, ప్రజలూ దేవుడి ఆగ్రహానికి పాత్రులైనవారు. వారి మతాచారాలు విడ్డూరమైనవి. దేవాలయంలో ఒక విగ్రహం ఉన్నది. దాని గర్భంలోనుంచి సైతాను ప్రతి ఒక్కడి మతమూ, శాఖా, పేరూ చెబుతాడు. అందుచేత కొత్తవాడు ఎవడైనా ఇక్కడికి వస్తే, వెంటనే రాజుకు తెలుస్తుంది. వాణ్ణి పట్టుకుపోయి విగ్రహంముందు ప్రాణాధారం పడేస్తారు. వాడు ప్రాణాచారం పడ్డాడా సరేసరి, లేకపోతే వాణ్ణి తీసుకుపోయి నదిలో పారేస్తారు. దేవుడి ప్రభావం ఈ నగరంమీద ఈ విధంగా ఉండటం చేత, పాపం యువకుడివే అని నిన్ను గురించి జాలిపడుతున్నాను. అయితే, నువు కొద్దిరోజులపాటు క్షేమంగా ఉండి ప్రమాదం నుంచి బయటపడటానికొక పథకం ఆలోచించాను. దాన్ని అమలు చేస్తాను."

"ఏమిటా పథకం? నాకూ్కడా చెప్పండి," అన్నాను.

"నేను నీకు వజీరు కుమార్తెతో పెళ్లిచేస్తాను," అన్నాడాయన.

"నేను తన మతం పుచ్చుకుంటే తప్ప వజీరు తన కుమార్తెను నావంటి

అభాగ్యుడికీ, దిక్కు మాలినవాడికీ ఎందుకిచ్చి పెళ్లి చేస్తాడు? నేను నా మతం మార్చుకోబోను," అన్నాను.

"ఇక్కడి ఆచారం ఏమంటే, ఎలాంటి గర్భదరిద్రుడైనా సరే, దేవాలయానికి వెళ్లి, దేవుడి విగ్రహం ముందు సాష్టాంగ పడి, రాజకుమార్తె తనకు కావాలంటే, వాడి కోరిక తీర్చి సంతృప్తిపరచటానికి రాజు తన కుమార్తెను ఇచ్చేస్తాడు నేను రాజుకు అంతరంగికుణ్ణి. ఆయన నన్ను ఆదరిస్తాడు. ఆ కారణంగా, ఇక్కడి ప్రముఖులూ, రాజోద్యోగులూ కూడా నన్ను గౌరవిస్తారు. వాళ్లందరూ వారానికి రెండుసార్లు దేవాలయానికి పోతారు. రేపు అందరూ అక్కడ సమావేశమవుతారు. నిన్ను కూడా నావెంట తీసుకు పోతాను," అని చెప్పి, ఆయన నాకు తినటానికి, తాగటానికీ ఇప్పించి, వెళ్ళి పడుకోమన్నాడు.

మర్నాడు ఉదయం ఆయన నన్ను తనవెంట దేవాలయానికి తీసుకు పోయాడు. మేం అక్కడికి చేరేసరికి జనం పూజావిధులలో నిమగ్నులై అటూ ఇటూ తిరుగుతున్నారు. రాజూ, కులీనులూ అర్చకుల సమీపంలో విగ్రహంముందు నేలపై భక్తిశ్రద్ధలతో కూర్చుని ఉన్నారు. నాలుగు పక్కలా అందమైన బ్రహ్మచార్లూ, కన్యలూ బారులుతీరి నిలబడిఉన్నారు.

ఆ పెద్దమనిషి నాతో, "నేను చెప్పినట్టు చెయ్యి," అన్నాడు.

"మీరేంచెప్పినా చేస్తాను," అన్నాను.

"ముందు రాజుగారి కాళ్లూ, చేతులూ కళ్లకు అద్దుకుని వజీరుగారి చెంగు పట్టుకో."

అలాగే చేశాను.

"ఇత నెవరు? ఇతనికి ఏంకావాలి?" అని రాజు అడిగాడు.

నన్ను తెచ్చిన పెద్దమనిషి రాజుతో "ఈ కుర్రవాడు నా బంధువు. తమ పాదాలు స్పృశించటానికి చాలా దూరం నుంచి వచ్చాడు. మహాదేవుడూ, తమరు అనుమతి ఇస్తే, ఇతను మంత్రిగారి కుటుంబంలో ఒకడై, వారి సేవకులలో చేరే మహాభాగ్యంకోసం ఎదురుచూస్తున్నాడు," అన్నాడు.

"అతను మన మతాచారాలు అవలంబించేటట్టుంటే అతని కోరిక తీరుతుంది," అన్నాడు రాజు

వెంటనే గోపురంమీద మంగళ వాద్యాలు మోగాయి. నాకు ఖరీదైన బట్టు పెట్టారు. నా మెడకు నల్లని పలుపు చుట్టి, విగ్రహం ముందుకు లాక్కుపోయి, దానిముందు సాష్టాంగంపడేసి, లేవదీశారు.

అప్పుడు విగ్రహంలోనుంచి, "యువకుడా, నువు నా భక్తులలో చేరి మంచిపని చేశావు. నీకు ఇక నా దయా

దాక్షిణ్యాలఉంటాయి'' అన్న మాటలు వినిపించాయి.

ఈ మాటలు వినిపించగానే అందరూ ప్రాణాచారాలుపడి, పొర్లిగింతలుపెట్టుతూ దేవుణ్ణి స్తోత్రంచేశారు.

సాయంకాలం కాగానే రాజూ, ఆయన అనుచరులూ వజీరుగారింటికి వెళ్ళి, తమ ఆచారాలప్రకారం వజీరు కుమార్తెకూ, నాకూ వివాహం జరిపించి, ఆమెను నాకు అప్పగించారు. వాళ్లు నాకు గొప్పగా కట్నం ఇచ్చి వజీరు కుమార్తెను నాకు మహాదేవుడి ఆజ్ఞానుసారం ఇచ్చామని చెప్పారు. మా కిద్దరికీ ఒక ఇల్లు ఏర్పాటుచేశారు నేను ఆమె అందం చూసి దేవతాస్త్రీ అనుకున్నాను. ఆమె ముఖమూ, అవయవాలూ తీర్చిదిద్దినట్టున్నాయి. నేను నిర్మొగమాటంగా ఆమెతో సుఖించి, ఆనందించాను.

మర్నాడు ఉదయం నేను స్నానం చేసి రాజును చూడబోయాను. ఆయన నాకు పెళ్ళిబట్టలు పెట్టాడు. నిత్యమూ తన దర్శనానికి రమ్మని ఆజ్ఞాపించాడు. కొన్నిరోజులు గడిచాక నేను ఆయనాంతరంగికసలహాదార్లలో ఒకడినయాను. నా సాంగత్యం ఆయనకు తృప్తికరంగా ఉండేది. నాకు తరచుగా బహుమానాలిచ్చి, బట్టలు పెట్టేవాడు-నాకు భాగ్యం లోటు లేదప్పటికే ఏమంటే నా భార్యవద్ద విలువకట్టటం సాధ్యంకానంత బంగారమూ, రత్నాలూ, సంపదా ఉండేవి.

రెండేళ్ళు నాకు పరమానందంగా గడిచాయి. నాభార్య గర్భవతి అయింది. ఏడోనెలా, ఎనిమిదోనెలా దాటి ఆమెకు నొప్పులు ఆరంభమయాయి. మంత్రసానివచ్చి చచ్చిన బిడ్డను బయటికి లాగింది. ఆ విషంసోకి తల్లికూడా మరణించింది.

నాకు దుఃఖంతో మతిపోయి, "ఎలాటి విపత్తు దాపురించింది!" అని ఏడుస్తూ మంచం తలవైపు కూర్చున్నాను. నా రోదన విని, ఆడవాళ్లు వచ్చి మూగారు. అందరూ నాతలమీద కొట్టి, ఏడవ నారంభించారు. అంతమంది ఆడవాళ్లు చుట్టూ మూగేసరికి నాకు ఊపిరాడక, ప్రాణం కడబట్టినట్టయింది

ఈ స్థితిలో ఎవరో వెనకనుంచి నా మెడపట్టి పట్టుకుని ఈడ్చుకుపోయారు. నేను తలఎత్తి చూస్తే, నన్ను వజీరు కుమార్తెకు పెళ్ళిచేసినవాడే.

"మూఢుడా! ఏడుస్తా వెందుకు?" అన్నాడాయన.

"ఎంత క్రూరం. నా సామ్రాజ్యమే పోయింది. నా కొంప కూలిపోయింది. ఎందుకేడుస్తున్నానని అడుగుతున్నారా" అన్నాను.

"ఇప్పుడు నువ్వు ఏడవవలసింది నీ చావుగురించి! నీ కిక్కడ చావు రాసిపెట్టి ఉండి ఇక్కడికివచ్చావని నీకు మొదటనే చెప్పాను. అలాగే జరిగింది. నీ కిప్పుడు

చావు తప్ప మరో విముక్తిమార్గం లేదు" అన్నాడాయన వెటకారంగా.

చిట్టచివరకు జనం నన్ను పట్టుకొని దేవాలయానికి తీసుకుపోయారు. అక్కడ రాజూ, ఆయన ఉద్యోగులూ, పౌరులూ సమావేశమై ఉండటం నాకుకనిపించింది. నా భార్య చరాస్తి అంతా అక్కడ పోగు పెట్టి ఉన్నది. అందులో ఒక్కొక్క వస్తువునూ ఒక్కొక్కడు ధర చెల్లించి కొనుక్కొన్నారు. అన్ని వస్తువులూ నగదుగా మారాయి. ఈ నగదుతో రత్నాలు కొని, వాటిని ఒక పెట్టెలో పెట్టారు. తరవాత ఆ పెట్టెనిండా మాంసమూ, పళ్లూ, పళ్ళరసలూ, ఇతర ఆహారపదార్థాలూ ఉంచారు. నా భార్య శవాన్ని మరొక పెట్టెలో ఉంచారు. రెండు పెట్టెలనూ ఒక ఒంటెమీద పెట్టారు. నన్ను ఆ ఒంటెమీదికి ఎక్కించి, రత్నాలపెట్టె నా ఒడిలో ఉంచారు.

ఒంటెముందు బ్రాహ్మణులు మంత్రాలు చదువుతూ, శంఖాలూదుతూ నడిచారు. వెనకగా జనం వస్తూ నాకు సుఖప్రాప్తి కలగాలని ఆశీర్వాదాలు పలికారు. ఈ విధంగా నన్ను, ఏ ద్వారంగుండా నేను నగరం ప్రవేశించానో అదే ద్వారంగుండా నగరం వెలపలకు తీసుకుపోయారు.

అప్పటి ద్వారరక్షకుడే నన్నుచూసి ఏడుస్తూ "అయ్యోదౌర్భాగ్యుడా, ఆయువు తీరినవాడా! నా మాటవినక నగరం ప్రవేశించి, నిష్కారణంగా చావు తెచ్చుకున్నావుగదా! నా తప్పేమీలేదు. నేను ముందే చెప్పాను" అన్నాడు.

వాడు ఈ మాటలునాతోనే అన్నాడు కాని నాకు మతిసరిగాలేక వాడికి జవాబు చెప్పలేకపోయాను. అసలు నాకు ఏమి జరగబోతున్నదీ గ్రహించే మనస్థితి కూడా లేకపోయింది.

నన్ను ముందుచూసిన కోటకే తీసుకుపోయారు. నేను ఆ దేశంలోకి ప్రవేశించినప్పుడది మూసిఉన్నది. ఇప్పుడు దాని తాళం తెరిచి, శవాన్నీ, ఆహారం ఉన్న పెట్టెనూ లోపలికి చేర్చారు. ఒక బ్రాహ్మణుడు నావద్దకువచ్చి, "జీవి ఒక నాడు పుట్టుతాడు. ఒకనాడు గిట్టుతాడు. అది ప్రపంచం పోకడ. ఈ నీభార్యనూ, కొడుకునూ, నలభై రోజులకు సరిపోయే ఆహారాన్ని ఇక్కడ ఉంచుతున్నాం. మహాదేవుడికి అనుగ్రహం కలిగేదాకా ఇక్కడ ఉండు," అన్నాడు.

నాకు చెడ్డ కోపంవచ్చి, వాళ్ళ మహాదేవుణ్ణీ, దిక్కుమాలిన ఆచారాలనూ తిట్టి, ఆ బ్రాహ్మణ్ణి కొడదామనుకున్నాను; కాని ఆ ఉత్తరాది పెద్దమనిషి తన భాషలో, "జాగ్రత్త, నోరుమెదపకు. ఒక్కమాట ఉచ్చరించావో, నిన్ను ప్రాణాలతో దహనం చేస్తారు. ఓర్పు వహించు. నీకు రాసి పెట్టి ఉన్నట్టే జరిగింది. దేవుడి కరుణనే నమ్ముకో. ఆయన నిన్ను ఇక్కడినుంచి ప్రాణాలతో బయటపడెయ్యవచ్చు" అన్నాడు.



చివరకు అందరూ నన్ను ఆ కోటలో ఒంటరిగా వదిలేసి, తలుపుకు తాళంపెట్టి వెళ్ళిపోయారు

నా ఒంటరితనానికీ, అసహాయస్థితికీ ఘోరంగా ఏడ్చాను. శవాన్ని ఒక తన్ను తన్ని, "పాపిష్టి శవమా, పురిటిచావు వచ్చేదానివి ఎందుకు పెళ్ళాడి కడుపు తెచ్చుకున్నావు?" అన్నాను. ఆమెను తిట్టి, తన్ని, మౌనంగా కూర్చున్నాను.

క్రమంగా పొద్దెక్కి, ఎండ తీవ్ర మయింది. నాతల అంతాఉడికిపోతున్నది. దుర్గంధం దుర్భరంగా ఉండి, ప్రాణం పోతున్నది. ఎటుచూసినా నాకు ఎముకలూ, రత్నాల పెట్టెలూ కనిపించాయి. కొన్ని పెట్టెలు పేర్చి నాకు పగలు ఎండా, రాత్రి మంచూ తగలకుండా గూడు తయారు చేసుకున్నాను. నీటికోసం వెతికితే, గోడలో ఒకపక్క జలయంత్రం లాంటిది కనిపించింది. నాకు లభ్యమైన ఆహారం తింటూ, నీరు తాగుతూ చాలా రోజులు గడిపాను

చివరకు ఆహారం అయిపోయింది. నేను దేవుడితో మొరపెట్టుకున్నాను. దేవుడి అనుగ్రహంవల్ల తలుపు మళ్ళీ తెరుచుకున్నది. మరొక శవం లోపలికి వచ్చింది. ఈసారి శవంవెంట ఒక వృద్ధుడున్నాడు. అతన్ని వదిలిపెట్టి వాళ్ళు వెళ్ళిపోయాక, ఆ మనిషిని చూసి, అతని ఆహారం తీసుకోవాలన్న ఆలోచన నాకు కలిగింది. ఒక పాతపెట్టె కాలు పట్టుకొని, అతన్ని సమీపించాను పాపం ఆ అభాగ్యుడు మోకాళ్ళకు అడ్డంగా చేతులు పెట్టుకుని, వాటిమీద తలవాల్చి, నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు. నేను అతని వెనకగా వెళ్ళి ఒక్కదెబ్బతో తల పగలగొట్టేశాను. అతను వెంటనే చచ్చాడు. నేను అతని ఆహారం సంగ్రహించి, దానితో ఆకలి తీర్చుకోసాగాను.

ఇదేవిధంగా చాలాకాలంపాటు శవాల వెంట వచ్చినవాళ్ళను చంపి, వారి ఆహారంతో ఘనంగా బతికాను.

కొంతకాలం గడిచాక శవంవెంట ఒక యువతి అక్కడికి వచ్చింది. ఆమె చాలా చక్కనిది. ఆమెను చంపటానికి మనస్కరించలేదు ఆమెనన్ను చూస్తూనేభయంతో మూర్ఛపోయింది. నేను ఆమె ఆహారాన్ని నేనుండే గూటికిచేర్చాను. అయితే అదంతా నేను ఒక్కణ్ణే తినలేదు - ఇద్దరమూ తిన్నాం. నేను తనజోలికి రానని గ్రహించి ఆమె క్రమంగా నన్ను చూసి భయపడటం మానుకున్నది. ఆమె తరచుగా నా గూటికి రాసాగింది.

ఒకనాడు ఆమెను ఆమె కథ అడిగాను. ఆమె ఇలా చెప్పింది :

"నేను రాజుగారి వకీల్ ముశ్లఖ్ కూతుర్ని మేనరికంపెళ్ళి చేసుకున్నాను. పెళ్ళినాటిరాత్రే నా భర్తకు కడుపులో శూలవచ్చి, యమబాధపడి కొద్దిసేపట్లో చనిపోయాడు. అతని శవంతోబాటు నన్ను తెచ్చి ఇక్కడ వదిలేశారు.

ఆమె కోరిన మీదట నేనామెకు నా కథ కూడా చెప్పాను. "దేవుడు నిన్ను నాకోసమే పంపాడు," అంటే ఆమె ఏమీ అనలేదు.

త్వరలోనే మాఇద్దరిమధ్యాఅనురాగం ఏర్పడింది. నేను ఆమెకు ఇస్లాం తంతు నేర్పాను. నా వెంట ప్రార్థనలు అనిపించాను. ఆమెకూడా గర్భంధరించి, ఒక మగబిడ్డను కన్నది.

ఈ విధంగా దాదాపు మూడేళ్ళు గడిచాయి. ఆమె పిల్లవాడికి పాలివ్వటం మానినాక, "ఇక్కడ ఎంతకాలం ఉంటాం? ఇక్కడినుంచి ఎలా తప్పించుకొంటాం?" అన్నాను

"దేవుడు మనను బయటికి తీసుకుపోతే పోతాం. లేకపోతే ఏదో ఒకనాడు ఇక్కడే చస్తాం!" అన్నదామె

ఈ మాటకూ, మా దుస్థితికి నేను అమితంగా శోకిస్తూ నిద్రకుపడ్డాను. నాకు కలలో ఒక వ్యక్తి కనబడి, "బయటపడాలని కోరిక ఉంటే మురుగు కాలవకుండా బయటపడు!" అనిచెప్పాడు.

నేను పరమానందంతో మేలుకుని, నాభార్యతో-"పాతపెట్టెలకున్న మేకులూ శీలలూ అన్నీపట్టుకురా. వాటితో మురుగు కాలవను పెద్దది చేద్దాం." అన్నాను

మురుగుకాలవ ద్వారం పెద్దది చెయ్యటానికి ప్రయత్నించి అలసిపోయాను. దాన్నిమనిషిదూరే ప్రమాణానికి తీసుకురావటానికి నాకు ఏడాదిపట్టింది! తరవాత నేను అక్కడఉన్న మేలిమణులన్నీ ఏరి చచ్చిపోయినవాళ్ళ చొక్కాల చేతులలో వేసి, వెంటబెట్టుకున్నాను. మేం ముగ్గురమూ దైవానుగ్రహంవల్ల నేను చేసిన కంతకుండా బయటపడ్డాం. నేను కుర్రవాణ్ణి నా భుజంమీద ఎత్తుకున్నాను. మేం బయలుదేరాం. భయంకొద్దీ నెల రోజుల క్రితంనుంచీ మేం రహదార్లు విసర్జించి, అడవులకుండానూ కొండల మీదానూ ప్రయాణించాం ఆకలివేస్తే దుంపలూ, కాయలూ తిన్నాం. ఇంక నాకు చెప్పే ఓపికలేదు. ఇవే నా అనుభవాలు.



(ఖాజా ఇలా చెప్పాడు)

"మహారాజా, నాకు ఆ మనిషిని చూస్తే జాలివేసింది. అతన్ని స్నానశాలకు పంపి, మంచి బట్టలిచ్చి, నాకు సహాయకుడుగా నియమించుకున్నాను.

"నాకు రాజకుమార్తె వల్ల చాలామంది పిల్లలు కలిగారు. కాని వారంతా పసితనంలోనే పోయారు. ఒకడు అయిదేళ్లు బతికిపోయాడు. నా భార్య వాడి చావుతో దిగులుపడి, తాను కూడా మరణించింది. నాకు విరక్తి కలిగి, పర్షియాకు తిరిగి పోవాలనిపించింది. నేను వెళ్ళిపోవటానికి రాజుగారి అనుమతిపొంది, రేవుపాలన నా సహాయకుడైన యువకుడికి అప్పగించాను.

"ఇంతలో రాజుగారు కూడా పోయాడు. నేను నా కుక్కనూ, రత్నాలన్నూ, ధనాన్నీ, వెంటబెట్టుకొని నిషాపూర్ వచ్చాను. నా అన్నల కథ ఎవరికీ తెలియకుండాఉండగలందులకు కుక్కను పూజించేవాడుగా చలామణీ అయాను. ఈ అపనింద కారణంగా నేను ఈనాటికీ పర్షియా రాజుకు రెట్టింపు పన్నులు చెల్లిస్తున్నాను. ఈ యువక వర్తకుడు నిషాపూర్ రావటం జరిగింది. అతని మూలంగా నేను ఏలినవారి పాదదర్శనం చేసుకోగలిగాను."

"ఈ యువకుడు నీ కుమారుడు కాడా?" అని ఖాజాను అడిగాను.

"మహాప్రభూ! ఇతను నా కొడుకు కాడు, మీ పౌరుడు. అయితే ఇప్పుడు నాకు కొడుకనుకున్నా, వారసుడనుకున్నా, మరేది అనుకున్నా ఇతనే," అన్నాడు ఖాజా.

నేను యువక వర్తకుణ్ణి "నువు ఏ వర్తకుడి కొడుకువు? నీ తల్లి దండ్రులు ఎక్కడ ఉంటారు?" అని అడిగాను.

ఆ యువకుడు నా పాదాలకు ప్రణమిల్లి, అభయంవేడి, "ఈ బానిస తమ వజీరుగారి కుమార్తె. ఈ ఖాజావద్ద ఉన్న రత్నాలమూలాన నాతండ్రి ఏలినవారి ఆగ్రహానికి గురిఅయాడు. ఒక సంవత్సరం లోపుగా నా తండ్రి అన్న మాట నిరూపణ కాకపోతే ఆయనను

ఆ స్నేహితురాలు తనదగ్గరకు రాలేదని అనటంతో, కాలేజి ప్రిన్సిపాల్‌కి ఫోన్ చేసాడు.

ప్రీతి చనువుగా వుంటుందని తెలిసిన స్నేహితు లందరిదగ్గరా వెతికారు. ఎక్కడా లేదు! ఎవరిని అడిగినా మాకు తెలియదు అన్నారు. మొదటిరోజు భవానీప్రసాద్‌కి అంతగా భయం కలగ లేదు. కానీ రెండోరోజు కూడా ప్రీతి కన్పించకపోవటంతో అతని గుండెల్లో అవ్యక్తమైన భయం మొదలుఅయింది. మూడోరోజు, నాలుగోరోజు కూడా గడిచిపోయినాయి. ప్రీతి జాడ తెలియనే లేదు. అతను ఆ మధ్యాహ్నం మెద్రాస్ భార్యకి ట్రంక్‌కాల్ చేసాడు.

భవానీప్రసాద్ భయాన్నీ, ఆందోళననీ సుజీ నిర్లక్ష్యంగా తీసిపారేసింది.

"నీకు ప్రతిదానికీ ఖంగారే! ఎవరైనా ఫ్రెండ్స్ యింట్లో వుందేమో! సరిగ్గా కనుక్కో. అదేం చిన్నపిల్లకాదు తప్పిపోటానికి."

"సుజీ! డోంటాక్ నాన్సెన్స్! ఫ్రెండ్స్ దగ్గరికి వెళితేమాత్రం మూడు రోజులు హాస్టల్‌కిగాని, కాలేజికిగాని తిరిగి రాకుండా వుంటుందా?" అసహనంతో ప్రజ్వరిల్లుతూ అన్నాడు.

"గిరిజ యింట్లో కనుక్కున్నావా? వాళ్లతో కలిసి నాగార్జునసాగర్ వెళ్లాలని అనుకుంటున్నానని వ్రాసింది"

"అడిగాను. గిరిజ తనదగ్గరకి రాలేదని అంటోంది. సుజీ! నాకు చాలా భయంగా వుంది! నువ్వు రేపు ఉదయం ఫ్లైట్‌కి బయలుదేరిరా!"

"ఓ మైగాడ్! రేపా! రేపెలా కుదురుతుంది? రేపు చావటానికికూడా నాకు తీరుబడిలేదే! ఆలిండియా ఉమన్స్ వెల్‌ఫేర్ కమిటీ మెంబ్సతో కాన్ఫరెన్స్ వుంది."

"షటప్! డూ వాటయిసే! రేపు బయలుదేరిరా! నేను ఎయిర్‌పోర్ట్‌లో మీటవుతాను. డోంటాక్ అనదర్ వర్డ్!" కొట్టినట్టుగా అన్న అతను, అధికారంగా ఆజ్ఞాపించి, ఫోన్ పెట్టేసాడు.

అవతల లైన్‌దగ్గర సుజీ నిటారుగా అయింది! ఆవిడ ముఖం జేవురించింది. కళ్లు ఎర్రబడినాయి. వెంటనే వంట మనిషిని పిలిచి రేపు ఉదయం నేను హైదరాబాద్ వెళుతున్నానని చెప్పింది.

ముందు కూతురిమాట ఎలావున్నా అతనిచేత, వెంటనే, ఆ వాగుడికి క్షమాపణ చెప్పించాలని బయలు దేరిందావిడ.

సుజీ హైదరాబాద్ చేరుకున్న గంటన్నరకి, భార్యా భర్తలిద్దరూ హోటల్ రూమ్‌లో, నిన్న మధ్యాహ్నం ఫోన్ కాల్ గురించి పోట్లాడుకుంటుండగా, భవానీప్రసాద్‌కి బాగా తెలిసిన ఒక పోలీసు అధికారినుంచి, "నిన్న సాయంత్రం చార్‌మినార్ మీదనుంచి దూకి చనిపోయిన అమ్మాయి శవం

చంపెయ్యాలని తమరు ఆజ్ఞాపించారు. తమ ఆజ్ఞవింటూనే, నేను ఈ వేషంధరించి నిషాపూర్ వెళ్ళాను. దేవుడే ఈ ఖాజానూ, రత్నాలతోసహా కుక్కనూ తమవద్దకు తెచ్చాడు. సంగతిఅంతా తమరువిన్నారు. ఇక మా తండ్రిని విడుదలచెయ్యవల సిందిగా ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

ఈ సంగతి వజీరుజాదీ నోట వింటూనే ఖాజా మూలిగి, మూర్ఛ పోయాడు. పన్నీరు ముఖాన చల్లినమీదట అతను తెలివివచ్చి, "ఏం గ్రహచారం! ఈ యువకుణ్ణి నా కొడుకును చేసుకుని, నాకున్న సర్వస్వమూ అతనికి రాసి ఇచ్చి, నాదంతా నాతో అంతరించి పోకుండా, ఇతన్ని అందరూ ఖాజాజాదా అని పిలుస్తారన్న గంపెడుఆశతో ఎన్ని ప్రయాసలుపడి ఇంత దూరం వచ్చాను. నా ఆశలన్నీ అడియాస లయాయి. ఈ యువకుడు కాస్తా యువతి అయి కూర్చు న్నది. యువతి మాయలలోపడి ఈ ముసలాడు మోసపోయాడు. యాత్ర చెయ్యకుండానే గుండుకొట్టించుకొని నలు గురిలో నగుబాటయిన సామెతగా ఉన్నది నా పరిస్థితి" అంటూ వాపోయాడు.

ఖాజా దుఃఖం చూస్తే నాకు జాలి వేసింది. నేను అతన్ని దగ్గరికి పిలిచి, "విచారించకు. నేను ఆమెను నీకిచ్చి పెళ్ళిచేస్తాను. అనుగ్రహంవల్ల ఆమెనుంచి నీకు సంతానంకలిగితే వాళ్లు నీకు వారసు లవుతారు" అన్నాను.

ఈమాటలువిని అతను కొంత ఊరట చెందాడు.

వజీర్ జాదీని అంతఃపురం చేర్చమనీ, వజీర్‌ను విడుదలచేసి, స్నానంచేయించి, బట్టలు కట్టబెట్టి, నావద్దకు తీసుకురమ్మనీ ఉత్తరువిచ్చాను

వజీర్ రాగానే నేను అతనికి ఎదురు వెళ్ళి నాకన్న ఉన్నతుడుగా పరిగణిస్తూ కౌగలించుకొని, మళ్ళీ అతనిని వజీర్‌గా నియమిస్తూ వజీర్ లాంఛన ఇచ్చాను. ఖాజాకు కూడా బిరుదులూ, జాగీర్లూ ఇచ్చి, మంచి ముహూర్తంచూసి అతనికీ వజీర్ జాదాకూ వివాహం జరిపించాను.

కొద్ది సంవత్సరాలలో ఆమె ఇద్దరు కుమారులనూ, ఒక కుమార్తెనూ కన్నది. ఇవాళ కొడుకులిద్దరూ నా కొలువులో ఉన్నారు.

ఓ ఫకీర్లారా! నేను నా అనుభవాలు ఇలా ఎందుకు చెప్పానంటే, గతరాత్రి మీలో ఇద్దరు తమ అనుభవాలు చెప్పగా నేను విన్నాను. నేను నిన్నరాత్రి ఉండిన చోటనే ఉన్నాననుకుని, మిగిలిన ఇద్దరూ తమ అనుభవాలు చెబుతారుగాక. నన్ను మీ నౌకరుగానూ, నా ఇంటిని ఫకీర్ల మఠంగానూ ఎంచండి. స్వేచ్ఛగా మీ అనుభవాలు చెప్పి, కొన్నిరోజులు నాతో ఉండండి.

రాజుకు తమపట్ల ఆదరం ఉన్నట్టు గ్రహించి ఫకీర్లు "సరే! ప్రభువుగారికి ఫకీర్ల స్నేహంమీద అభిలాష ఉండే పక్షంలో, మేమిద్దరమూ కూడా మా అనుభవాలు చెబుతాం ఆలకించండి" అన్నారు.

(సశేషం)

ప్రీతిగా గుర్తించబడిందనే" వార్త తెలిసింది.

"మైగాడ్!" భవానీప్రసాద్‌కి ఆ క్షణంలో పిచ్చెక్కినంత పనైంది.

"నో! నో!" సుజీ అరిచింది.

భవానీప్రసాద్ - సుజీ యిద్దరూ హాస్పిటల్‌కి వచ్చారు.

'నాకు బ్రతుకుమీద విరక్తి పుట్టింది. ఆత్మహత్య చేసుకుంటున్నాను. ఇందులో ఎవరికీ ఎలాటి సంబంధంలేదు,' అని వ్రాసిన చీటీ చీరెకి పిన్‌చేసి వుందని పోలీసు అధికారులు చెప్పారు.

"ఎందుకే? ఎందుకిలా చేసావు? నీ కంత ఖర్మ ఏంవచ్చిందే!" సుజీ బావురుమంది.

పోస్టుమార్టమ్‌లో, సుజీ గర్భవతి అని తెలియచేయగానే, భార్యా భర్త లిద్దరూ దిమ్మెరపోయారు!

రెండురోజులు గడిచినాయి!

భవానీప్రసాద్ బాగా సుస్తీపడటంతో, తప్పనిసరిగా. యింకోవారం ఆగాల్సి వచ్చింది.

అతన్ని చూడటానికి స్నేహితులు, తెలిసినవాళ్లు, ఎంతోమంది వచ్చి వెళుతున్నారు. వచ్చినవాళ్లదగ్గర సుజీ చెప్పుకుని ఏడుస్తోంది. "దానికి నేనేం తక్కువచేసాను? అపురూపంగా పెంచాను. కోరినదల్లా యిచ్చాను! ఒక్కగా నొక్క పిల్ల దగ్గరలేకుండా ఎలా అనే మమకారం కూడా వుంచుకోకుండా, 'అమ్మా, గిరిజ హైదరాబాద్‌లో వుంది. నేను కూడా అక్కడే చదువుకుంటాను' అంటే పంపించాను. అందరి తల్లుల్లా మూర్ఖంగా కట్టడిచేయకుండా, కోరిన స్వేచ్ఛ యిచ్చాను."

భవానీప్రసాద్ మచంమీద పడుకున్నవాడల్లా లేవబోయాడు. "యూ! డెవిల్! నువ్వసలు మనిషివేనా? మరవి. ఒట్టి యంత్రానివి. కన్నబిడ్డకి వచ్చిన కష్టం ఏమిటో కనుక్కోలేకపోయావు. మళ్లీ వూరివాళ్లని ఉద్ధరించే పె...ద్ద సోషల్ వర్కర్‌వి!"

ఈ ఎత్తిపొడుపు వినగానే, సుజీ ఏడుపు మాట మరిచిపోయి గయ్యిన లేచింది.

"మాటలు తిన్నగా రానీ! నేను యంత్రాన్నా! ఒంటిమీద తెలివి వుండే మాట్లాడుతున్నావా! సరే! నేను యంత్రాన్నే! కానీ నువ్వు చేసిన నిర్వాకం ఏమిటి? నువ్వెందుకు కనుక్కోలేదు దానికి వచ్చిన కష్టం ఏమిటో? నువ్వు పడే పాటేమిటి? ఏం? పిల్లలంటే ఒక్క తల్లికేనా బాధ్యత? తండ్రికి లేదా?"

ఇద్దరి మధ్యా మాటలు ముదరబోతుంటే అక్కడున్నవాళ్లు ఎలాగో ఆపి సర్దివేసారు.

"షి యీజ్ నాట్ వుమన్! షియీజ్ ఎ డెవిల్!" ఆయాసపడుతూ అన్నాడతను.

"ఈయన యిట్లా నోరు పారేసు కోవడం నేనెన్నడూ ఎరగను. మతి చలించలేదుకదా !" సుజీ పక్కనున్న స్నేహితురాలితో రహస్యంగా, భయంగా అంది.

"మీరు విశ్రాంతి తీసుకోండి." భార్యాభర్తలిద్దరికి చెప్పి వచ్చినవాళ్ల వెళ్లిపోయారు.

కమల భర్తతో వచ్చింది. భవానీ ప్రసాద్ సుస్తీ తగ్గేవరకూ తమ యింట్లో వుండమని బలవంతం చేసింది. కానీ సుజీ ఒప్పుకోలేదు.

"తగ్గటానికి ఎన్ని రోజులు పడుతుందో ఏమిటో ! మాకోసం అనేక మంది వస్తూ పోతూవుంటారు. భోజనం, స్నానం విషయంలో మాకు కొన్ని నియమాలున్నాయి," అంటూ మర్యాద గానే తిరస్కరించింది.

భార్య నిశ్చయాన్ని కాదని ప్రవర్తించడం అతనికి ఎప్పుడూ అలవాటు లేదు.

సాయంత్రం కాబోతోంది !

భవానీప్రసాద్ నవనాడులూ క్రుంగి పోయినట్టుగా, మంచంమీద పడుకుని వున్నాడు. సుజీ స్నానంచేస్తోంది.

ఇంతలో ఫోన్ మోగింది.

అతనే ఓపికచేసుకుని లేచి తీసాడు.

"హలో !"

"హలో. భవానీ ప్రసాద్‌గారు కావాలండీ."

"నేనే- మీరెవరు ?"

"నేను- నేను కుసుమని."

అతనికి వెంటనే ఆ వ్యక్తి ఎవరో గుర్తుకురాలేదు.

"నేను అంకుల్. ప్రీతి స్నేహితు రాలిని. మెడ్రాస్‌లో నేను, ప్రీతి 8 వ తరగతివరకూ చదివాం. నన్ను పిలక జెడపిల్లా అనేవారు మీరు."

"ఆ ! ఆ ! గుర్తుకు వచ్చింది. ఏమిటమ్మా." అతనిలోకి ప్రాణంలాటిది వచ్చింది.

"అంకుల్, ప్రీతి చనిపోయేముందు నాకు ఉత్తరం వ్రాసింది. అది అందే సరికి నేను వూళ్లో లేను. ఈ రోజే వచ్చాను. ఈ పూటే అది చూసాను. మీరు యింకా వూళ్లోనే వున్నారని నాన్న గారు చెప్పారు. ప్రీతి యింత ఘోరం తలపెడుతుందని అనుకోలేదు. నేను వూళ్లో లేను. ఉంటే ఎప్పటికీ యిలా జరిగేదికాదు."

కుసుమ మాటల్ని దుఃఖం మింగేసింది.

అతను మౌనంగా వింటున్నాడు ! ప్రీతి చనిపోయేముందు ఉత్తరం వ్రాసిందా ! అతని నుదుటిమీద చిరు చెమటలు అలుముకున్నాయి. ఏముంది అందులో ? అడగటానికి అతనికి ధైర్యం చాలటంలేదు.

"అంకుల్ !" కుసుమ ఏడుపు నిగ్రహించుకుంటూ అంది.



''చెప్పమ్మా !"

"ప్రీతి చనిపోటానికి రెండురోజులు ముందు, అర్థరాత్రివేళ వంటరిగా, హఠాత్తుగా, టాక్సీలో మా యింటికి వచ్చింది. నేను ఎంత అడిగినా కారణం చెప్పలేదు. మనిషి చాలా బెదిరిపోయి నట్టుగా వుంది."

"కారణం ఏమిటో చెప్పిందా ?"

"అప్పుడెంత అడిగినా చెప్పలేదు."

"ఉత్తరంలో వ్రాసిందా ?"

''వ్రాసింది !"

అతను అఘాతంలోకి కృంగిపోతున్న ట్టుగా నిలబడ్డాడు.

"అంకుల్ ! మీరు యిక్కడికి వస్తారా ఆ ఉత్తరం చూపిస్తాను. లేకపోతే నేనే అక్కడికి రానా ?"

"వద్దు. వద్దు. నేనే వస్తాను. అడ్రస్ చెప్పు." గబగబా అన్నాడతను. ఆ అమ్మాయి రామచంద్రాపురంలో ఒక క్వార్టర్ నంబరు చెప్పింది. ఎట్లా రావాలో వివరాలుకూడా చెప్పింది.

"యిప్పుడే-కారు ఎంత త్వరగా తీసుకరాగలిగితే అంత త్వరగా వస్తాను. చూడు. ఒకవేళ ఏ కారణంచేతయినా నేను రావటం ఆలస్యం అయితే నువ్వు మళ్ళీ యిక్కడికి ఫోన్ చేయవద్దు. నేను చూసేవరకూ ఆ ఉత్తరం ఎవరికీ చూపించవద్దు "

"అలాగే "

అతను పళ్లబిగువున లేచి, బట్టలు మార్చుకున్నాడు. సుజీ, ఒక స్నేహితుడు ఫోన్‌చేస్తే వెళుతున్నాను.

యిప్పుడే వస్తాను. ఖంగారుపడకు,'' అని గబగబా గీసిన చీటీ డ్రెస్సింగ్ టేబిల్ మీద పెట్టి తలుపు తెరుచుకుని యివతలకి వచ్చాడు.

దాదాపు గంటతర్వాత. భవానీ ప్రసాద్ కూర్చున్న టాక్సీ కుసుమ చెప్పిన దారి వెంబడి, ఆ క్వార్టర్ నంబరు వెతుక్కుంటూ వచ్చి ఆ యింటిముందు ఆగింది.

కారు ఆగిన శబ్దం అవగానే, కుసుమ వాకిట్లోకి తొంగిచూసింది. దాదాపు ప్రీతి వయసేవుంది. కుసుమని చూడగానే గుండెలు పిండినట్టయింది. కారు దిగి నడిచి వస్తుంటే, అతని అడుగులు తడబడి, శరీరం తూలడం చూసి, చప్పున పరుగెత్తుకువచ్చి చెయి అందించింది. అతను భయంగా, పిరికివాడిలా, ఆ అమ్మాయిముఖంలోకి చూసాడు! లేదు! ఆ అమ్మాయి ముఖంలో అసహ్యంలాటిది లేదు ! అతని గుండెలమీదనుంచి తాత్కాలింగా కాస్త భారం దిగినట్ట యింది

లోపలికి రాగానే, అతన్ని వాలు కుర్చీలో కూర్చోమని ఫాన్ వేసింది! పక్కగదిలోకి వెళ్లి ఉత్తరం పట్టుకు వచ్చింది. అది అతనికి అందివ్వబోతూ, ఆగింది. కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి.

"అంకుల్ ! మీరు నాకో వాగ్దానం చెయ్యాలి."

"ఏమిటది ?"

"ఈ ఉత్తరం చూసి ప్రీతిమీద ఆగ్రహ పడనని మాటయివ్వండి."

"లేదమ్మా.. అందులో ఏం వ్రాసి ఉన్నా ఆగ్రహపడే అర్హత నాకులేదు."

అతని కంఠం వణికింది. కుసుమ ఉత్తరం అతని చేతికి యిచ్చి అక్కడ నిలబడలేనట్టుగా వంటయింట్లోకి వెళ్లి పోయింది

భవానీప్రసాద్ ఒక్క నిముషం ఆ ఉత్తరంలో ఏమున్నా చదివి భరించే శక్తి తనకివ్వమని భగవంతుడిని ప్రార్థి స్తున్నట్టుగా కళ్లు మూసుకున్నాడు. తర్వాత హృదయం కంపిస్తుండగా, ఉత్తరం తెరిచి చదవసాగాడు.

కుసుమా !

నీకు చెప్పకుండా, నువ్వు వూరినుంచి వచ్చేవరకూ వుండకుండా, వెళ్లిపోయా నని కోపంగా వుందికదూ ! నేను ఏమయ్యానో తెలిసిన తర్వాత నీ కోపం నిలవదని నాకు తెలుసు ! ఆ రోజు అర్ధరాత్రి దేన్నిగురించి భయపడి పారి పోయి వచ్చానో ఎంత ప్రయత్నించినా నీకు తెలియచేయలేకపోయాను నేనే కాదు, ఏ ఆడపిల్లా అలాటి సిగ్గుమాలిన విషయం నోరు తెరిచి చెప్పలేదేమో ! కుసుమా ! 'సిగ్గుతో చచ్చిపోయాను !' అంటారే. సరిగ్గా అదే నాకు ఎదురైంది! అంతకంటే నీకు యింకేం చెప్పలేను. జీవితం అంతం చేసుకోబోతున్న ఈ

ఆఖరిక్షణంలో నాకు మా అమ్మా - నాన్నలమీద అంతులేని కోపం వస్తోంది వాళ్లు నాకు సరైన శిక్షణ యివ్వలేదు. వాళ్ల గారాబంతో, ఈ లోకం ఒక రోజా పువ్వులతోట అనే భ్రమ నాలో కల్పించారు. ఇందులో మోసం, దుర్మార్గం అనే వాడియైన ముళ్లు వుంటాయని, జీవితాలు వాటికి పట్టుకుని చిరిగిపోకుండా ప్రతి వ్యక్తి జాగ్రత్తగా, మెలకువగా ప్రవర్తించాలని నేర్పలేదు. చూచాయగానైనా తెలియచేయలేదు అమ్మ నాకు ఖరీదైన బట్టలు, విలువైన నగలూ కొనియిచ్చి, నా యిష్టం వచ్చిన స్నేహితులతో తిరిగే స్వేచ్ఛయివ్వటంతో తన బాధ్యత తీరిపోయింది అనుకుంది.

నాన్న సరేసరి! ఆయనకి ఆ బిజినెస్ గొడవతో క్షణం తీరదు! డబ్బు సంపాదన మినహా యింకోవిషయమే ఆయనకి తెలియదు. నేను వుండే హాస్టల్‌కీ మా యింటికీ పెద్దగా తేడా ఏమీ కన్పించేదికాదు నాకు.

కుసుమా! తల్లి చిన్నప్పుడు నిప్పు దగ్గరకి వెళ్లబోతుంటే, 'అమ్మో! కాలుతుంది' అని వెనక్కు లాగుతుంది. స్వీట్లు యిష్టం అని ఎక్కువగా తింటుంటే, 'వద్దమ్మా! జబ్బుచేస్తుంది.' అంటూ వారిస్తుంది. అట్లాగే పిల్లలు పెద్దయిన తర్వాత కూడా ముఖ్యంగా. తొలి యవ్వనంలో అడుగుపెట్టి, ఈ ప్రపంచం అంతా అందమైన రంగుల రమణీయదృశ్యంగా భావించి భ్రమపడుతున్నపుడు వాళ్లకి అండగావుండాలి. అడుగు పక్కకు వేస్తున్నారా అనే జాగ్రత్తతో గమనించాలి. అంత తీరుబడి వాళ్లకి లేకపోతే ఒక ఆప్తమిత్రురాలిలా అన్నీ చెప్పెయ్యాలి! ఆడపిల్లలు యిదివరకు రోజుల్లోలాగ నాలుగుగోడల మధ్య, అమ్మా—నాన్నల, అన్నదమ్ముల కంటిచూపుల మధ్య వుండటంలేదు. ఈ కొత్తగా చదువులు కావాలనే ఆరాటం, ఈ బైటప్రపంచంలో యీ ఫాషన్లు, వ్యక్తిత్వంలో స్వేచ్ఛ కావాలనుకోవడం, ఆడా మగా కలిసి తిరగడం, ఈ పుస్తకాలు, సినిమాలు, వాళ్లని ఎంత తికమకపెడతాయో యీ పెద్దవాళ్లకి అర్థంగాదు! సృష్టిలో ఎంత సహజమైన విషయాలు, పిల్లలకి చెప్పటానికి ఎందుకు భడియపడతారో అర్థంగాదు. ఏదయినా జరిగితే, మా పరువు పోయిందని, మా గౌరవం మంట కలిసిందని ఏడవటం ఒక్కటే తెలుసు.

నా విషయం చూడు నాకు అమ్మా నాన్నల గారాబంమాత్రమే తెలుసు. కానీ వాళ్లదగ్గర మనసు విప్పినా భయాందోళనలు చెప్పే చనువు చిన్నప్పటినుంచీలేదు. అమ్మ ఎప్పుడూ స్వేచ్ఛ స్వేచ్ఛ అంటుంది. ఇప్పుడని పిస్తోంది నాకు. ఆవిడ కసలు స్వేచ్ఛ అంటే అర్థం తెలుసా అని. మగాడితో సమానంగా ఆడది వుండాలంటుంది.

మగాడికి వుండే మొరటుదనం స్త్రీకి ఎలా వస్తుందో నాకు తెలియదు.

కుసుమా! నేను మెడ్రాస్‌లో ఇంటర్ చదువుతుండగా గిరిజ అనే అమ్మాయితో స్నేహం అయింది. గిరిజ కుటుంబంలో గొడవలు కారణంగా, ఇంటర్ మెడ్రాస్‌లో మేనమామ యింట్లో వుండి చదివింది. చాలా సోషల్‌గా వుంటుంది. అందరినీ యిట్టే స్నేహం చేసుకుంటుంది. పరీక్ష తప్పటంతో చదువు మానేసింది. మేమిద్దరం స్నేహితులం అయ్యాం. గిరిజ ప్రోద్బలంమీద, నేను అమ్మదగ్గర హఠంచేసి, ఈ వూళ్లో వచ్చి బి.ఎ.లో చేరాను. ఆ అమ్మాయితో స్నేహం అదొక విషవలయం అని నాకు తెలియ లేదు. గిరిజకు తండ్రిలేడు. వాళ్లమ్మ ఉద్యోగరీత్యా ఎక్కువ టూర్స్ వెళుతూ వుంటుంది మొదట మొదట హాస్టల్ భోజనంతో విసుగెత్తిన నేను, గిరిజ బలవంతంమీద అప్పుడప్పుడూ శలవులు వచ్చినప్పుడు వాళ్లయింట్లో భోజనం చేయ టానికి వెళ్లేదాన్ని. గిరిజకి ఒక అన్నయ్య వున్నాడు. తల్లి వూళ్లో లేకపోతే యింట్లో పెత్తనం అంతా గిరిజది- వాళ్ల అన్నయ్యదీ ! యిద్దరికీ ఫ్రెండ్స్‌కేం తక్కువలేదు. ఎప్పుడూ ఏదో ఒక పార్టీపేరుతో పదిమందిని పోగుచేస్తూ వుండేవారు. మానసికంగా వంటరితనంతో బాధపడుతున్న నాకు అట్లా పదిమందిలో గడుపుతుంటే హాయిగా వుండేది.

శలవులకి అమ్మదగ్గరకి **వెళితే,** ఆ యింట్లో నిశబ్దం, క్రమశిక్షణ చూసి ఎప్పుడెప్పుడు హైదరాబాద్ వెళ్ళిపోతానా అని విలవిలలాడేదాన్ని. అమ్మ ఎప్పుడూ ఆఫీసు గొడవలతో బిజీగా వుంటుంది. నాతో కబుర్లుచెబుతూ కూర్చునే తీరుబడి ఆవిడకి ఎప్పుడూ వుండదు.

గిరిజ అమ్మకూడా అంతే. అందు వల్లేనేమో, గిరిజా-నేనూ స్నేహితులం అయ్యాం. మేం కూర్చున్నప్పుడల్లా మా అమ్మల గురించే కసిగా చెప్పుకునే వాళ్లం. రాను, రాను, నాకు గిరిజ యింట్లో చనువు ఎక్కువైంది. శని ఆది వారాలేగాకుండా, అప్పుడప్పుడూ కాలేజి ఎగ్గొట్టికూడా వచ్చి గిరిజదగ్గర వుండేదాన్ని.

వాళ్లమ్మ వూరులో లేనప్పుడు, గిరిజ నన్ను వాళ్ల యింట్లోనే పడుకోమని బలవంతం చేసేది! తీరా నేను వున్న తర్వాత, తను ఏ బాయ్ ఫ్రెండ్‌తోనో, సెకెండ్‌షో సినిమాకని వెళ్లిపోయేది. వాళ్లన్నయ్య గిరిజని ఏమీ అనక పోవటం చూసి నాకు ఆశ్చర్యంవేసేది. తర్వాత తర్వాత తెలుసుకున్నాను వాళ్లి ద్దరూ తోడుదొంగలు అని. తల్లికి తెలియకుండా వుండేందుకు ఒకరి రహస్యం ఒకరు కాపాడుకునేవారు.

గిరిజ అన్నయ్య అంటే నాకు మొహమాటం పోయి చనువు ఏర్పడింది.

వాళ్ల యింట్లోనే నేను మొదటిసారిగా డ్రింక్ రుచిచూసాను. ఒకరోజున నాకు తలనొప్పిగా వుందంటే అతను ఒక టాబ్లెట్ యిచ్చాడు. అది వేసుకున్నతర్వాత నేను పొందిన అనుభూతి అనూహ్యం. గాలిలో తేలిపోతు న్నట్టుగా, శరీరం అంతా మత్తు మత్తుగా అనిపించింది. ఆ మత్తులో గిరిజ అన్నయ్య చనువు ప్రదర్శిస్తుంటే, గట్టిగా తిరస్కరించలేకపోయాను.

నాకు ఆ మత్తు అంటే యిష్టం ఏర్పడింది. ఆ అనుభవం పదేపదే కావాలని కోరుకున్నాను.

నాకు నెల తప్పింది. ఈ సంగతి తెలుసుకోగానే హడలిపోయాను. నాకు భయంవేసింది. అమ్మా-నాన్నలకి ఏం జవాబు చెప్పను? అనిపించింది. శలవులు దగ్గరికి వచ్చేస్తున్నాయి శలవులు వస్తే అమ్మ నన్ను ఒక్క-క్షణం కూడా యిక్కడ వుండనివ్వదు. గిరిజతో చెప్పాను. గిరిజ ఏం భయంలేదని, అంతా తను చక్కదిద్దుతానని ధైర్యం చెప్పింది. ఏదో మందు తెచ్చి మింగించింది. కానీ లాభంలేకపోయింది. లేడీ డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళింది. ఆవిడ నన్ను పరీక్షచేసి యీ ఆపదనుండి తప్పిస్తానంది. 600 రూ. ఫీజు అడుగుతోందని గిరిజ నాకు చెప్పింది. నాకు కళ్ళు తిరిగినంతపనైంది.

ఆరువందలు! ఎక్కడినుంచి తీసుకురాను! అప్పటికే గిరిజ పుణ్యమా అని స్నేహితులు, పార్టీలు, పిక్నిక్లు అంటూ నా ఖర్చులు బాగా పెరిగిపోయినాయి. అమ్మకి ఎక్కువ డబ్బులు పంపడం కోసం ఏవేవో సాకులు రాసేదాన్ని. చేతి వాచీ అమ్మేసి పోయిందని, కాలేజీలో చందాలు అడుగుతున్నారని, స్నేహితురాలు ఆపదలోవుంది సాయంచేయాలని యిలా దొరికిన సాకులన్నీ అమ్మకి డబ్బుకోసం వ్రాస్తుంటే, మొదట మొదట వెంటనే పంపినా, తర్వాత-తర్వాత సవాలక్ష ఆరాలు అడగటం ప్రారంభించింది. చివరకు కాలేజిఫీజు, హాస్టల్ఫీజు మినహా ఎక్కువ పంపటం బాగా తగ్గించేసింది. ఈ పరిస్థితిలో 600 రూ. కావాలని ఏ సాకు చూపించినా అమ్మ పంపదని నమ్మదని నాకు తెలుసు.

మెళ్లో గొలుసు, వుంగరం తాకట్టు పెడితే గిరిజ ద్వారా, మార్వాడి 300 రూ. యిచ్చాడు. స్నేహితులకి యింతవరకూ అప్పుయివ్వడమేతప్ప తీసుకోవటం తెలియదు. అక్కడికీ సిగ్గువిడిచి అడిగాను. అందరి దగ్గరా పోగుచేసింది, నిండా వందరూపాయలు కూడా కాలేదు. యింకో రెండువందలు కావాలి!

రోజులు జరుగుతుంటే, నాకు భయంతో రాత్రుళ్ళు నిద్రపట్టడం మానేసింది నేను ఖంగారుపడటంచూసి, గిరిజ ఒకనాడు, నేను తిట్టనంటే ఒక ఉపాయం చెబుతానంది. నేను చెప్ప

మన్నాను. తనకు తెలిసిన ఒక అతను వున్నాడట! అతనికి ఆడపిల్లలను రహస్యంగా హోటల్స్‌కు సప్లై చేయడం వృత్తిట! "ఒక్కరాత్రికి 100 రూ. యిస్తారు. ఈ బాధంతాపడేదానికంటే —" గిరిజమాట పూర్తికానేలేదు. నేను లేచి గిరిజమీద కలబడ్డాను. "నేనెవరు అనుకుంటున్నావ్?" అంటూ అరిచాను. గిరిజ నా చేతులు వదిలించుకుని నా వైపు నిరసనగా చూసింది. 'సరే! నీ యిష్టం! నీ దోవ నువ్వుచూసుకో?" అంది

చాలా కోపంతో, అవమానంతో వుడికిపోతూ హాస్టల్‌కి తిరిగివచ్చాను. నాకు చెప్పలేనంత ఏడుపు ముంచుకు వచ్చింది. గిరిజ అసలు స్వరూపం నాకర్థమైంది. నా చీరెలు తన చీరెలుగా కట్టుకునేది. నా డబ్బు తన స్వంతడబ్బులా ఖర్చుచేసేది. నా అమాయకత్వం ఆధారం చేసుకుని నన్నొక బొమ్మలాచేసి ఆడించింది. నాకు ఆపదవస్తే నీ దోవ నువ్వు చూసుకో అని వదిలేసింది. నాకిప్పుడు అర్థమైంది గిరిజ కుటుంబానికి వాళ్ళమ్మ తెచ్చే జీతం బొటాబొటీగా సరిపోయేదయినా, వాళ్ళింట్లో అంత ఖరీదయిన సామాను ఎలా వుందో. గిరిజ ధనికురాలిలా ఎలా ప్రవర్తించగలుగుతోందో యిప్పుడు తెలిసింది. నాలాటి వాళ్ళని ఆత్మీయత పేరుతో దగ్గరికితీసి స్నేహం అనే వుచ్చుబిగించి, బొమ్మల్లా ఆడిస్తారు. నాకు తెలిసో తెలియకో ఈ విషవలయంలో చిక్కుకున్నాను ఎలాగైనా దీనిలోనుంచి బైటపడాలి. జన్మలో ఆ పాడు గిరిజముఖం యింక చూడను. అమ్మా-నాన్నల పరువుకోసం అయినా, నేను ఈ విషయంలో గుంభనగా బైట పడాలి అనుకున్నాను.

ఈ వేదనతో కృంగిపోతున్న నాకు చాలాసార్లు నీ దగ్గర మనసు విప్పి చెప్పేయాలని ఎంతగానో అనిపించింది. రెండు సార్లు వచ్చాను. కానీ ధైర్యం చాలలేదు. నువ్వు అమ్మవాళ్ళకి తెలియచెప్పేస్తావేమోనని భయంవేసింది. ఈ రహస్యం నాకు, గిరిజకితప్ప యింకెవ్వరికీ తెలియ కూడదనుకున్నాను.

శలవులు దగ్గరికి వస్తున్నాయని, కేలెండర్ రోజూ హెచ్చరిస్తోంది. నాకెటూ పాలుపోలేదు. ఒక తప్పులోనుంచి బైటపడాలనే తాపత్రయంలో రెండో తప్పు చేయటానికి తెగించాను. మొదటి తప్పు తెలియక అమాయకంగానే చేసాను. ఈ తప్పు తెలిసే చేయాల్సి వచ్చింది.

ఆసాయంత్రం గిరిజయింటికి వెళ్ళాను. తొందరపడి మాటలు అన్నందుకు క్షమాపణ కోరాను. హోటల్‌కి వెళ్ళటానికి నా అంగీకారం తెలిపాను. గిరిజ కినుకగా, "ఈ పని అప్పుడే చేస్తే ఈపాటికి అంతా సవ్యంగా అయిపోయేదిగా!" అంది

గిరిజా, నేనూ కలిసి ఆ హోటల్‌కి



టీ తాగడానికి వెళ్ళాం. హోటల్ మేనేజరు మా దగ్గరకు వచ్చాడు. గిరిజని చాలా చనువుగా పలకరించాడు. గిరిజ అతనికి నన్ను పరిచయంచేసింది. మేము టీ తాగిన బిల్‌కి నేను డబ్బులు చెల్లించబోతూంటే, అతను తీసుకోలేదు. "యు ఆర్ అవర్ గెస్ట్" అన్నాడు.

టాక్సీ పిలిచి మమ్మల్ని అందులో కూర్చోపెట్టి, డ్రైవర్‌తో యింటిదగ్గర దింపి రమ్మనమని చెప్పాడు. గిరిజ నన్ను హాస్టల్ దగ్గర దింపుతూ, "అవకాశం రాగానే, తమ హాస్టల్‌కి సెకండ్‌షో సినిమాకి రమ్మని కోరుతూ ఫోన్ చేస్తానని, అర్థంచేసుకోమని చెప్పింది. నేను సరేనన్నాను.

రెండురోజుల తర్వాత గిరిజ ఫోన్ చేసింది. నేను ఎవరికీ తెలియకుండా, నా రూమ్‌మేట్‌కి మాత్రం చెప్పి, బైటికి జారుకున్నాను. వీధిచివర ఆ రోజున మమ్మల్ని దింపిన టాక్సీ ఎదురు చూస్తోంది. నేను గబగబా వచ్చి దాంట్లో ఎక్కాను.

నేను ఎక్కిన టాక్సీ హోటల్ వెరటి వైపువచ్చి ఆగింది. అక్కడ మేనేజరు

ఎదురుచూస్తున్నాడు. టాక్సీ ఆగగానే వచ్చి తలుపు తెరిచాడు. నావంక ఆప్త మిత్రుడిలా చూస్తూ "గుడ్ యీవినింగ్'' అన్నాడు.

నా ముఖంలో ఖంగారు గమనించాడు కాబోలు, "ఆయన చాలా పెద్దమనిషి. ఏంభయంలేదు" అన్నాడు. నేను గబ గబా తల వూపాను.

నా శరీరం అంతా గడ్డకట్టుకుని పోతున్నట్టుగా వుంది. మేనేజర్ చెప్పిన విధంగా లిఫ్ట్‌లో పైకి వెళ్ళి, ఆ నంబరు గది తలుపుమీద వేళ్ళతో తట్టాను. తలుపులు తెరుచుకున్నాయి! నేను లోపలికి వెళ్ళాను. కానీ—అక్కడున్న వ్యక్తి ఎవరనుకున్నావు? వద్దు, కుసుమా! వద్దు. ఆ వివరాలన్నీ నీకు చెప్పలేను! ఆ వ్యక్తి నన్నుచూసి, నిర్ఘాంతపోయాడు! నేను కూడా కొయ్యబారిపోయాను! నేను చేసిన తప్పు నాలోనే శిధిలం అయిపోవాలని నేనుపడిన తాపత్రయం, చేసిన ప్రయత్నం అంతా వృధాఅయిపోయినాయి. నా రహస్యం బట్టబయలు అయింది. ఆ క్షణంలోనే, నేను సిగ్గుతో చచ్చి పోయాను! నా యీ రహస్యం బైటపడి, నా తలిదండ్రులకి తెలిసిన తర్వాత నేను బ్రతకలేను కుసుమా? నా వల్లకావటం లేదు. ఆ క్షణంలో, ఎక్కడికెళ్లాలో, ఏంచెయ్యాలో తోచక వెర్రిదానిలా అయి పోయిన నేను, నాకు తెలియకుండానే నీదగ్గరికి పారిపోయి వచ్చాను. రెండు రోజులు ఆగితే విషయం ఏమిటో నేనే చెబుతాను, అనే ధీమాతో వున్న నువ్వు నన్ను అట్టే బలవంత పెట్టలేదు.

నా అదృష్టంకొద్దీ, మీ వదినకి సుస్తీగా వుందని, నిన్ను తీసుకువెళ్ళ టానికి మీ అన్నయ్య వచ్చాడు. నువ్వు వరంగల్లు వెళ్ళావు. నీతో నోరువిప్పి చెప్పలేని నా మూగవేదనని, యీ కాగితం మీద పెడుతున్నాను. కుసుమా! నా మనసు యిప్పుడు చాలా హాయిగావుంది. భయంలేదు! ఆందోళనలేదు! సిగ్గుపడా ల్సిన అవసరంగాని, తలవంచాల్సిన పనిగాని, సంజాయిషీ చెప్పుకోవల్సిన భయంగాని లేదు. కుసుమా నా యీ చిన్న జీవితంలో కలిగిన అనుభవంగా నిన్ను హెచ్చరిస్తున్నాను. నీకు పిల్లలు పుట్టి, పెద్దయితే, వాళ్ళని ఆత్మీయతతో నీదగ్గర చనువుయివ్వు. వాళ్ళని స్నేహి తులతో కలవనీ! కానీ ఆ స్నేహితులు ఎలాంటివాళ్ళో మాత్రం గమనిస్తూవుండు. పిల్లలకి స్వేచ్ఛయివ్వు. కానీ ఆ స్వేచ్ఛ వాళ్ళ కష్టసుఖాలు - యిష్టాయిష్టాలు నిస్సంకోచంగా చెప్పేందు కుపయోగ పడాలితప్ప వెర్రిమొర్రి వేషాలు వేయనీయ కూడదు. జీవితంలో ఫాషన్స్‌కంటే గ్లామర్‌కంటే, నిరాడంబరత, నిర్మలత్వం ముఖ్యమని అర్థంచేసుకోవాలని చెప్పు. నాకు మళ్ళీ జన్మ అనేదివుంటే, నీకు కూతురుగా పుట్టాలనివుంది. కుసుమా!

నేను ఈ జీవితంలో చేస్తున్న ఆఖరి పనేమిటో తెలుసా? నీకీ ఉత్తరం పోస్ట్ చేయటం

నన్ను అసహ్యించుకోవనే గాఢమైన నమ్మకంతో. ప్రీతి

కళ్ళలో నీళ్ళు గట్టిగా తుడుచుకున్నకొద్దీ, మళ్ళీ మళ్ళీ పూరడంతో అక్షరాలు అలుక్కుపోయినట్టు అవగా, అతికష్టంమీద భవానీప్రసాద్ ఉత్తరం చదవటం పూర్తిచేసాడు.

కుసుమ కాఫీ తెచ్చియిచ్చింది. బాగా ఏడ్చినట్టుగా కళ్ళు ఎర్రబడి వున్నాయి. జీరపోయిన గొంతుతో అంది. "ఆ రాత్రి ప్రీతి వెళ్ళిన, ఆ వ్యక్తి ఎవరో మీకు బాగా తెలిసినవాడై వుండాలి! అతను మీకు చెబుతాడని, ఈ రహస్యం దాగదని భయపడివుంటుంది. అందుకే ప్రీతి సిగ్గుతో మీ ముందుకు రాలేకపోయి వుంటుంది. అంకుల్! ప్రీతిని మీరు అసహ్యించుకోవటంలేదుగా!"

"లేదమ్మా. లేదు లేదు. చెప్పానుగా. ఆ అర్హత నాకులేదని. ప్రీతిని, కన్నామే గాని, సుజీ, నేనూ, తలిదండ్రులుగా మా బాధ్యత నెరవేర్చలేదు. అందుకు నేను నిజంగా సిగ్గుపడుతున్నాను." కుసుమ తృప్తికోసం ఎలాగో రెండు గుక్కలు తాగి, అతను లేచాడు. కుసుమ అతన్ని టాక్సీవరకూవచ్చి సాగనంపింది.

భవానీప్రసాద్ నిస్త్రాణగా, టాక్సీలో వెనక్కువాలి కూర్చున్నాడు. టాక్సీ కదిలింది. అతని కళ్ళలో నీళ్ళు నిండుకో సాగినాయి. "ప్రీతీ! ప్రీతీ! సిగ్గుపడాల్సింది నేనమ్మా! డబ్బే జీవితం అనుకున్నాను. డబ్బుమినహా ప్రపంచంలో మనిషికి యింకేమీ అవసరం లేదనుకున్నాను. అందుకే నాకు మంచి పాఠం నేర్పావు. నేను పిరికివాడిని! నీమాత్రం ధైర్యంకూడా నాకు లేదు." రెండు చేతుల్లో ముఖందాచుకుని హిస్టీరియా వచ్చినట్టు వెక్కివెక్కి ఏడవసాగాడు.

టాక్సీడ్రైవర్‌కి భయంవేసింది! ఎంత త్వరగా ఈయన్ని హోటల్‌దగ్గర దించితే అంతమంచిది అనుకున్నాడు.

టాక్సీ వేగం రెట్టింపు అవగా, రయ్యిన హైదరాబాదువైపుకు దూసుకుపోసాగింది.

( సమాప్తం )



# లయ తప్పిన హృదయాలు

— శార్వరి

(గత సంచిక తరువాయి)

ఒక దెబ్బ వేసింది ఆ దెబ్బ తగల వలసిన చోటనే తగిలింది సుందరానికి. అంతలో తెప్పరిల్లాడు

"నేను అనేది, తిరిగి రావాలంటే మనసు వప్పదని. అఫ్‌కోర్స్ తిరిగి రావటం అంటూ జరిగితే."

"అఫ్‌కోర్స్! వచ్చేస్తాలెండి."

"ఫ్రెండ్ పెళ్ళి అంటూ, మీ పెళ్ళికి వెడుతున్నంత సంబర పడుతున్నారు కోమలీ! ఆల్ రైట్! విష్ యు బెస్ట్ ఆఫ్ లక్."

డాక్టర్ సుందరం, డాక్టర్ రావుల దగ్గర సెలవు తీసుకుంది. తెలిసినవారం దరికీ గుడ్‌బై చెప్పింది.

## 32

ఇందిరను గురించి ఆమెకు కాబోయే భర్తను గురించి అనేక చిత్రాలు ఊహించుకున్నది కోమలి. ఆ రాత్రికే బయలుదేరింది. రైలులో ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు. గతం కళ్ల ముందు కదిలింది. పాపం, ప్రేమకోసం ఎంత ప్రాకులాడింది ఇందిర. ఇప్పటికి నాధుడంటూ ఒకడు దొరికాడు. అదృష్టవంతురాలు. అతను ఎలావుంటాడో? అతని గురించి వివరాలు ఏవీ రాయ లేదు. ఫారిన్ రిటరన్డ్ అట. ఆలోచనల అలా ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే నిద్ర ఎలా పడుతుంది.

బొంబాయిలో దిగగానే టాక్సీ చేసకుని ఇందిర ఇంటికి చేరుకున్నది. ఆ ఇల్లు నగరం సుబర్బన్‌లో దూరంగా ఉన్నది. ఇల్లు పెద్దదే. బంగళా. అక్కడ అంతా లక్షాధికారులు, కోటీశ్వరులే ఉంటారు. ఇందిరకు తల్లి తప్ప వేరెవరూ లేరు.

"ఓహ్! మై డార్లింగ్. వచ్చేశావా! టెలిగ్రాం యిస్తే స్టేషన్‌కి వచ్చేదాన్నిగా.. కమాన్" అంటూ ఇందిర కోమలిని చూడగానే ఎగిరి గంతేసి, కావిలించుకుంది. ముద్దులతో ముంచేసింది. తన గదిలోకి తీసుకువెళ్లి జరుగుతున్న ఏర్పాట్ల గురించి వివరంగా చెప్పింది.

"ఇంక ఆట్టే టైంలేదు కోమలీ. నువ్వు వచ్చావు, నాకు బోలెడు బలం, ధైర్యం వచ్చాయి. మనం అనేక విషయాలు ఏకాంతంగా మాట్లాడుకోవాలోయ్. ఇవాళ రాత్రికి డిన్నర్‌లో గోపీని పరిచయం చేస్తాను. గోపీ అంటే గోపీనాథ్

అన్నమాట. రేపు సిటీకి షాపింగ్‌కు వెళదాం. ఎక్కడి పనులు అక్కడే వున్నాయి. రేపు సాయంత్రం ఫ్రెండ్స్ వస్తారు చూడడానికి. రేపు లేదు ఎల్లుండి మనం గోపీ ఇంటికి లంచ్‌కి వెడతాం. ఆ రాత్రి పెద్ద పార్టీవుంది. పెళ్లి అయిపోతే ఈహడావుడి వుండదులే. సివిల్ మ్యారేజి అనగానే ఆశ్చర్యపోయావు గదూ."

"ఆశ్చర్యం ఏమిటిగానీ, ఆ ఆలోచన నీదా, మీ వారిదా ?''

"ఇద్దరిదీ సంప్రదాయక వివాహమంటే పెద్ద గొడవ. పీటలమీద గంటల తరబడి కూర్చోవాలి. బొమ్మలపెళ్లి తతంగం అంతా. ఏవో మంత్రాలు, చింత కాయలు యమా బోర్ కదూ. హి హేట్స్ దెం ఆల్. నాకూ నమ్మకం లేదనుకో. పెళ్లి అంటే మనసులు కలవటమేగా... మిగతావన్నీ లాంచనాలేగా."

"మద్రాసునుండి మన ఫ్రెండ్స్ ఎవరైనా వస్తున్నారా ?"

"అందరికీ ఇన్విటేషన్స్ పంపాను మరి. నలుగురైదుగురు ఇక్కడే బొంబాయిలో, పూనాలో వున్నారు. వాళ్లు తప్పక వస్తారు. మిగతావారి సంగతి చెప్పలేం. గ్రీటింగ్స్ పంపిస్తారేమో ! మా అమ్మ తరపువారికి నచ్చింది ఈ సంబంధం."

"పార్టీ అన్నావ్ ! ఘ నం గా నే వుంటుందేమిటి ?"

"డెఫినిట్. తప్పదు మరి. ఫ్రెండ్స్ ఊరుకోరుగా, పెండ్లి అయినాక మన ఇంట్లోనే డిన్నర్ ఏర్పాటుచేస్తాం. అసలు పెళ్లికిఉండే జనం తక్కువే. రిజిస్ట్రార్ బంగళాలో సంతకాలు జరుగుతాయి. అమ్మ, నువ్వు, మా మేనమామ, గోపీనాధ్ ఫ్రెండ్స్ ఇద్దరు. అంటే నిమిషాలలో అయిపోతుంది."

"పెళ్లయాక ఇద్దరూ కలిసే ప్రాక్టీస్ పెడతారా ?"

"కొన్నాళ్లపాటు సరదాగా చేద్దామనే వుంది. ఆయనగారి ఇష్టం."

ఆ రోజు సాయంత్రం కోమలి, గోపీనాధ్‌ని చూచింది. నలభై ఏళ్లు వుంటాయి. మంచి ఖరీదైన సూటులో నీట్‌గా హుందాగా వున్నాడు. మంచి భారీ శరీరం. అంతా పాశ్చాత్య పద్ధతే, మాట, నడక. అమెరికాలో, ఇంగ్లండులో చదివాడట. చక్కని ఇంగ్లీషు మాట్లాడతాడు. దొరలాగా మంచి మానర్సు ఉన్నాయి. తన విదేశీ చదువుల గురించి, అక్కడి ప్రొఫెసర్ల గురించి, అక్కడి మనుషుల గురించి చెప్పాడు. కానీ, ఇందిరను, గోపీనాధ్‌ను చూస్తుంటే, వారిద్దరిలోనూ 'రొమాన్స్' లోపించిందేమోననిపిస్తుంది. పై ఆడంబరమే కనిపిస్తుంది. "ప్రేమించుకుంటే మాత్రం పదిమందిలో సరసాలాడుకుంటారా ! ఇద్దరూ చిన్నపిల్లలుకారు." గోపీనాధ్ కోమలిని అనేక ప్రశ్నలు వేశాడు. ఆ సాయంత్రం హాయిగా గడిచింది. ఎక్కువసేపు గోపీ కోమలితోనే

గడిపాడని చెప్పాలి. ఇందిర, ఆమె తల్లి ప్రేక్షకులవలె ఉండిపోయారు. ఎప్పుడైనా ఒకటి, రెండు మాటలు కలిపారేమో! రాత్రి పదిగంటలకు గోపీనాధ్ అందరికి గుడ్‌నైట్ చెప్పి బయలుదేరాడు. మర్నాడు తన ఇంట్లో 'లంచ్'కి కోమలిని స్వయంగా ఆహ్వానించి, ప్రామిస్ తీసుకున్నాడు.

అతను వెళ్ళిపోగానే ఇందిర అడిగింది, "ఎలా వున్నాడోయ్ పెళ్ళికొడుకు, నా సెలక్షన్ నచ్చిందా?"

"వెరీ నైస్. చాలా తెలివిగలవాడు. బాగా రాణిస్తాడు. నువ్వు అతనితో సుఖపడతావే ఇందూ." తృప్తిగా అన్నది.

"థాంక్స్, నీకు నచ్చాడు గదా. చాలు. నేను ఒకే బెంగపడ్డాననుకో, నా నాధుడు నీకు నచ్చుతాడో లేదోనని."

"బావుంది. పెళ్ళిచేసుకునేది నువ్వు. కాపురం చేసేది నువ్వు. నీకు నచ్చితే చాలు. మధ్య మాకు నచ్చడంలో అర్థం లేదు. నేననుకున్నాను, అతను చిన్నవాడని.

"ముప్పయి ఎనిమిదట. పెద్ద వయస్సు కాదులే!"

"కాదనుకో."

"మొగుడన్నాక ఆ మాత్రం వుండాలిలేవే కోమలీ. ఒడ్డూ, పొడుగూ, పర్సనాలిటీ, తగ్గ వయస్సు లేకపోతే బావుండదు. మరీ చిన్నవాడైతే ఏంబావుంటుంది చెప్పు."

కోమలికి నవ్వాగిందికాదు. "అపునులే. నువ్వు మాత్రం బాలాకుమారివా... పెద్ద ఆరిందావైనావ్."

"ఆడవాళ్లు ఎప్పుడూ పెద్దవాళ్లేనే."

ఇందిర తల్లి, నిద్రకు ఆగలేక లేచి వెళ్ళిపోయింది. వారిద్దరూ, రాత్రి రెండుగంట లయ్యేవరకు కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు. మద్రాను అనుభవాలు, అప్పటి జీవితం, ఇందిర భవిష్యత్తు, సంసారం, ఇల్లు, బట్టలు, ఆస్తి, ఆదాయం ఎన్నో చర్చనీయాంశాలు.

"నీకో బహుమతి ఇవ్వాలిగా ఇందూ. ఏమివ్వనే. పల్లెటూరిదాన్ని, సంపాదన తక్కువ. అయినా స్నేహితురాలు పెళ్లి చేసుకుంటుంటే ఊరుకోలేను. ఏం కోరుకుంటావో కోరుకో!''

"నువ్వు రావటమేనాకో పెద్ద బహుమానం. అది చాల్లే. ఈ అభిమానం విలువకందనిది.''

కోమలి లేచివెళ్లి, తన పెట్టెలో దాచిన ఒక ఖద్దరు సిల్కుచీర తెచ్చింది. అయిదువందల రూపాయలకు కొన్నదది "నా రుచులు పాతకాలంవి. నా సెలెక్షన్ బి.సి. నాటిది. అయినా నా బహుమానం ఇదేరా అమ్మడూ."

"డోంట్ బి సిల్లీ! ఇట్స్ లవ్లీ. రేపు ఇది కట్టుకుంటాను. వచ్చేవారు దంగైపోతారు. ఇక్కడ నాగరికత అనీ కల్చర్ అనీ బక్కచిక్కిపోయే

ఆడాళ్లకు, ఇలాంటివి కట్టుకోవడం చాతకాదు. రేపు ఇదే కట్టుకుంటాను.'

"నీ ఇష్టం."

"సరేగానీ, ఇంతకూ నీ సంగతి చెప్పావుకావు కోమలీ! ఇంకా ఎన్నేళ్లు ఇలా భీష్మించుకుని కూర్చుంటావ్? ఎన్నాళ్లీ తపస్సు?" అడగింది ఇందిర.

''ముందు నీ పెళ్లి కానివ్వవమ్మా!" నవ్వుతూ సమాధానం చెప్పి తప్పించుకో చూచింది కోమలి.

మర్నాడు కోమలిని వెంటబెట్టుకుని సిటీకి బయలుదేరింది షాపింగ్‌కు. వీధులు, పెద్ద పెద్ద భవనాలు, జనం అన్నీ బాగున్నా ఎందుకో కోమలికి నచ్చ లేదు. మద్రాసుకంటే బిజీనగరం బొంబాయి. కానీ అక్కడి హాయి, ఇక్కడ కనిపించలేదు.

"నాకు బొంబాయి అంటే ఇష్టం కోమలీ. ఐలైక్ దిస్ బిజీసిటీ బిజీలైఫ్'' అన్నది ఇందిర తృప్తిగా.

అనేక షాపులు తిరిగారు. బట్టలు, రకరకాల చెప్పులు, పుస్తకాలు, గాజులు, నగలు కొన్నారు. సముద్రం ఒడ్డుకు వెళ్లగానే, చల్లని ఉప్పుగాలి వీచింది.

"ఓహ్...సముద్రతీరం బావుందే ఇందూ. మన మద్రాసు బీచికన్న ఇదే బావుంది. అవునుకదూ'' కోమలి ఆనం దంతో అరిచింది.

"ఇక్కడేం చూచావుగానీ, మెరీన్ డ్రైవ్, కొలాబా బీచీ చూడాలి. అందా నికి అందం, హాయికి హాయి, నేత్ర పర్వంగా ఉంటాయనుకో."

"ఇందూ. అన్ని దేశాలను, అన్ని నాగరికతలను కలిపేది సముద్రమే కదూ'' అన్నది కోమలి. ఆ సముద్రా నికి ఆవలిప్రక్కన కిరీటి ఉన్న భావన కలిగింది.

"విడదీసేదీ సముద్రమేనమ్మా!''

గతుక్కుమన్నది కోమలి పట్టుబడి పోయిన దొంగలా తలవంచుకున్నది.

"నువ్వు మరీ పసిపిల్లవైపోతున్నావే కోమలీ," అని మందలించింది.

ఇద్దరూ టాక్సీలో బయలుదేరారు. కానీ కోమలిదృష్టి నగర సౌందర్యం పైన లగ్నంకావడంలేదు. వదలి వచ్చిన సముద్రం, అలలు, హోరు ఆమె మన స్సులో మెదులుతున్నాయి. అక్కడ సముద్రం ఆకాశంలో కలిసిపోయే తీరు, పెద్ద పడవలు, స్టీమర్లు కన్నుల పండు వుగా ఉన్నాయి.

ఇంటికి వచ్చి టీ త్రాగుతుండగా ఇందిర జోక్ చేసింది.

''అమ్మా! ఇవ్వాళ మా కోమలి ప్రేమలో పడ్డదే."

అర్థంకాక, తలెత్తి చూచింది కోమలి.

"అవునమ్మా, సముద్రాన్ని ప్రేమిం చేసింది.''

"నిజమే ఇందిరా, సముద్రం ఎంత అందంగా వుందని. ఆ సముద్ర తీరంలోని

బంగళాలలో ఉండేవారు అదృష్ట వంతులు."

* * *

## 33

ఆ రోజు సాయింత్రం డిన్నర్‌కు రావలసినవా రింకా రాలేదు. అతిథుల రాకకోసం ఎదురుచూస్తున్నారంతా ఇందిర కోమలితో అన్నది. "ఈ రోజు వచ్చేవారంతా గోపీ పర్సనల్ ఫ్రెండ్స్, ఫామిలీ ఫ్రెండ్స్. అతని ఫ్రెండ్సంతా నాకూ తెలిసినవారేననుకో. అయినా మనం ఆడపెళ్లి వాళ్లంగా. జాగ్రత్తగా ఉండాలి

ఒక డాక్టరు, ఆయన సతీమణి, ఒక ప్రొఫెసర్‌గారు ఆయన కూతుళ్లిద్దరు, ఒక లాయరు, ఇందిర కజిన్స్ ఇద్దరు వచ్చారు.

ప్రొఫెసర్ రాగానే ఇందిర రన్నింగ్ కామెంట్ మొదలుపెట్టింది. "ఈయన ప్రొఫెసర్‌గారు. మాకు మంచి స్నేహితుడు. పుస్తకాల్లో చదువుతాం చూడు అలాటి 'ఆబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్' ఆ కూతుళ్లు ఇద్దరూ వెంటలేకపోతే, ఆయన ఎక్కడకు పోతాడో ఆయనకే తెలీదు. ఆ వచ్చే ఆయన హైకోర్టు లాయర్. గొప్ప జీనియస్ నంబర్ వన్ క్రిమినల్...లాయరు. నువ్వెప్పుడైనా మెడికల్ జూరిస్‌ప్రుడెన్స్ చూచావా ?''

"ఆహా ! మాది పల్లెటూరుగా, అలాటి కేసులు రావు. అయినా కోర్టుకు వెళ్లాలంటే భయమే బాబూ" అన్నది.

ఆ ఫంక్షన్‌కు కోమలి తనకున్న చీరల్లో మంచిది ఎన్నికచేసి కట్టుకున్నది ఒకరు బ్లాక్ సిల్క్‌చీర, ఒకరు వైట్ సిల్కుచీర ధరించారు.

"మీ ఇద్దరూ అచ్చం అక్కచెల్లెళ్లలాగా వున్నారమ్మాయ్." ఇందిర తల్లి మురిసిపోయింది. ''గోపీ మీ ఇద్దర్నీ ఇలాగ చూస్తే మూర్ఛపోతాడు."

వచ్చిన ప్రొఫెసర్ సరాసరి కోమలి దగ్గరకు వెళ్లి, "కంగ్రాచ్యులేషన్స్ బేబీ, మంచి మొగుణ్ని ఎన్నుకున్నావ్. అదృష్టవంతురాలివి" అంటూ భుజం తట్టి అభినందించాడు.

అంతలో ఇందిర ముందుకు వచ్చి, "సారీ ప్రొఫెసర్, ఈమె కోమలి అని, నా ఫ్రెండ్. నాపెళ్లికి వచ్చింది."

"ఐ యామ్ సో సారీ బేబీ, పొరపాటు నిన్నే గుర్తుపట్టలేకపోయాను." అన్నట్లు కోమలికదూ, నీవు ఎప్పుడైనా బొంబాయి వచ్చావా అమ్మాయ్?"

"లేదండీ, ఇదే రావడం" కోమలి సమాధానం

"ఏంచేస్తున్నావ్ ?"

"నేనూ డాక్టరునేనండి "

''నా చిన్నతనంలో రాడార్లు వేసి గాలించినా డాక్టర్లు దొరికేవారుకారు. మా అమ్మాయిల్ని మెడిసిన్ చదివిద్దామనుకున్నాను. కాని వాళ్లకి మందుల

వాసనపడను. అసలు నన్ను కనిపెట్టి ఉండడమే వాళ్లకి ఫుల్‌టైం జాబ్ అయింది.

అంతలో మరికొందరు అతిధులు రావటంతో, కోమలి ఇందిర వాళ్ల దగ్గరకు వెళ్లారు. బేరర్స్, మగవారికి షాంపైన్, ఆడవారికి సాఫ్ట్ డ్రింక్స్ అందిస్తున్నారు. అతిధుల కలకలం ఎక్కువైంది. వచ్చినవారు, అక్కడక్కడ చిన్న గుంపులుగా చేరి, కబుర్లు చెప్పుకుంటూ, ఎవరికి కావలసిన డ్రింక్స్ వారూ త్రాగుతున్నారు. అందరూ పెద్ద చదువులు చదివినవారే హైక్లాస్ వాళ్లందరు ఇందిర తల్లికి తెలుసు ఇందిర కన్న ఆ వచ్చినవారికి ఆమె తల్లితోనే పరిచయం ఎక్కువలా వుంది. అక్కడ జనంలో కోమలి, ఇందిర ఇద్దరే చిన్నవాళ్లు. అతిధులు అందరూ రావడం అయింది. వచ్చినవారందరూ విరిద్దర్నీ అభినందించకుండా ఉండలేకపోతున్నారు.

కోమలి, ఇందిర, అన్నిచోట్లకు తిరుగుతూ, ఎవరికి ఏమి అవసరమో కనుక్కుంటూ, వాళ్ల మాటలు వింటున్నారు. అందరూ నవ్వుతూ, తూలుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. చిన్న పట్టణాలలో ఇలాటి పార్టీలు, సరదాలు, ఉండవు ఇంత ఆనందమూ కనిపించదు ఉన్నతస్థాయిలోని వారి వేషభాషలు చూడ ముచ్చటగా ఉన్నాయి. ఇందిర మంచి సర్కిల్‌లో పడ్డది, అదృష్టవంతురాలు.

ఒకే చదువు చదివినా తానెక్కడ ! ఇందిర ఎక్కడ ! తన స్థాయి, తన బ్రతుకు వేరు. ఇందిర స్థాయి వేరు. పరిసరాల ప్రభావాలు మనుషులపై, వారి మనసులపై విపరీతంగా పనిచేస్తాయి కాబోలు. వీరందరూ అందరికీ తెలిసిన వారే. మన సామాన్య కుటుంబాలలో అయితే, ఏ పేరంటానికో, విందుకో ఇలా కలుస్తారు. ఈ సరదాలుండవు.

ఈ కంపెనీలో తను కలవలేకపోతున్నది. పరాయిదయిపోతున్నది. వారి సంభాషణ క్రమంగా వ్యక్తులమీదికి మళ్లింది. క్రమంగా అది ఒకే వ్యక్తిపై కేంద్రీకృతమైంది. అందరూ ఆ ఒక వ్యక్తిని గురించే మాట్లాడుకుంటున్నారు. ఎవరికి తెలిసిన మాట వారంటున్నారు. కోమలికి ఆశ్చర్యంవేసింది. ఆసక్తి హెచ్చింది.

"కిరీటి వస్తాడని చెప్పాడు, రాలేదేం. అతను వస్తాడని ఆశతో వచ్చాను" అంటూ ప్రొఫెసర్, తన అసంతృప్తిని వ్యక్తంచేశాడు. తాను ముఖ్యంగా వచ్చింది, కిరీటిని కలుసుకోవడానికే నన్నట్లు, ఇందిరను అభినందించడానికి కాదన్నట్లు.

కిరీటి పేరు చెవినిపడగానే కోమలి శరీరం ఆపాదమస్తకం కంపించింది.

నరాలలో ఒక విధమైన జలదరింపు బయలుదేరింది.

"ఎవరా కిరీటి?" నిరాసక్తంగా ఇందిరను అడిగింది.

"నీకు తెలియదు గదూ! కిరీటి అని, అమెరికాలో చదివి వచ్చాడులే. ఐ.ఎ.ఎస్. ఇండియా ఫస్ట్. మాకు మంచి స్నేహితుడు పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు ఆయన్ని ఇక్కడే పోస్ట్ చేశారు, టెర్రిబ్లీ క్లవర్ బట్ వెరీ సీరియస్..."

"ఒకరైనా అలా సీరియస్‌గా ఉండక పోతే బావుండదు" అని ప్రొఫెసర్ సమర్థించాడు.

"ఈయన కూతుళ్ల యిద్దరిలో ఒకర్ని అతనికిచ్చి చేయాలని ఈ ముసలాడు ప్లాను వేస్తున్నాడు." ఇందిర రహస్యం చెప్పింది.

కిరీటిని గురించి అప్పుడప్పుడు అమ్మ చెప్పిన మాటలు మననంచేసుకో సాగింది. అప్పుడు శ్రద్ధగా పట్టించుకో లేదు. చెప్పినా వినిపించుకోలేదు అతనే ఇతనా.

'కిరీటి! అవును ఆయనే. నేను ఆయన భార్యనే. అగ్నిసాక్షిగా పెళ్లాడిన భర్త' అనుకున్నది క్షణంసేపు.

కోమలి పరాకును ఇందిర కనిపెట్టింది

"ఏమిటి కోమలీ, అలసిపోయావా! కాసేపు రెస్టుతీసుకో పోనీ" అన్నది దగ్గరగా వచ్చి.

"ఫరవాలేదు ఇందూ..."

"నీ కెప్పుడూ ఆలోచనలేనమ్మా... ఎప్పుడూ సీరియస్‌గా ఉంటావ్" అన్నది.

"ఏదీ మీ ఫ్రెండ్ కిరీటిగారిలాగానా?" అప్రయత్నంగా అన్నది.

"అతన్ని నువ్వు ఎరగవుగానీ బలే సెన్సిటివ్ ఫెలో. మహా సీరియస్. అతను వస్తే, వీళ్లంతా ఇలా గోలచేస్తారను కున్నావా? గప్‌చుప్. నీకు పరిచయం చేస్తాను, రానీ."

కోమలి, తనలో తను నవ్వుకుంది. తనలో అనుకున్నది. 'నేను కిరీటిని కలవడమా! నన్ను కిరీటికి ఒకరు పరిచయం చేయాలా? ఏమనిచేస్తారు! ఆయన ఏమనుకుంటారు...అమాంతం ప్రళయం వచ్చి నేను చచ్చిపోతే బాగుండును. నేను బొంబాయి వచ్చింది ఇందిర కోసమా! కిరీటి కోసమా! విధి నన్ను ఇలా తరుముకు వచ్చిందా? కిరీటి ఇక్కడకు రావడం విధి ప్రేరణవల్లనేమో'.

అందరి భోజనాలు అయినాయి. కాని కిరీటి రాలేదు కోమలికి అదొక తృప్తి. అదే ఒక అసంతృప్తి.

ఆ రాత్రి అంతా కిరీటిని గురించి వద్దు అనుకుంటూనే ఆలోచించింది నేను ఇక చస్తే బొంబాయి రాను' అనుకుంది. అంటే! నేను కిరీటిని చూచి భయపడు తున్నానా! ఛీ నాకేం భయం! అమ్మకు తెలిస్తే ..తెలియనీ...మా ఇదర్నీ కలప

డానికి ఎన్ని ప్రయత్నాలైనా చేస్తుంది. కిరీటిని కలుసుకోకూడదనే నిశ్చయించు కుంది. అతనిగురించి ఆలోచించరాదనీ అనుకుంది.

నేనిక్కడ ఉన్నట్లు అతనికి తెలియదు. తెలిసినా గుర్తుపట్టలేడు నేను చాలా మారిపోయాను. ఎన్నేళ్లయిందో చూచి! రెండురోజుల పరిచయమేగా! అదీ రెండు, మూడుసార్లు దగ్గరగా చూసి ఉంటాడు. నన్ను, నా రూపాన్ని ఎప్పుడో మరచిపోయి వుంటాడు. మేం భార్యాభర్తలమని ఇక్కడ ఎవరికీ తెలియదు కనక పేచీలేదు కాగా, అతన్ని చూస్తే కొత్త చిక్కులు రావుగదా. ఎందుకో అతనిని చూడాలంటే సిగ్గుగా వుంది. కొత్త పెళ్లికూతురులా తలవాలి పోతోంది. కళ్లలో తేనెలు కురుస్తున్నాయి పెదాలు అదురుతున్నాయి. గెండె గుబగుబలాడుతోంది. నేను ఆయన పేరు వినగానే అబలనై పోయానేమిటి? స్త్రీనై పోతున్నాను?

ధైర్యం తెచ్చుకున్నది మర్నాటి ఉదయం ఇందిరతో చెప్పాలి, ఎలాగైనా కిరీటిని ఇక్కడకు రప్పించమని అకస్మాత్తుగా, ఆయన నన్ను చూస్తే ఏమనుకుంటారో? ఏంచేస్తారో? రకరకాల ఆలోచనలు, తీయతీయని తలపులు వచ్చాయి.

మర్నాడు అంతా హడావుడి. అసలు కిరీటి ప్రసక్తి తీసుకురావడానికే వీలు కలగలేదు. అది కనిపెట్టినట్లు ఇందిరే ఆ ప్రసక్తి తెచ్చింది. 'ఆ కిరీటిగారు కాంపు కెళ్లారుట ఇవాళ రాత్రికిగానీ, రేపుగానీ వస్తామని కబురుచేశారు. ఆయన ఎప్పుడూ ఇంతే గోపీ అంటే ఆయనకు బలే యిష్టం కిరీటిగారన్నా గోపీ ప్రాణంపెడతాడు ఇద్దరూ బెస్ట్ ఫ్రెండ్స్"

"మనలాగా'' అన్నది కోమలి, మనసు బయటపడకుండా

## 34

కిరీటికి ఆప్తమిత్రుడైన గోపీనాథ్ అంటే కోమలికి గౌరవం ఏర్పడ్డది. కోమలి దృష్టికి కిరీటి, గోపీనాథ్ ఇద్దరూ మహా మనీషులైనారు. తనకు ఉత్సాహం, కొత్త బలం వచ్చింది. నూతనోత్తేజం కలిగింది. ఎప్పుడా, ఎప్పుడా అనుకుంటూ సాయింత్రవరకు గడిపింది. కిరీటి ఆ పూటనే వస్తాడని అంతరాత్మ చెబుతున్నట్లయింది.

సాయంత్రం వచ్చిన అతిధులతో కిరీటి వున్నాడు. అతను కిరీటే. చూడగానే 'హమ్మయ్య' అనుకుంది కళ్లు మూతలుపడ్డాయి. గుండె భారం దిగింది. అమాంతంగా సిగ్గు ముంచుకువచ్చింది. ఎదుటపడడానికి సంకోచం, భయం. అతను ఊహించి ఉండడు, తను ఇక్కడకు వచ్చినట్లు, ఇక్కడ వున్నట్లు. అలా పోతూ పోతూ తనదగ్గరకు వచ్చాడు.

"ఎన్నాళ్లుంటారు కోమలీ, బొంబాయిలో." చాలా సాదాగా అడిగినా, ఆ

గొంతులో మార్దవం, బాధ ఉన్నాయి. తను ఉండాలనే ఇష్టం ఆ ప్రశ్నలో తొంగిచూచింది. అతని ప్రేమ అగ్ని పర్వతంలాంటిది. లోలోపలే కుతకుత లాడుతుంది.

"ఇందిర పెళ్లికి వచ్చాను," సిగ్గుతో తలవంచుకుని అన్నది

"మళ్లీ నిన్ను కలుసుకునే వీలు ఉంటుందా ?''

"నే నిక్కడే వుంటాను."

"రేపు ఉదయం రానా ? అభ్యంతరం లేకపోతేనే.'

''రండి. ఉదయం ఎక్కడకీ వెళ్లను "

అంతే, అతను దూరంగా వెళ్లిపోయాడు. అతిధులంతా వెళ్లిపోయిన తర్వాత ఇందిర అడిగింది, "ఎలావుంది ఫంక్షన్ ?''

"నీ స్నేహితులంతా చాలా బిగ్ షాట్స్. నాకూ క్రమంగా ఈ కంపెనీ నచ్చుతోంది. తిరిగి వెళ్లాలనిపించటం లేదు."

'రేపు అసలు తీరిక వుండదమ్మాయ్. త్వరగా పడుకుందాం, నడు. రేపు గోపీనాథ్ ఇంట్లో లంచ్, రాత్రికి డిన్నర్. అన్నట్లు మరచిపోయాను. రేపు ఉదయం అమ్మా, నేను బయటకు వెళ్లాలి. ఇంకా కొందరు బంధువులతో పర్సనల్‌గా చెప్పి రావాలి నువ్వు మాతో వస్తావా ! లేక ఇంట్లోనే వుంటావా ?"

"ఇంట్లోనే వుంటాను. మీరువెళ్లండి."

కోమలికి వెంటనే పడుకోవాలని పిస్తోంది. అంటే వెంటనే నిద్రపోవాలని కాదు. పడుకుంటే ఒంటరిగా కలలు కన వచ్చు. ఆలోచించుకోవచ్చు. కిరీటిపై ఇష్టం కలుగుతోంది కిరీటిని గురించి తియ్యని ఊహలు కలుగుతున్నాయి. కిరీటి స్వభావం మారలేదు. హుందాతనం వచ్చింది. అప్పుడూ అతను అంతే తనే అర్థంచేసుకోలేకపోయింది. అప్పుడూ ఇంతే, పెళుసు, సీరియస్, మొండి. నిర్మొహమాటంగా మాట్లాడే స్వభావం. ఇప్పుడూ అంతే.

ఎంతో రిజర్వ్‌డుగా ఉన్నాడు. తనను చూచీ చూడనట్లే ఉన్నాడు. అసలు తన రాకనుగురించి అతనికి ముందే తెలుసేమో ! అమ్మా. ఈ నాటకంలో ఇందిరపాత్ర ఉన్నదా ? ఏమో! అతను తూచినట్లు మాట్లాడాడు. మిత భాషి. మనిషి చాలా అందంగా ఉన్నాడు. చదువు, రీవి, అధికారం, దర్పం, వర్చస్సు...అతనికేం తక్కువ. అతను కోరితే వేలమంది అమ్మాయిలు లభిస్తారు. కన్నెపిల్ల కోరదగిన లక్షణాలన్నీ ఉన్నాయి కిరీటిలో.

ఇప్పుడు కిరీటి అంటే అయిష్టం కల గడంలేదు ఆరాధన కలుగుతున్నది. ద్వేషంలేదు. ప్రేమ కలుగుతున్నది. అతన్ని ఏవగించుకోవడం అవివేకం. అతను కోరితే కాదని నిరాకరించడం



విజ్ఞతకాదు. అయితే కిరీటి ఇంకా తనను కోరుతున్నాడా అసలు. 'నేను పెరిగాను. మానసికంగా మారాను' అనుకున్నది. అతన్ని చూస్తే పవిత్రభావం కలుగుతున్నది. దేవాలయంలో దేవతామూర్తి వలె ఉన్నాడు ఆ తేజస్సు అనితరం నిజాయితీ, నిష్కల్మషత్వం అతనికి పెట్టని సొమ్ములు ఎన్ని గ్రంథాలు చదివాడో...నవ్వుకున్నది, నిద్రపోబోతూ.

* * *

మర్నాడు ఉదయం కోమలి నిద్ర లేచేసరికి, ఇందిర, ఆమె తల్లి సిద్ధంగా ఉన్నారు. రాత్రి చాలా సేపు మెలకువగా ఉండడంవల్ల తను ఆలస్యంగా లేచింది. ఇందిర తల్లి అన్నది కోమలితో, "అమ్మాయ్, మేం బధువుల ఇళ్లన్నీ తిరిగేసరికి టైం అవుతుందేమో. మళ్లీ ఇక్కడకు రావడానికి టైం ఉండకపోవచ్చు. మేం సరాసరి గోపీ బంగళాకు వెళ్లి కారు పంపిస్తాం. నువ్వూ వచ్చేయమ్మా"

"అలాగేనండీ" అన్నది కోమలి.

ఇందిర వచ్చి, అందుకు క్షమాపణ చెబుతున్నట్లు "ఏం అనుకోవద్దు కోమలీ, ఒంటరిగా వదిలేసి పోతున్నందుకు" కోమలి నవ్వింది

వాళ్లు వెళ్లాక, గబగబ కాలకృత్యాలు ముగించుకుని, స్నానంచేసింది. మంచి చీర కట్టుకుని, ముస్తాబైంది. పదిగంటలైంది కిరీటి రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నది. అతను రాకపోయేసరికి కొంచెంసేపు పత్రికలు తిరగేసింది. సర్వెంట్ వచ్చి "టిఫిన్ తెమ్మంటారా అమ్మా?" అని అడిగాడు.

"కొంచెం ఆగు...గెస్ట్ వస్తారు. వారు రాగానే తీసుకురా" అన్నది. అంతలోనే బయట కారు ఆగిన శబ్దం కాగా, అతను బయటకు పరుగెత్తాడు. మరొక

నిమిషంలో కిరీటి, అతని వెంట నౌకరు లోపలకు వచ్చారు.

"నమస్తే! కూర్చోండి" అని సోఫా చూపించింది కోమలి. అలా అనడం, మన్నించడం ఇబ్బందిగా వుంది.

నౌకరు వెంటనే కాఫీలు తెచ్చి, టీ పాయ్‌మీద పెట్టివెళ్లాడు. కోమలి ఒక కప్పు కిరీటికి అందిస్తూ 'తీసుకోండి' అన్నది.

''థాంక్స్...ఇందిరగారు లేరా!" అడిగాడు.

''వాళ్ల అమ్మగారూ, తనూ కలిసి ఎక్కడికో వెళ్లారు.''

"అయితే మనం నిరభ్యంతరంగా మాట్లాడుకోవచ్చు."

''వాళ్లు ఉన్నా అభ్యంతరం ఉండదు"

"కొంచెం చనువు తీసుకుంటున్నం దుకు మన్నించు కోమలీ. నిన్ను పరాయి వ్యక్తిగా భావించలేక, ఈ చనువు తీసు కుంటున్నాను. నీతో ఏమిచేమిటో మాట్లా డాలని రాత్రినుండి ఒకటే ఆరాటం రాత్రి అంతా నిద్రపోలేదు. ఏం మాట్లా డాలో, ఎలా మాట్లాడాలో అర్థంకాదు. అసలు నువ్వు మాట్లాడే అవకాశం ఇస్తావో, లేదోనన్న అనుమానం ఒకటి."

''ఫరవాలేదు చెప్పండి'' అన్నది, ఇష్టంగా.

''అసలు నిన్ను చూడగానే నువ్వే నని నమ్మలేకపోయాను కానీ వెంటనే గుర్తించాను. నిన్ను నేను ఎక్కడైనా గుర్తించగలను. నీ కళ్లలోని మెరుపు, ఆకర్షణ మారలేదు అప్పటికన్నా ఇంకా అందంగా ఉన్నావిప్పుడు కొంచెం పొడవు పెరిగావు. లావైనావు. నువ్వు ఇంత అందంగా ఉంటావని నేను ఊహిం చుకున్నాను. ఆఁ, ఏమిటో ఉద్యోగం చేస్తున్నావటగా?"

"అవును...చిన్న ఊరు. ఏడాది దాటింది సర్వీస్‌లో చేరి."

"ఉద్యోగం బాగుందా?''

"అదే బాగు. ఆ మధ్య అమ్మా, శకుంతల వచ్చి వెళ్లారు. శకుంతలంటే, మా చిన్న చెల్లెలు. మరచిపోయి వుంటారు. శోభకు, వాసంతికి పెళ్లిళ్ల య్యాయి."

"అవునట. విన్నాను."

"వాళ్లిద్దరికీ పిల్లలు ..రాజా కాలేజీలో చదువుతున్నాడు."

"వాళ్ల సంగతులు నేనడగలేదు నీ నీ సంగతి చెప్పు జీవితమంతా ఇలా ఉద్యోగం చేస్తూ, ఒంటరిగానే ఉండాలని నిర్ణయించుకున్నావా?"

"ఏం చెప్పమంటారు. ఇప్పుడేగా ఉద్యోగంలో చేరింది. రేపు ఏంజరుగు తుందో ఎలాచెప్పను. అన్నీ నేను అను కున్నట్లే జరుగుతున్నాయా? మనం అను కోని విధంగా, విధి నడుపుతుంది."

"ఇప్పుడు మనల్ని విధే కలిపిం దంటావ్ ?"

"అవకాశం వస్తే ఫారిన్ వెళ్లాలని వుంది."

"ఆ కోర్కె అప్పుడే తీరేదిగా... నాతో వస్తే బావుండేది ఆనాడే. నన్ను అపార్థంచేసుకున్నావ్. అప్పుడు ఫారిన్ వెళ్లడం పెద్ద కష్టమేం కాదులే."

"అప్పుడు అవివేకంవల్ల, అజ్ఞానం వల్ల కొన్ని పొరపాట్లు చేశాను."

"ఇప్పటికి గ్రహించావన్నమాట."

"జీవితం పాఠంనేర్పింది. మీగురించి చెప్పారు కాదు?"

"నిజంగా నా గురించి తెలుసుకోవాలని ఉందా కోమలీ?"

"లేకపోతే అడగనుగా?"

"నాన్న రిటైర్ అయ్యాడు. హైదరాబాదులోనే, ఆ ఇంట్లోనే ఉంటున్నారు అమ్మా నాన్న. నాగురించి ఏంచెప్పను. ఐ. ఎ ఎస్. ఆఫీసర్ని. ప్రభుత్వ యంత్రంలో ఒక భాగాన్ని. కొన్నాళ్ల కేరళలో, కొన్నాళ్ల పశ్చిమ బెంగాల్‌లో చేశాను. ఇప్పుడు బొంబాయిలో. ఢిల్లీలో సెటిల్ అవ్వాలని ఉంది. సెంట్రల్ సెక్రటేరియట్‌లో ప్రయత్నం చేస్తున్నాను.

"మీరు చాలా గొప్పవారని ఇందిర చెప్పింది" అంది నవ్వుతూ......

"పై వాళ్లు అలాగే అనుకుంటారు. కానీ అయినవాళ్లు అపార్థంచేసుకుంటారు. నా జాతకంలో రెండు మూడు గ్రహాలు వక్రించాయట."

కోమలికి నవ్వు వచ్చింది.

"నువ్వు కూడా నన్ను అర్థంచేసుకో లేదుగా కోమలీ, అలిగి వెళ్ళిపోయావు ఆనాడు......" టైంచూసి. "నే వస్తా కోమలీ! ఎవరైనా చూస్తే బావుండదు."

"ఫరవాలేదు. కూర్చోండి నాకు అలాటి భయాలు లేవు."

"మళ్ళీ కలుద్దాం...గుడ్‌బై ..."

"సో లాంగ్" అంటూ చేయి అందించింది కోమలి. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకోగానే శరీరంలో విద్యుత్ ప్రవేశించింది. ఆమె చేయి మెత్తగా ఉంది. వేడిగా ఉంది. ఆమె కళ్ళలోకి చూచాడు. చూచి నిలవరించుకోలేక పోయాడు. "వస్తా!"అని వెళ్ళిపోయాడు.

కిరీటి వెళ్ళిపోయాక అతనిగురించే ఆలోచిస్తూ కూర్చున్నది. ఎందుకలా సడెన్‌గా వెళ్ళిపోయాడు. తాముమాట్లాడుకున్నది స్వల్పం. తను అతనికి చేరువ కావాలనే అనుకున్నది. కానీ కాలేక పోయింది. పరాయి పురుషునితో మాట్లాడినట్లే మాట్లాడింది. చనువివ్వలేదు.అతను తనతో పరాయి స్త్రీతో మాట్లాడినట్లే మాట్లాడి వెళ్లిపోయాడు. చొరవ చెయ్య లేదు. చేస్తే తన అభ్యంతరం ఉండేది కాదు. తానుగాముందుకురాలేకపోయింది. పోనీ ఆయనకు నన్ను దగ్గరకు తీసుకో వాలనీ, కౌగలించుకోవాలనీ, ముద్దుపెట్టు

కోవాలనీ అనిపించలేదా? ఎవరూ లేరు గదా! తన కౌగిలిలోకి తీసుకుంటే తాను కాదు అనేది కాదు. నేను తన దాన్నే, ఆ హక్కు ఆయనకు ఉన్నది. ఆ హక్కు ఎప్పటికీ ఆయనకు ఉన్నదిగదా!

కిరీటి స్పర్శకోసం తను తహతహ లాడింది. అందుకే వెళ్ళిపోయే ముందు చేయి అందించింది గ్రహిస్తాడేమోనని. అలాగే చేయిపట్టుకుని, లాక్కుని తన గుండెలకు హత్తుకుంటాడని ఆశపడ్డది. ఆశ నిరాశ అయింది. అప్పుడూ ఇంతే, ఇప్పుడూ అంతే, చొరవలేదు. ధైర్యం లేదు. పెళ్ళాం దగ్గర అంత భయం ఏమిటో!

'మేం ఇలా స్నేహితులుగా ఉండి పోవలసిందేనా? ఎందుకుండాలి? ఎందుకు దూరదూరంగా బ్రతకాలి?'

పగలంతా ఆలోచనతోనే గడిపింది. గోపీనాథ్ ఇంట్లో లంచ్ బ్రహ్మాండంగా జరిగింది. ఇందిర కళ్ళన్నీ మొగుడిమీదే వున్నాయి. అతనికి కనురెప్పలా మెల గింది. నీడవలె తిరిగింది.

''ఏమిటి కోమలీ, చాలా హుషారుగా వున్నావ్. ఏమిటో విశేషం. నీ కళ్ళలో ఎన్నడూ చూడని తళుకులు, బెళుకులు కనిపిస్తున్నాయి......" అని అడిగింది ఇందిర.

"నీవు సంతోషంగా వుంటే, నాకూ సంతోషమే కదుటే," అన్నది కానీ అసలు సంగతి చెప్పలేదు.

కోమలి నుదుటిపై ముద్దుపెట్టుకుంది ఇందిర.

''రేపేనా పెళ్ళి! ఎంత ఆనందంగా ఉందో చెప్పలేను. జీవితంలో ఒక్క సారే ఇంత ఆనందాన్ని అమృతంలా సేవించగలం."

* * * *

పెళ్ళి ఏ ఆర్భాటం, ఆడంబరం లేకుండానే జరిగిపోయింది. అంతా నిమి షాలమీద పని. రిసెప్షన్‌కు కిరీటి వచ్చాడు. తను వచ్చిందే కోమలి కొరకే అన్నట్లు రాగానే కోమలిని బయటకు పిలుచుకు వెళ్లాడు. బయట తోటలోకి తీసుకు వెళ్ళాడు.

"ఇక్కడ కూర్చొని మాట్లాడు కుందాం, రా... ఇంకా డిన్నర్‌కు చాలా టైంవుంది. ఎన్నాళ్లుంటావోనిజంచెప్పు!''

అతను అడగడంలో ప్రార్థన, లాలింపు కనిపిస్తున్నాయి. ఆమెఅక్కడే వుంటానని చెప్పాలన్న కోరిక, వెళ్ళి పోతే తను బాధపడిపోతానన్న ధ్వని. అతన్నిచూచి జాలిపడ్డది కోమలి. అతని గుండెలపై తలవాల్చి, ''వెళ్లిపోను... ఉంటాను మీతోనే" అని ఏడవాలనిపిం చింది. కానీ అలా చేయలేకపోయింది.

"రాత్రికే వెళ్లిపోవాలనుకుంటున్నాను" తనేనా ఆ మాటలన్నది? ఎందుకన్నది! అయ్యో!!

"ఎన్ని గంటలకు ట్రయిన్?"

"పన్నెండు గంటలకు."

"మరొక్క రోజుఆగకూడదా!ప్లీజ్ "

"సరే, మీ ఇష్టం. ఉండ మంటే ఉంటాను. అర్జంటుగా వెళ్లాలని ఏం లేదు."

"నీతో ఏకాంతంగా మాట్లాడాలి కోమలీ! ఇందిరా, గోపీ వెళ్లిపోగానే మనం కలిసి బయటకు వెళదాం మన కారున్నదితే ఫరవాలేదు."

"ఎక్కడికి?"

"సినిమాకో, హోటల్‌కో... అసలు నా బంగళాకే తీసుకు వెడదామను కున్నాను. కానీ నీవు ఏమనుకుంటావోనని భయం."

"నేనంటే భయపడుతున్నారా! అంత భయంకరంగా కనిపిస్తున్నానా?"

"అదిగో మళ్ళీ మొదలు. అన్నిటికి విపరీతార్థాలు తీస్తావు. నీతో వచ్చిన చిక్కే అది. అందుకే నిన్ను చూస్తే భయం నాకు. నోరు విప్పలేను. తీరా మన ఇంటికి వెడదాం రమ్మంటే నీకు కోపం రావచ్చు."

"మీ ఇష్టం. పదండి వస్తాను. ఎక్కడకు రమ్మన్నా, రావడానికి రెడీ "

ఇద్దరూ విడివిడిగా వెళ్లి పార్టీలో కూర్చున్నారు. అక్కడి నుండి కోమలి మేడపైకి వెళ్లి, తన బట్టలు పెట్టెలో సర్దు కుంది. వెళ్ళడమా, మానటమా! మరొక మహదావకాశం వచ్చింది. కూడలి ... ఎటువెళితే బాగుంటుందో మనసు నిర్ణ యించింది. ఆనిర్ణయాన్ని వివేకం అంగీక రించాలి. నాలిక చెప్పాలి. ఇందుకా నేను బొంబాయి వచ్చింది?' ఇది జీవి తంలో మరొక మలుపు.

ఇల్లంతా సందడిగా వుంది. అతిధులు గుంపులు గుంపులుగా చేరి మాట్లాడు కుంటున్నారు. కొందరు తోటలో లాన్ మీదికి చేరారు. ఇంటిముందు రోడ్డుమీద కారులు బారులు తీర్చి నిలిచి ఉన్నాయి. గేటు ఎదురుగా గోపీనాధ్ కారున్నది. కోమలి ఇందిర కోసం చూచింది. ఎక్కడా కనిపించలేదు. చివరకు పట్టు కుని, 'విష్ యు హాపీ మారీడ్ లైఫ్' అని ముద్దుపెట్టుకుంది.

ఇందిర, గోపీనాధ్ వచ్చి, తమకోసం ప్రత్యేకించిన కారులో కూర్చున్నారు. వెంటనే కారు బయలుదేరింది తర్వాత అతిధుల కార్లు ఒకటొకటీ బయలు దేరాయి.

కిటికీవద్ద నిలబడి తోటలోకి చూస్తు న్నది కోమలి తనే ఆ ఇంటి మనిషి అయినట్లు, ఇందిర పరాయిదయినట్లు తోచింది. హైదరాబాదులో తమ ఇల్లు జ్ఞాపకం వచ్చింది. ఆనాడు తనకూకిరీటికి మధ్య జరిగిన సంభాషణ జ్ఞాపకం వచ్చింది. ఇద్దరూ పొరపాటు చేశారు. అతను పిరికితనంతో, తను అవివేకంతో ఇద్దరికీ సడలని పట్టుదలే.

నిజమే, ఆనాడు కిరీటి బలవంతంగా తనను ముద్దుపెట్టుకున్నాడు. తను కసిరి కొట్టింది. అది జ్ఞాపకం ఉండే నిన్న

చొరవచేయలేదు. అతనికి తెలీదు, తను మనసు మార్చుకున్నదని, తనకు ఇష్టమే నని. హరనాథ్‌తో అనుభవాలు జ్ఞాపకానికి వచ్చాయి. అతని స్థానంలో ఇప్పుడు కిరీటిని కూర్చోపెట్టింది. తన హృదయంలో హరి వదిలినచోట కిరీటి నిలబడ్డాడు. గత జీవితం, ఇన్నేళ్ల బాధలు కరిగిపోయాయి. భవిష్యత్తు ఉజ్వలంగా మెరుస్తున్నది.

'నా ఓటమిని అంగీకరిస్తాను. ఆయనకు లోబడి పోతాను కిరీటి నా భర్త. నాకు కిరీటి కావాలి. దూరంగ ఉండి నే బ్రతకలేను. ఎంతకాలమని ఈ పంతాలు, పట్టింపులు! ఎంతైనా నేను స్త్రీని. ప్లీజ్ కిరీటి నన్ను స్వీకరించు!' అనాలనుకున్నది. అంటే తప్పులేదు. నా భర్త గనుక, ఇలాటివి మనసులో పెట్టుకుని, బాధించరు. ఆయన నన్ను క్షమించగలరు.

కోమలిని చూచి కిరీటి మేడపైకి వచ్చాడు.

"రెడీయా కోమలీ"

"నేను రెడీ''

ఇద్దరూ మేడ దిగి వచ్చారు.

కారు స్టార్టువేస్తూ "ఎక్కడికి పోదాం చెప్పు'' అని అడిగాడు.

"ముందు ఒకసారి సముద్రతీరానికి, తర్వాత మీఇష్టం.''

కొన్నిమైళ్ళు నిశ్శబ్దంగా గతంలోకి జారిపోయాయి. ఇద్దరూ సముద్రతీరానికి చేరుకున్నారు. అలలఘోష బయట, లోపల.

'నీతో మాట్లాడాలి కోమలీ. నీవు సముద్రంలోకి చూస్తూ మైమరచి పోతున్నావు, పక్కన నేనున్నాను.'

నవ్వింది. "సముద్రం, ఆకాశం, దూరతీరాలలో ప్రేయసీప్రియుల్లా కలుసుకుంటున్నాయి.''

''నిజం కోమలీ, నీ హృదయంలో ఏమున్నదో తెలుసుకునే అవకాశమే లభించలేదిన్నాళ్లు. నీది కవితా హృదయం. నీవు చాలా ఆనందంగాఉన్నావు. సంతోషంగా ఉన్నావు. కానీ వెళ్ళిపోతానంటున్నావు ..." ఆశగా కోమలి కళ్ళలోకిచూశాడు. అతని కళ్లలో నీరు తిరిగింది

''వెళ్లమంటారా! నిజం చెప్పండి. మీరు వెళ్లమంటేనే వెళతాను " అంటూ తలవాల్చింది. కన్నీటి బొట్లు, అతని పాదాలపై రాలిపడ్డాయి.

"కోమలీ! ఏడుస్తున్నావా?"ఆత్రంగా అడిగాడు.

"లేదండీ ... ... ఆనందం కరిగి కన్నీరైంది. మీరు వెళ్లవద్దని శాసించండి. ఎక్కడికీ పోను, ఇక్కడే వుంటాను."

''కోమలీ''అంటూ కిరీటి ఆమెను తన హృదయానికి హత్తుకున్నాడు ఆ క్షణం కోసమే ఎదురు చూస్తున్నట్లు. 'పదండి మన ఇంటికిపోదాం...'' అన్నది.

'ఇవాళ ఇందిరకే కాదు నాకూ తొలిరేయే' అనుకున్నది.

——

(సమాప్తం)

## అబల కథ

"గతాన్ని విస్మరించడమే సుఖప్రదం గోదా...! గంటక్రితం జరిగింది జ్ఞాపకం ఉంచుకోవడం నాకు సరిపడదు; నువ్వూ అలాగే అన్నీ మర్చిపోయి గలగలా గోదావరిలాగ నవ్వుతూ ఉండాలి, కాలక్షేపానికి కథ వింటూ అన్నీ మర్చిపోవచ్చు, చెప్తున్నాను—" అంటూ సాగరం మొదలుపెట్టాడు...

'అబల ఇష్టంలేని పెళ్లి తప్పించుకోడానికి యిష్టమున్న అహోబలంతో పారిపోయింది.

ఒక ఊళ్లో అబలను వొదిలేసి అహోబలం మాయమైపోయాడు.

చీకట్లో రౌడీలు వెంటాడుతుంటే, ఇల్లుకంటే గుడి పదిలం అన్నట్లుగా కనిపించిన ఆంజనేయస్వామి గుడిలో దూరింది. గజవాహనం చాటున దాక్కుంది. రాత్రి ముదురుతోంది.

పూజారి వెళ్ళిపోతూ తలుపులు మూసి తాళం వేస్తూంటే, కటకటాల్లోంచి లోపల మెరుపు మెరిసినట్లుగా అబల కనిపించింది.

మరికొంచెం రాత్రి కానిచ్చి పూజారి తలుపులు తెరిచి లోనికొచ్చి మళ్ళీ తలుపులు బిగించి, పోతపోసిన బంగారు బొమ్మలాఉన్న అబలను కళ్లార్పకుండా చూస్తూ నిలబడ్డాడు.

అబల భయంతో గజగజలాడిపోతూ చేతికి దొరికిన దేన్నో అతనిమీదకు విసిరింది. అది జేగంట వాయించే కర్ర ముక్క. గురి తప్పి సిందూరం పూసిన ఆంజనేయుడి విగ్రహం గ్గిర అరటి పళ్లారగించడంలో నిమగ్నమై ఉన్న కోతికి తగిలింది. దానికి ఏదో తగలగానే అదీ అక్కడున్న పెద్ద కంచుగంటతీసి విసురుగా గిరాటేసింది. ఆ గంట పూజారి నుదిటి కణతలకు బలంగా ఢీకొని, పూజారి తెలివితప్పి కిందపడిపోయాడు. గంట అంచు గీరుకోని తలనుండి రక్తం కారుతూంది.

ఆ కోతి ఎప్పుడు దూరిందో, అది కూడా గుడిలోనే ఉండిపోయింది.

అబలకు ఆ పూజారిముఖం చూస్తే ఏమనిపించిందో మరి, ఉద్ధరిణతో నీళ్ళు తెచ్చి ముఖంమీద చల్లి చెరగు తడిపి నుదురు తుడుస్తూంటే పూజారి కళ్ళు తెరిచి, "అమ్మా! స్వామి నన్ను శిక్షించాడు, బుద్ధి చెప్పాడు. వక్రమార్గంలో పడబోతున్న నన్ను రక్షించాడు. నీ పాదాల్తోకూడ నా నెత్తిని తొక్కి క్షమాభిక్ష పెట్టు తల్లీ! ఈరక్తం సాక్షి, ఆ స్వామి సాక్షి, నీ తండ్రినో, అన్ననో అనుకో! నన్ను నమ్మ తల్లీ. పక్కనే ఇల్లుంది, చేర్చు తల్లీ," అంటూ

అబల పాదాలు పట్టుకున్నాడు. అబల ఊత యిచ్చి నడిపించింది. తలుపులు తెరవగానే ఒక్క గెంతున తుర్రుమని అవతలకు దూకింది కోతి.

ఆ కోతికి చేతులెత్తి జోడించాడు పూజారి.

* * * *

పూజారిని బావాజీ అనిపిలుస్తుంటారు. బావాజీకి ఎవరూ ఉండరు. దిక్కులేని పిల్లవాడుగా దొరికితే వెనకటి బావాజీ పెంచి తన తర్వాత పూజారిగా చేశాడు. ఆ ఆలయానికి ఒక నియామకం వస్తూ ఉంది. పూజారి చచ్చేంతవరకూ బ్రహ్మచారిగా ఉండాలి. గుడికి మాన్యాలు, ఆదాయాలు ఉన్నాయి. పూజారికి యిష్టం వచ్చినంత ఖర్చు చేసుకోవచ్చు. బ్రహ్మచర్యంతో పవిత్రంగా ఉండాలి. బావాజీ చిన్నప్పట్నించీ మానసికంగా కూడా మంచి కట్టుదిట్టంగా పెరిగాడు. మంచి బలశాలి. హనుమంతుడికి తగ్గ పూజారి అనిపిస్తాడు.

బావాజీ మాట తప్పలేదు. అబలకూ విశ్వాసం కుదిరింది. 'నాన్నా!'అంటుంది. కుమార్తె దొరికిందని బావాజీ సంతోషిస్తున్నాడు కాని, కాకిగోల ప్రారంభమైంది-పూజారి ఎవత్తెనో పెట్టుకున్నాడని.

అబల ఉత్తమనిషి కాదు. తన అహో బలం తన్ను వెతుక్కుంటూ వస్తాడనే ఎదురుచూస్తున్నది. తనమూలంగా బావాజీ మాట పడుతున్నందుకు కటకటపడ తూనే ఉంది.

"వస్తాడు తల్లీ! తప్పక వస్తాడు. అంతవరకూ యీ నాన్న ఆశ్రయం కాదని వెళ్ళిపోబోక!" అని బావాజీ అబలను ఆపుతూనే ఉన్నాడు.

కాని గోల చెలరేగుతూనే ఉంది. ఎనిమిది నెలలు దొర్లాయి. అబల ఒక బుల్లోడిని ప్రసవించింది.

* * * *

ఆ బుల్లోడు బావాజీకి ప్రాణం. 'పావనుడు' అని పేరెట్టాడు. సూర్యోదయంవేళ వాడిని యెత్తుకొని ఎర్రటి బింబాన్ని చూపిస్తూ, "ఎగురు నాయనా! ఎగురు, దాన్ని పట్టుకో." అని అంటూ ఉంటే—

"ఏం బావాజీ! నీ కొడుకా! వాయుదేవుడికొడుకా?"అని యెకసెక్కెంచేస్తూ పారిపోయేవాళ్లను బావాజీ అజ్ఞానులు అనుకొనేవాడు, అంతే.

బావాజీకి కొన్ని పనులు వచ్చును. అట్టలు కత్తిరించి, కుట్టి, రంగులు వేసి హనుమంతుడి కీలుబొమ్మలు చేస్తాడు. రంగు కాగితాలతో ఆటవస్తువులు చేస్తాడు. కర్పూరం పూసలు చేసి పట్టుకుచ్చులు తీసి హారాలు కడ్తాడు. తాళ్లతో వల ఉయ్యాళ్లు వేస్తాడు. అలాంటివి చేసి ఇప్పుడు డబ్బులు పుచ్చుకుంటున్నాడు

బావాజీ దగ్గిర అలాంటి పనులన్నీ అబల నేర్చుకుంది. వాటిని చేసి గుడి



దగ్గిర పెట్టి అమ్ముతుంది. తనకూ పిల్ల వాడికీ స్వయంగా సంపాదించుకోవాలని అబల తాపత్రయం. పూసలతో హారాలు అల్లుతుంది, బట్టలమీద బుటాలు కుట్టి యిస్తుంది. రంగు కుంకాలు చేసి అమ్ముతుంది.

అబల రాకపూర్వం బావాజీ దక్షిణలు కూడా పైసా సొంతానికి ముట్టేవాడు కాదు. ఎప్పుడైనా అబలకోసం పిల్లవాడి కోసం తీసుకోడానికి లోపల మొగమాట పడిపోతూనే ఉన్నాడు.

బొమ్మలు ఆటవస్తువులు చేసి అదివరకు గుడికి వచ్చే పిల్లలకు ఊరికే పంచి పెట్టేవాడు. అదిచూసి "పెళ్లి సంసారం పనికిరాక పోయిందిగాని, బావాజీకి పిల్లలంటే ఎంత అపేక్ష!" అని అన్న నోళ్లే "బావాజీకి సంసార తాపత్రయం పట్టుకుంది. పాపం, ఎంతవారలైనా శ్రీ కాంతదాసులే కదా!" అనడం మొదలు పెట్టాయి.

'ముసలివాడి కింద కనక్కానక మొగ పిల్లాడినే కనేసిందే'—అంటుండొక ఆడ పిల్లల్నే వరసగా కంటున్న ఇల్లాలు.

'దేముడిసొమ్ము చాలక ముసిలాడిని కూడా కష్టపెడుతూన్నదే!'

'ఇలాంటి వాళ్లంతా నాలుగు పైసాలు చిక్కించుకొని ఉడాయించే రకమే, చూడవూ!'

'పిల్లాడిని వొదిలేస్తుందో, లాక్కెడుతుందో?'—ఇలాంటి మాటలు చెవుల్లో పడక తప్పనప్పుడు అబల పడే బాధ వర్ణనాతీతం

* * * *

ఒకనాటి సాయంత్రం అబల పిల్లాడిని ఎత్తుకొని ఉంది. ఆ దారినే వస్తూ కనిపించాడు అహోబలం. గొంతె త్తిపిలిచింది. చూశాడు. వెంటనే తనను కాదన్నట్టు ముఖం తిప్పేసుకొని వెనక వస్తూన్న రంగు రంగుల వయ్యారి వాళ్ల తెగ ఊపుకొంటూ వచ్చి చేరగా గబగబా

అడులేగుస్తూ వెళ్తున్నాడు. అబల ఆ వెనకనే పిల్లాడితో అనుసరించింది. వాళ్లు బసచేసిన లాడ్జిమెట్లెక్కి వెళ్లారు. అబల పిల్లాడితో మెట్లదగ్గర నించునిఎదురు చూస్తోంది. చాలా సేపటికి అహోబలం దిగుతున్నాడు.

అబల కొండంత ఆశతో ఆనందంతో తొట్రుపడే గొంతుతో పావనుడిని ఎత్తి చూపుతూ "ఇదుగో! నీ కొడుకు!..." అంది.

అహోబలం దెయ్యాన్ని ఎదుర్కొన్న వాడిలా చూస్తూ, "ఎలా నమ్మమంటావు! ఎవరికొడుకో ఎవరికి తెలుసు? నువ్వేం మడికట్టు కూర్చున్నావా యేం యిన్నాళ్ళూ?" అంటూ తిరిగి మెట్లెక్కి వెళ్లిపోయాడు.

"ఔను! ముమ్మాటికీ నీ కొడుకు కాడు! నా కొడుకు! వీడు అబల కొడుకు," అని అంటున్న అబల కళ్లు ఆ చీకటిలో ఎంత ఎర్రగా నిప్పుల్లా మెరుస్తున్నాయో అహోబలం చూడనే లేదు.

* * * *

"అమ్మా! పావన్ తండ్రి ఎవరని అడిగితే నువ్వేం చెప్తావు? లోకం కోడై కూస్తున్నమాటకే తల ఒగ్గకతప్పదా?" అన్నాడు బావాజీ.

"నువ్వు మాత్రం ఆ అసత్యం భరించ గలవా నాన్నా" అంది అబల.

"ఆనాడు ఆ రాత్రి నా ప్రవర్తనకే సిగ్గుతో కుమిలిపోతున్నాను, దానికి యిది తోడనుకుంటాను. స్వామి విధించిన శిక్ష అనుకుంటాను. అంతకంటే యేం చెయ్యగలను. పోతే పూజారిపని పోతుంది, అంతే కద!" అంటూ నిట్టూర్చాడు బావాజీ.

"వద్దు నాన్నా! ఒద్దుగాక ఒద్దు! హేయమైన అసత్యాన్ని యెంతమాత్రం మనం ఒప్పుకోవద్దు. నేనొక హీనురాలిని అనిపించుకోడానికి యిష్టంతోనే సిద్ధంగా ఉన్నాను. నేనొక స్త్రీని. ఒక బిడ్డతల్లిని. పావన్‌కి చెప్పుకోదగ్గ తండ్రి లేడు. లేడు, లేడు. నేను యిప్పుడు అబలను కాను. నన్నూ నా బిడ్డనూ పోషించుకో గల ఉపాయాలు, సంపాదన నాకు చేత నవును. వెనకటి ఆ అబలను నాలో నుంచి తరిమేశాను," అంది అబల ఆవేశంగా.

"నువ్వు తరిమేసినా దాన్ని సమ యానికి ఉపయోగించుకొంటుందమ్మా! నువ్వు తరిమేసిన అబలను దాచిపెట్టుకొనే ఉంటుందమ్మా లోకం!" అన్నాడు బావాజీ.

"నన్ను పిరికిదాన్ని చెయ్యకు నాన్నా!" అంది అబల.

* * * *

బావాజీ యిప్పుడు తాతయ్య. పావన్‌ని వీపుమీద ఎక్కించుకొని స్వారి చేస్తూ ఆనందిస్తాడు. ఎవరేమన్నా పట్టించుకోడు. అబల దేన్నీ లక్ష్యపెట్ట



లేదు. గుడిదగ్గిరే చిన్న దుకాణం పెట్టు కుంది. తనకూ పిల్లాడికీ తగినంత దాని కంటే ఎక్కువే తెచ్చుకోగలుగుతున్నది.

ఒకనాడు అహోబలం బొంబాయి సినిమాల్లో కథానాయకుడి వేషంలాగ ఎక్కడ్నుంచో తూలుతూ ఊడిపడ్డాడు వెంట అతడితో నాటకాల్లో నటిస్తున్న వయ్యారి కూడా వచ్చింది. అబలను ఎగా దిగా చూసి, ''ఫర్వాలేదు, చిన్నచిన్న వేషాలకు పనికొస్తుంది. వంటకూడాబాగా చేస్తుందిగా? పనికొస్తుంది!" అంది.

అహోబలం అబలనుచూస్తూ వెకిలిగా నవ్వి "మరేం-నువ్వూ కళారంగంలో దిగితే బాగుంటుంది. పిల్లాడ్నిక్కడ వొదిలేసెయ్యి, నాతో వచ్చేయి..." అని యేదో అనబోతుంటే అబల రౌద్ర రూపిణిఅయింది. అదిచూసి, అహోబలం మళ్లా, - "పోన్లే పిల్లాడితోనే వచ్చే సెయ్యి,...," అంటూంటే అబల బుర బుర చూస్తూ "నువ్వెవరో నాకు తెలీదు, ఇక్కణ్ణించి వెళ్ళిపో! ఫో," అంటూంటే అహోబలంతో వచ్చిన వయ్యారికూడా తోక ముడిచింది. గెంతుతూన్నట్లుగా అహోబలం నటీమణితో వెళ్ళిపోయాడు.

బావాజీ అంతా చాటునుంచి వింటూనే ఉన్నాడు. 'పావన్ వెళ్ళిపోతాడు, వెళ్ళడూ మరి," అని తనలో తనే గొణుక్కుంటున్నాడు.

"అరే! పావనా, అప్పుడపుడు మన ఆంజనేయస్వామిని చూడ్డానికి రావాలి సుమీ! సిందూరం బొట్టు నాచేత పెట్టించు కోవాలి సుమీ!" అంటున్నాడుపావన్‌తో. వాడికేం తెలుస్తుంది, బిక్క ముఖం వెయ్యడం తప్ప.

"నాన్నా! మరెపుడూ అలా అనకు!" అంది అబల కోపంగా.

"అదేం మాట అమ్మా! వెళ్లవూ

మరి, పావన్‌ని నాన్న దగ్గిరికి తీసుకెళ్లవూ మరి?" అన్నాడు బావాజీ.

"వాడికి నాన్నంటూ లేడు. నేను వాడి తల్లిని. అంతే. నాకు చరిత్ర లేదు. గతం లేదు. నేనొక చరిత్రహీనురాల్ని కాని ఒక తల్లిని,-ఒక ఆడ మనిషిని తన మీద తనకు గల అభిమానాన్ని వొదులుకోలేని నిండుప్రాణిని, నువ్వు కూడా నన్ను అసహ్యించుకొంటే ఎక్కడో ఉంటాను..." అని అబల ఆవేశంతో అంటూంటే బావాజీ, "కాదమ్మా, అది కాదు, పావన్ కోసం...'' అంటూంటే, అబల, "పావన్ తల్లిని నేనున్నాను. నేనొక్కత్తెనూ చాలనా? నా పావనుడికి నేను గాక యింకెవరు? ఎవరి అవసరమూ అక్కర లేదు," అంటూన్న అబలను ఆశ్చర్యంగా చూస్తూ బావాజీ మరేం నోరు విప్పలేక పోయాడు.

* * * *

అహోబలం మళ్ళీ మరో రాత్రి నిషా మీద తూల్తూవచ్చాడు. "అది ఒత్తిపోగరు బోతుముండ, కోటా ఆరంగుళాల దళసరి ఎక్కించినా తేటురాదు. నీకే యింకా మేకప్ చేస్తే అంతా బలాదూర్, ఏ మేకప్ లేకుండానే స్టేజిమీద కెక్కితే చాలుఅంతా కనకవర్షమే మనకు..." అంటూవాగుడు మొదలెట్టాడు.

"నేను రాను. నువ్వెప్పుడూ రాకు!" రెండే మాటలు అంది అబల.

"వాడు నా కొడుకే! ఒప్పుకుంటాను.''

'అవసరంలేదు_'

"నాకుంది, వాడు వాడు నాకొడుకు నువ్వు వాడి తల్లివి!"

'వాడు నీకొడుకు కాడు, వెళ్ళు!'

'నా కొడుకును లాక్కెళతా!' అంటూ అహోబలం పావన్‌ని ఎత్తుకొని చీకట్లోకి పారిపోతూంటే, పిల్లవాడు గగ్గోలుగా ఏడుస్తూన్నది విని, బావాజీ పరుగున వెళ్ళి అహోబలంచేతిని ఒక్క పట్టు పట్టాడు. ఆ పట్టుకి అహోబలం కిరకిర లాడ పిల్లాడిని జారవిడిచి, "హనుమంతుడి పూజారి పనిపించుకున్నావురా బావాజీ!" అంటూ చీకట్లోకి పరుగు లంకించుకున్నాడు.

హనుమంతుడు తోకతో అలాగే రాక్షసుల్ని బట్టిఉంటా డనిపించింది కాబోలు అహోబలానికి.

* *

బావాజీ నిజాయితీ పట్ల నమ్మకం ఉన్న క్షీరసాగరం అనే శ్రీమంతుడు ఆలయంట్రస్ట్‌లో ప్రముఖుడు. బావాజీకి ఆసరాగా నిలబడ్డాడు. లేకుంటే బావాజీ పూజారితనం విడిచిపెట్టక తప్పేదిగాదు. కాకిగోల కూడా కట్టిపోయింది. ఆ శ్రీమంతుడు అందరిలాంటివాడు కాడు. విశాలమైన మనస్సు, సంస్కారం గల ఆశయాలు గలవాడు. స్కూల్లో చేర్పించినప్పుడు పావన్ తండ్రిపేరు ప్రసక్తి వచ్చింది. అబలను అడిగితే పావనుడు



అబలకొడుకు అని వ్రాసుకోమంది. అంతే క్షీరసాగరమే ఏదో సర్దిపుచ్చి పావనుడిని స్కూల్లో చేర్పించాడు.

క్షీరసాగరానికి ఒకే ముద్దుల కూతురుంది—శ్రీదేవి. పావనుడితోటి యీడు పిల్ల.

చిన్నతనం నించీ యిద్దరికీ మంచి చెలిమి. తోడుగాచదువుకున్నారు జోడుగా పెరిగారు. వాళ్ల స్నేహలతబలంగా అల్లుకొని అనురాగపు మొగ్గ తొడిగింది.

కాలం గిర్రుగిర్రున తిరిగింది.

పావనుడు యిప్పుడు బాగా చదువుకున్న యువకుడు. శ్రీదేవికి పావన్‌మీద చెప్పలేనంత మమత. 'చేసుకుంటే నిన్నే చేసుకుంటాను!' అన్నది పావన్‌తో. శ్రీదేవి చాలా పట్టుదలగలపిల్ల. తండ్రితోనూ ఆ మాటే చెప్పింది.

*　*　*　*

'అమ్మా! నాకు తండ్రి ఎవరు?' అడగలేక అడగలేక అబలను పావనుడు అడిగిన ప్రశ్న, తల్లిని కుమారుడు అడిగిన ప్రశ్న!

"నేను నీకు తల్లిని, నీ తల్లిమీద నీకు సానుభూతి ఉంటే మరేమీ అడగకు!" అంది అబల.

"శ్రీదేవి పెళ్ళి అని పట్టుబట్టి కూర్చుంది. తండ్రి ఎవరో తెలీని నేను ఏ ముఖంపెట్టుకొని వంశమూ, గౌరవమూ గల ఒక శ్రీమంతుడి కూతుర్ని చేసుకొని అన్యాయం చెయ్యగలను?

అందుకే అడగాల్సి వచ్చిందమ్మా!" అన్నాడు పావనుడు.

"స్త్రీని మాతృదేవత అనడమేగాని, ఆ మాతృమూర్తిని విడిగా మాతృమూర్తి గానే ఎందుకు చూడరు? ఈ బిడ్డ ఫలాని వాడిదని అప్పగింత పెట్టక తప్పదా? తండ్రి ఎవరో తెలీకుండా మనిషిమనిషిగా బతకడానికి ఎందుకింత అలజడి? తండ్రి కున్న విలువ తల్లి కెందుకు యివ్వరు? అసలు ఈ ప్రశ్న ఎందుకు రావాలి?...' అని అంటున్న అబలతో బావాజీ.

"లేదమ్మా! ఇది పురాణకాలంనుంచీ వస్తూన్న ప్రశ్నే. సత్రంలో దాసిగా ఉన్నతల్లిని నారదుడు ఇలాగే అడిగాడు. బిడ్డల్ని కన్నతల్లులు ఏ వాయుదేవుడి పేరో, ధర్మదేవత పేరో చెప్పక తప్ప లేదు. ఈ బిడ్డ బిడ్డ అంటే చాలదు, ఫలానివాడి బిడ్డ అనిపించుకోకపోతే ఆ తల్లికన్న బిడ్డకు ఆదరణలేదు. ఈ విష యంలో మాతృమూర్తి ఎప్పటికీ అబలే! నీతుల్ని, ధర్మాల్ని, సమాజాన్ని నిర్మిం చినవాళ్లు తల్లికి అంతే రాసిపెట్టారు..." అంటూ ఆయాసంగా ఊరుకున్నాడు. అంపశయ్యమీద భీష్ముడిలాగ ఆ క్షణం కోసం చూస్తున్నాడు బావాజీ

"నాయనా! నీకిష్టంలేకపోతే అమ్మా అని నన్ను పిలవకు! ఒకటిమాత్రం నమ్ము! ఆ చిన్నదాని ప్రేమ నిజమైన ప్రేమే అయితే నువ్వొక పతిత కుమా రుడివనిగాని, నీ పుట్టుపూర్వోత్తరాలు గాని పట్టించుకోదు. నిన్ను నిన్నుగా ఒక మనిషిగా గుర్తించుతుంది... " అని అబల అంటున్నప్పుడే, "నిజం!"అంటూ శ్రీదేవి లోపలికొచ్చింది. "మానాన్న ఏ మనుకున్నా సరే, నేనూ-పావన్,అంత కంటే అవసరమైందేమీలేదు. అందుకే వచ్చేశాను!" అంది శ్రీదేవి.

అబల కళ్లనుండి ఆనందబాష్పాలు ముత్యాల్లాగ మెరిశాయి.

"కాని—నేను మాత్రం సిద్ధంగాలేను. ఇంతకంటే ఏ ముక్కూ మొహం తెలీని చోట నన్ను పోసింది!" అన్నాడు పావ నుడు తలవంచుకొనే.

"పావన్! ఇంతేనా నీ మానవత? ఇంత పిరికివాడివా! ఆడవాళ్లపట్ల మీ కెందుకింత జాలిలేనితనం? మీ మగజాతి పట్ల అభిమానాన్నే చూపించావు గాని, తల్లిపట్ల కొంచెమైనా సానుభూతి లేదా? నిన్ను నువ్వు హీనంగా చూసుకోవలసిన అవసరమేం వచ్చిందిప్పుడు? ఇప్పుడు నేనే నిన్ను చేసుకోలేను, తెలిసిందా?!" అని శ్రీదేవి విసురుగా పోబోతుండగా, "తొందరపడకమ్మాయి! నేనూవిశాలంగా ఆలోచించే, మీ ఇద్దరినీ ఆశీర్వదించ డానికే వచ్చాను. పావన్‌ని పావన్‌గానే చూస్తున్నానుగాని మిగతావాటి ప్రసక్తి నాకులేదు," అంటూ క్షీరసాగరం లోపల కొచ్చాడు.

సరిగా అదే సమయానికి ద్వారం దగ్గిర అహోబలం వచ్చి నిలబడ్డాడు.




మనిషి వాలకం బాగా దిగజారిపోయి ఉన్నది.

పావన్ శ్రీమంతుడి అల్లుడుకాబోతున్నాడని తెలిసి అవకాశాన్ని వినియోగించుకొని ఏమైనా లాభం చిక్కించుకోవచ్చని వెతుక్కుంటూ సమయానికి దిగబడ్డాడు. ఆర్థికంగా చాలా యిబ్బందుల్లో ఉన్నట్టు కనిపిస్తున్నాడు

"ఎవర్నువ్వు?" అని అడిగాడు శ్రీదేవి తండ్రి.

"వాడి తండ్రిని!–పావన్ తండ్రిని!" అని అంటున్న అహోబలాన్ని మృత్యువును చూసినట్టు కంపించిపోయింది అబల.

అహోబలం చూపుడువేలు అబలకు గురిపెడుతూ, "మా గతం అంతా చెప్తాను..." అంటూ ఏదో చెప్పబోతూండగా, అబల కంపిత స్వరంతో అరుస్తూన్నట్టుగా, "లేదు, నాకు గతం అంటూలేదు. చరిత్రహీనురాల్ని! పతితను......నాన్నా!" అంటూ బావాజీ పాదాలదగ్గిర కుప్పలాగ కూలిపోయింది. అబలలో చలనంఆగిపోయింది. 'అమ్మా!' అంటూ బావాజీ అబలతలమీద చెయ్యివేసి నిమురుతూంటే అబల ఒళ్లు చల్లగా తగిలింది.

"కాదుబాబూ! అబల పతితకాదు!... స్వామీ! క్షమించు!" అంటూ వొణుకుతున్న చేతులెత్తి ఆంజనేయస్వామి గుడివేపు నమస్కరిస్తూ ఆయాసంతా బెక్కి అలాగే కళ్లుమూశాడు, అంతే"–అంటూ సాగరం ముగించాడు.

గోదావరి "అంతేనా?" అన్నట్లు చూసింది.

"ఏం ముగింపు బాగా లేదుకదూ?" అంటూ గోదావరి ముఖంలోకి చూశాడు. గోదావరి ముఖం గంభీరంగా ఉంది.






ఎన్నడూ చిర్రున చీదిఎరుగని మా అత్తయ్య మంచం పట్టింది. ఇంట్లో గంటెడు గంజి కాసిపోసేవాళ్ళుకూడ కరువైపోయారు. నేను ఒక్కణ్ణేఅయితే అంత యిబ్బంది వుండేదికాదు. మా నాన్నగారు మూడుకాళ్ళ ముసలి. ఆయన కెప్పుడూ ఏదో ఒకటి ఆజీలుగా ఒక మనిషి అందిస్తూ వుండాలి. పైగా ముప్పూట తినే జీతగాడు-వ్యవసాయం.

చేతులు కాల్చుకోవలసివచ్చినా నాకు కష్టమనిపించలేదు. కాని మా అత్తయ్యదే పెద్ద చిక్కు. మంచంమీదకాలు కింద పెట్టనీయవద్దని డాక్టరు గట్టిగా చెప్పాడు పొయ్యి అసలే పనికిరాదన్నాడు. కాని ఆమె వింటేనా! మంచిమనిషిలా అన్ని సర్దుకోవాలని ఆమె తాపత్రయం. మొత్తుకొంటున్నా వినక పొయ్యిదగ్గరకు వచ్చేది నేను కోపంవచ్చి చెడామడా తిట్టేవాణ్ణి. ఏమిలాభం? తిట్లదారిని తిట్లు పోయేవి. ఆమె తన అలవాటు ప్రకారం చేయడానికి ప్రయత్నించేది.

నా హృదయం జివ్వుమంది. ఇంత కాలం ఆమెచేత అడ్డమైన చాకిరి చేయించుకొన్నాము తీరా నేడు మూలబడితే గుక్కెడు మందిప్పించలేక పోయామన్న సంగతి తెలిసివచ్చి నిలువునా కుంగిపోయాను. అయినా ఏమిచేయను? పంట మీద కాస్తో కూస్తో వస్తూవుంటే గుడ్డా

గోసె, వ్యవసాయం ఖర్చులు వెళ్ళమారుతున్నాయి. ఇకపోతే అప్పు తేవాలి. తెచ్చినా తీర్చేది ఎలా? మనస్సు గింజులాటలోపడ్డది.

మా అత్తయ్యపరిస్థితి మరీ అధ్వాన్నం కాసాగింది గడియసేపైనా కూర్చోటంలేదు. పంచింట్లోకి తూర్పింట్లోకి తిరిగింది తిరిగినట్టుగా వుంటూవుంది డాక్టరు చెప్పినట్లు హాస్పిటల్‌కు ఎంత తొందరగా తీసుకెళ్ళితే అంత మంచిదనిపించింది. అసలు ఇల్లువదలితేగాని ఆమె ఒక ప్రక్కన కూర్చోదు.

కాబట్టి ఊరికి తొందరగా బయలుదేరాలిసిందే కాని డబ్బు ఎవరిని అడిగేట్టు? అడిగితే మర్యాద దక్కాలికదా? అవతల ప్రాణంమీదికి వచ్చినప్పుడు మాట వెలితి అవుతుందేమోనని కించపడవలసిన దేమిటి? అసలు అంత జంకవలసిన పనేముంది. దేశంలో డబ్బుకు కరువులేదు. ఎవరైనా నాకు అప్పు ఇవ్వటానికి వెనకాడవలసిన పనిలేదు. ఆ ధైర్యంతో నేను నరసయ్యగారింటికి వెళ్లాను.

నరసయ్యగారు ఒక విచిత్ర వ్యక్తే నని చెప్పాలి. ఆయన ఇరవైవేలదాక వడ్డీకి తిప్పుతున్నా ఒకసారికూడా కోర్టు కెక్కినవాడు కాడు. ఆయన డబ్బు మహత్యమేమో కాని కొంపలు నిలువున కూలిపోతున్నా అప్పులవాళ్ళు ఆయన డబ్బుమాత్రం ఋణాలు పైసలతోసహా కట్టిపోయేవాళ్లు బాకీదార్లను ఎన్నడూ ఒత్తిడిపెట్టినట్లుకూడా వినలేదు అసలు ఈ ప్రపంచమంటేనే ఆయనకు అంత విరక్తి అట. అంత వేదాంతి, జ్ఞాని చుట్టుపట్లలో లేరని అనుకొంటూవుంటే విన్నాను నాకుమాత్రం ఆయనతో గాఢ పరిచయం లేదు కాకపోతే రెండుమూడు సార్లు లైబ్రరీవద్ద చూచాను.

నేను వెళ్ళగానే తూర్పింట్లో బల్లమీద కూర్చోమని, నరసయ్యగారు ఉత్తరీయపు మడత ఒజానవేసుకొని నాకు ఎదురుగా ప్రక్కన ఉన్న స్తంభానికాను కొని చతికిలబడి,

"ఏమి అబ్బాయి. మీ నాన్న తిరుగుతున్నాడా?'' అన్నాడు.

"తిరుగుతూనే వున్నాడండీ."

"సాయంకాలం లైబ్రరీ అరుగువద్దకు వచ్చి కాసేపు కూచుని పోతుండేవాడు. నాలుగు రోజులనుంచి కనిపించకపోతే ఒంట్లో సుస్తీచేసిందేమోనని అడుగుతున్నాను."

"ఆయనకు బాగానే ఉంది. కాని మా మేనత్త మంచం పట్టింది ఇంట్లో గిద్దెడు గింజలు కాసిపోసేవాళ్లు లేరు నానా యిబ్బందిగా ఉంది."

"అయ్యో పాపం! ఎంతకష్టం! అన్నీ ఉంటేనే సంసారం నరకం. వేళకు నాలుగు మెతుకులు పెట్టేవాళ్లలేక ఇంట్లో పడకవేస్తే ఇక చెప్పాలి? అందుకనే అన్నారు, "సంసారం సాగరం దుఃఖ" మని ఏదో ఇలాగే కష్టాలు వస్తుంటాయి

పోతుంటాయి. ఇలాంటి అనిత్యమైన యీ ప్రపంచం, ఈ జీవితం నిత్యమనీ సుఖమనీ అనుకోవటంకన్నా తెలివి తక్కువతనం మరేమీలేదు అయితే మరి మీ చెల్లెలికోసం కబురంపించక పోయారా?''

"అదిమాత్రం వచ్చి ఏమిచేస్తుంది. పైగా కంచెంతకాపురం అదీని. వచ్చి నాలుగు నెల్లపాటు ఉండాలంటే పడు తుందా?"

"ఇంట్లో గిద్దెడుగింజలు పొంగించే వాళ్లు లేకపోతే ఎలా?''

"ఏదో మా తిప్పలు మేముపడతాము. కాని మా అత్తయ్యదే చిక్కు వచ్చింది."

''ఏమి?''

"డాక్టర్ ఆమెను మదనపల్లి తీసు కెళ్ళమన్నాడు."

''డాక్టర్లకేం బాబు, మాటేగద చెప్ప టం; చెప్పివేస్తారు. అది పడుతుందా లేదా, రోగికి తాహతు-దా లేదా అని ఆలోచిస్తారా? వాళ్లు చెప్పినట్లు చేసేటప్ప టికి మనతాడు తెగుతుంది. మనఊళ్ళో ఆచారులకి చూపించకపోయారా?"

"ఏ యితర రోగాలైతే అనుకోవచ్చు. క్షయవంటి రోగాల విషయంలో వాళ్ళు చెప్పినట్లు చెయ్యక తప్పదు."

''మనసు నిలుపుకోలేక ఏదో అను కుంటాముకాని, డాక్టర్లు దేవుళ్ళా? ఏ నిమి షానికిఏమౌతుందో ఎవరు చెప్పగలరు? ఆ గడియవస్తే, డాక్టరు కాదుకదా బ్రహ్మదేవుడైనా ప్రాణం నిలబెట్టలేడు బ్రతికేవాళ్లు ఎక్కడున్నా బ్రతుకుతారు, చచ్చేవాళ్లు, అమృతం తాగినా చస్తారు. జననమరణాలు అనంత ప్రవాహాలు ఎక్కడనుంచి ఎందుకు బయలుదేరు తున్నామో ఆలోచిస్తే విచిత్రంగా ఉంటుంది "

నేను ఇక ఏమి మాట్లాడను? డబ్బు అడగటానికి నోరు రాలా, కాని అత్తయ్య ఆయాసం జ్ఞాపకంవచ్చి సాహసించి అన్నాను.

''మీరు చెప్పింది ముమ్మాటికి నిజం. అయినా మానవుడు తన ప్రయత్నమేదో తాను చేయాలికదా? మా అత్తయ్యను మదనపల్లి తీసుకెళ్ళాలి. రెండు వంద లుంటే ఇప్పించండి. రేపు జనవరిలో ఇస్తాను."

''దానికేం తీసుకెళ్లు. డబ్బు ఇవ్వబడు తుందని ఇలా అంటున్నా ననుకునేవు సందర్భం వచ్చిందికాబట్టి చెబుతున్నాను. అయినా నువ్వు చిన్నవాడివా చితక వాడివా? ఎందుకు చెబుతున్నానో నీకు తెలియదటలే," అంటూ లోపలికి వెళ్ళాడు.

అప్పటిదాకా మాట తీసివేస్తాడేమో నన్న ఆతురత కాస్త పోయి మనస్సు కుదుటపడ్డది. ఎందుకో ఆలోచన పోయింది. ఆయన ఎందుకు ఇలా అంటు న్నాడు? నాకు మాత్రం ఏమీ పాలుపో లేదు. ప్రపంచంలో అనేక రకాల వ్యక్తు




లుంటారు. అనేక సిద్ధాంతా లుంటాయి. అలా ఉన్నంత మాత్రాన వచ్చే నష్ట మేమిటి? మానవత్వం అనేది చావకుండా తోటివాడికి ఇబ్బంది వచ్చినప్పుడు కాస్త ఆదుకొంటూవుంటే అంతకన్నా కావల సింది ఏముంది!

నరసయ్యగారికి నోటు వ్రాసియిచ్చి డబ్బుతీసుకొన్నాను "మీ మేనత్తవెంట నీవేగా వెళ్ళేది? ఆసుపత్రిలో చేర్చిన తరువాత ఆమె ఆరోగ్యం ఎలావుంది కాస్త వ్రాస్తూవుండు,'' అని నేను వెళ్ళే టప్పుడు ఒకటికి రెండుసార్లు చెప్పాడు.

ఇలాంటి వ్యక్తినిగూర్చి అనుమానించి నందుకు నాకు నేనే ఎంతో నొచ్చు కున్నాను ఆయన నిర్లిప్తత, సానుభూతి నన్ను విస్మయపరిచాయి. మాటలనుబట్టి హృదయాలను కొలవటమంత తెలివి తక్కువపని లేదని నిశ్చయించు కున్నాను.

ఇంటివద్ద చేయవలసిన ఏర్పాట్లుచేసి మా అత్తయ్యను మదనపల్లి తీసుకువెళ్ళి హాస్పిటల్లో చేర్పించాను. ఇంతలో నరసయ్యగారి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. ''మీ అత్తయ్య ఆరోగ్యం ఏలావుంది? కాస్త ఉసులుచిక్కిందా? అశ్రద్ధచేయక అక్కడి విశేషాలు వ్రాయ వలసింది," అని ఆయన వ్రాశాడు.

ఆ ఉత్తరం చూడగానే నాకు నేనే సిగ్గుపడ్డాను. ఏదో మాటవరసకుఉత్తరం వ్రాయమన్నాడే కాని మా యోగ క్షేమాలు తెలుసుకోవాలని అంత ఉత్సాహపడున్నా డనుకోలేదు. ప్రపం చమే మిథ్య అని విశ్వసించేవారికి యోగక్షేమాలు కావలసివస్తాయని ఎలా అనుకొనేది?

వెంటనే ఉత్తరం వ్రాయటం అవ సరం. మా అత్తయ్యకు ఎలా వుందో వ్రాసినంతమాత్రాన చాలదు. ఆయన,

ఆయన కుటుంబం యోగక్షేమాలు తెలుప వలసిందని కోరటం న్యాయం; విధ్యుక్త ధర్మం కూడా. అయితే ఊళ్ళో ఎవరి సంగతీ నాకు తెలియదు, తెలుసుకోవాలని కూడా ఎప్పుడూ ప్రయత్నించ లేదు. ఊరి స్థితిగతులనుబట్టి కొంచెం పెడగా ఉండటం మంచిదనిపించి అలా చేశాను. నరసయ్యగారికి ఉత్తరం వ్రాస్తూ ఎవరి యోగక్షేమాలను తెలుపవలసిందని కోరేది?

వెంటనే మా నాన్నగారికి నరసయ్య గారి కుటుంబం సంగతి సాధ్యమైనంత త్వరలో వ్రాయవలసిందని వ్రాశాను. ఆయన ఏ గుణంలో ఉన్నాడో వెంటనే జవాబు ఇచ్చాడు.

నరసయ్యగారికి ఒక్కడే కొడుకు. పేరు విద్యారణ్యులు. వేదాంత శిరోమణికి తిరుపతి కలాశాలలోనో, మరెక్కడో చదువుతున్నాడట విద్యారణ్యులుకి కొడుకట. వయస్సు తొమ్మిది మాసాలట. ఆ పిల్లవాడు బంగారపు బొమ్మ. తల్లి, పిల్లవాడు నరసయ్యగారివద్దనే ఉంటున్నారట

మా నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం రాగానే నరసయ్యగారికి జవాబు వ్రాస్తూ, "బసమార్చటంవల్ల ఉత్తరం ఆలస్యంగా చేరింది. అందువల్ల జవాబు ఆలస్యంగా వ్రాస్తున్నాను. మా మేనత్తకు ప్రక్క టెముకలు రెండు తీసివేయాలంటున్నారు ఆమీద ఎలావుంటుందో? మీరు చెప్పినట్టు మా లిఖితం మంచిదై ఆమెకు ఆయువు వుంటే బ్రతుకుతుంది. మీ ఆరోగ్యం బాగానేవుంది కదూ? బేబీ శంకరం ఇంట్లోకి దొడ్లోకి పాకాడుకుంటూపోయి ఆడుకుంటున్నాడుగా. విద్యారణ్యులు ఇంటికి ఎప్పుడువస్తాడు?" అని వ్రాశాను.

ఈ ఉత్తరం వ్రాసిన ఇరవై రోజులకు కూడా సమాధానం రాలేదు. నాకు ఆశ్చర్యంకలిగింది. ఆయన ఊళ్లోనన్నా లేకపోవాలి, మరేమన్నా అవాంతరం వచ్చి ఉండాలి. నాకు ఆ విషయమై దీర్ఘంగా ఆలోచించటానికి వీలులేకపోయింది. మా స్థితి నానాటికి అధ్వాన్నంగా ఉంది. ఒకరోజు రాత్రితో ఆమెనుగూర్చి బాధపడవలసిన అవస్థ తీరిపోయింది.

మరునాడే శవాన్ని తీసుకొని మా వూరు బయలుదేరి వచ్చేశాను. అత్తయ్య ఎటుతిరిగి పోయిందికాబట్టి ఆలోచించ వలసిన పనిలేదు. ఉన్నా ప్రయోజనం లేదు పోతే బాకీమాత్రం అలాగే నిల బడి ఉంది

ఇంట్లో ఎద్దడులు సర్దుకొని ఒక రోజున నరసయ్యగారి సంగతి ఆరా తీశాను. కొద్దిరోజుల క్రితమే ఆయన మనుమడు బావిలోపడి మరణించాడని తెలిసింది. పారుకాడుతూ పోయిపడ్డాడో, లేక విరోధులే పడేశారో తెలియదట. తెల్లవారిచూస్తే వారి పెరటిబావిలో బేబీ శంకరం తేలిఉన్నాడట.

పాపం నరసయ్యగారికి ఎంత కష్టం

వచ్చింది! పోయి ఒకసారి ఆయనను పలకరించివద్దామనిపించింది. నేను వెళ్లే సరికి ఆయన తూర్పింట్లో దిగాలుపడి బల్లమీద కూర్చుని ఉన్నాడు. నేను వెళ్ళగానే ఆయన ఒక పక్కకు జరిగి కూర్చోమని సంజ్ఞచేశాడు. కూర్చున్న తరువాత, "ఎప్పుడొచ్చావు, మీ అత్తకు ఎలావుంది?" అని అడిగాడు.

నేను కన్నీళ్లపర్యంత మయ్యాను "తెలియక అడిగాను బాబు. ఏడవకు. ఆమె పోయినసంగతి తెలీదు ఏ నిమిషాన ఏమి జరుగుతుందో ఎవరు చెప్ప గలరు? మా శంకరం సంగతే చూడు. ఇలా జరుగుతుందని కలలోనైనా నేనను కోలేదు. ఓ దైవజ్ఞుడు చెప్పాడు ఓ నల ముతక ఈదవలసిందే తప్ప ఆ పిల్ల వానికి వచ్చిన ఫరవా ఏమీలేదన్నాడు. నేను ఎంతో సంతోషించాను. కొడుకూ మనమళ్ళ చేతిమీదుగా వెళ్ళమారిపోతా నని ఉబ్బిపోయాను. చూడు యేమి జరిగిందో, అదంతా మాయ," అని ఆయన నిట్టూర్చాడు.

"పిల్లవాడు ఎలా బావిలోపడ్డట్టు?"

"ఏమని చెప్పేది. దొంగలు ఆపని చేశారందామా బంగారు మొలతాడు, పులి గోరు, చేతిమురుగులు అలాగే ఉన్నాయి. నాకు శత్రువులు నువ్వు ఎరక్కుండా ఎవరున్నారుగనక? ఇంతకూ వాడికర్మ, మాకర్మ అలా నెట్టుకువచ్చింది."

"బావి ఎక్కడ?"

"వెనక పెరట్లో ఉంది. నాకు కాళ్ల కూడా రావటంలేదు, వచ్చి చూపిద్దా మంటె."

"నేనె వెళ్ళి చూసివస్తాను లెండి." అని వెళ్ళి చూచాను. బావిబొద్దు ముప్పాతిక ఎత్తు ఉంది. నేను తిరిగివచ్చి "శంకరానికి ఎన్నో ఏడు?" అని అడిగాను.

"ఏళ్ళా! తొమ్మిది మాసాలుకూడా సరిగా నిండలేదు. చావుకోసమే కామాలు గుమ్మటంలాగా ఎదగివచ్చాడు."

"అంతా మాయ!" అన్నాను.

"ఏమి మాయ అంటావు?" మొగం ఇంతచేసుకొని అడిగాడు.

"మాయ అనిర్వచనీయ మనికదా పెద్దలంటారు." అని నేను వెంటనే బయటికి వచ్చేశాను

మరునటిరోజునే పైకం అవసరంగా వుందని నరసయ్యగారు నాకు కబురు చేశారు.






ఇది కథకాదు. అయినా కథలాగే జరిగింది.

నేను రచయితని. ఒక చిన్న సంఘటనని ఆధారంగా తీసుకుని, నా ఊహాశక్తిని వినియోగించి, దాని చుట్టూ పెద్ద కథ అల్లుతాను. ఏవేవో ఊహలు ఎప్పుడూ నా మనసులో కెరటాల్లాగా, చేపపిల్లల్లా తుళ్ళి పడుతూ ఉంటాయి. ఎన్నెన్ని ఆలోచనలు వస్తాయంటే నాకు తరచూ రాత్రిళ్ల నిద్రపట్టదు!

ఈ ఊహాశక్తితోటే నేను నా జీవితంలో జరిగిన సంఘటన చుట్టూ కథ అల్లి, ఆ కథ నిజమని నమ్మాను.

నేటికి సరిగా పద్దెనిమిదిరోజుల క్రితం జరిగిన సంఘటన!

టైఫాయిడ్ జ్వరం రెండు వారాలు పీల్చి పిప్పిచేసింది నన్ను. మూడవవారం గడుస్తున్నది. టెంపరేచర్ నార్మల్‌కు వచ్చింది. కాని, మనిషిని మనిషిగాలేను. పూర్తిగా నిస్సత్తువ; కళ్ళు పూర్తిగా విప్పి చూడలేనంత బలహీనంగా ఉన్నాను.

అయితే బుర్రలో చురుకు ఏ మాత్రం తగ్గలేదు. ఏవేవో ఊహాలు. ఒక్కొక్క ఊహను ఒక్కొక్క చిత్రమైన కథగా రూపొందించవచ్చు.

నిద్రపట్టకపోతే మళ్ళీ టైఫాయిడ్ తిరగ పెడ్తుందేమోనని డాక్టర్ నిద్రమాత్ర లిచ్చాడు.

నిద్రమాత్రతీసుకొని పడుకొన్నాను.

ప్రియంవద యింకా వంటిట్లోనే ఏదోపని చేసుకొంటున్నది.

రాత్రి తొమ్మిదిన్నర గంటలయింది. సన్నగా తుంపరపడటం ప్రారంభించింది. క్రమంగా పది నిమిషాల్లోనే పెద్ద వానగా మారింది.

మామూలుగా అయితే రాత్రిళ్ళుయిట్లా వాన పడుతూఉంటే, కిటికీ దగ్గరగా కుర్చీ, టేబుల్ వేసుకుని, వానచూస్తూ కథ రాస్తాను. ఆ కథ తప్పకుండా ఎంతో బాగుంటుందని, నాకథ చదివినవాళ్లంతా మెచ్చుకొంటారు. వానచప్పుడు నాలో నిద్రించే ఊహలను మేలుకొల్పుతుంది! కొత్త కొత్త భావాలను సృష్టిస్తుంది.

నమ్మలేరుకదూ! 'పోలీస్ సబ్‌యిన్స్పెక్టర్ ఏమిటి? కథలు వ్రాయడమేమిటి? నాన్సెన్స్! వాళ్ళ బుర్రల్లో దొంగలు గుండాలు, హత్యలు, దోపిడీలు! ఇవి తప్ప, జీవితం లోతుల్లోకి చూడడం. వాళ్ళకేమి చేతనవుతుంది?' ఇవేగా మీ ఊహలు!

నా ఊహలో, రచయిత కాదలచుకొన్నవాడు పోలీస్‌శాఖలో నన్నా ఉండాలి, లేదా డాక్టరన్నా కావాలి. రోజుకో రకం దోషి మాకూ, రోజుకో రకం రోగి డాక్టర్‌కూ చిక్కుతూ ఉంటారు. ప్రపంచంలోని రకరకాల వ్యక్తులు మాకు తారసపడుతుంటారు.

నేను మారుపేరుతో వ్రాస్తాను. నా కలం పేరేమిటో ప్రియంవదకు కూడా తెలియదు.

ఇదేమిటి? అసలు సంగతి మరిచి, పక్కదారి పట్టాను!

వానపడుతున్న రాత్రి అని కదూ చెప్పాను! ఆ శబ్దంవింటూ అలాగే మగత నిద్రలో పడ్డాను.

హఠాత్తుగా మెలకువ వచ్చింది.

వాన యింకా పడుతూనే ఉన్నదికానీ, నేను మేలుకోడానికికారణం వానచప్పుడు మాత్రం కాదు. ఏదో అస్పష్ట ధ్వని.

మరుక్షణం పూర్తిగా మేలుకొన్నాను. అయితే అలాగే, బద్ధకంగా పండుకొన్నాను.

వర్షపు హోరులోనుంచి నాకేదోధ్వని, గుసగుసలు లాగా వినిపించింది.

వంటింట్లోనుండి వినిపించుతున్నాయి.

"ఇష్! ఆయన లేస్తారేమో! చప్పుడు ...... వానలో......వద్దు...తగ్గి ... పోదువుగాని!" ఆ గొంతు ప్రియంవదది.

నాకుతెలియకుండానే నాలోని పోలీసు మేలుకొన్నాడు. ఊపిరి బిగబట్టి వినడం ప్రారంభించాను.

"ప్రియా! ఎన్నాళ్ళు ... ... మీ ఆయనతో...మంచిది...దాపరికం..."

మగగొంతు ఎప్పుడో, ఎక్కడో విన్న గొంతే! గుర్తుకు రావటంలేదు.

అర్ధరాత్రి ప్రియంవదకు మరో మగాడితో గుసగుస లాడవలసిన పని ఏమిటి? ఎవడు వాడు?

ప్రియంవదా! ప్రియంవదా!

ఆడదాన్ని నమ్మి ఎవడు బాగు పడ్డాడు! రూపవతి అయినభార్య శత్రువుతో సమానమని పెద్దలు చెప్పనే చెప్పారు

దీని రూపాన్ని చూసి మోహించే నేను పెళ్లి చేసుకొన్నాను

పెండ్లినాటికి ప్రియంవదకు పందొమ్మిది వెళ్లినాయని అనుకొన్నారు. అన్నేళ్లూ అనాఘ్రాత పుష్పంగానే ఉందా ?

అయ్యో ! ఈ ఆలోచన పెండ్లికి ముందు రాలేదే !

అయితే ఏమాట కామాటే చెప్పకోవాలి ! ఇంతవరకూ, ప్రియంవదను చేసుకొన్నానని విచారించవలసిన అవసరం లేకపోయింది నాకు! అన్నివిధాలా అనుకూలవతే ! ఆమెలో నాకు కనిపించిన లోటేమిటంటే, ఆవిడది కాస్త స్వేచ్ఛా ప్రవృత్తి కాస్త తలతిక్క భావాలను (వాటిని స్వతంత్ర భావాలని అంటారులెండి !) అప్పుడప్పుడు చూపిస్తూ ఉండేది. ఇదే లోపమయితే, యిక లోపంలేని మనుష్యు లుంటారా ?

కాని, నా మనసులో పేరుకుపోయిన నమ్మకాన్ని వమ్ము చేస్తూ, ప్రియంవద అర్ధరాత్రి ఎవరితోటో గుసగుసలాడుతున్నది ! ఎవడో మగవాడితోటి !

అరవనా ? సంగతేమిటని అడగనా ? లేచి వాడిని కాల్చి చంపనా ?

ఏం చెయ్యను ?

ఏం చెయ్యలేదు. అలాగే పడుకున్నాను.

కాసేపటికి ప్రియంవద వచ్చి పండుకొన్నది

ఎప్పటికో, తెల్లవారుజాముకు, నాకు కొద్దిగా నిద్రపట్టింది

మర్నాడు రాత్రి నిద్రమాత్ర వేసుకోలేదు నేను

నిద్రమాత్ర తీసుకొన్నానని భ్రమపడింది, ప్రియంవద.

అర్ధరాత్రి మళ్లీ తలుపు తట్టిన చప్పుడు. వాకిటితలుపుకాదు ! వంటింటి తలుపు.

పిల్లికూనలాగా ప్రియంవద లేచి, వంటింటివైపుకు నడిచింది.

నేను లేవలేదు.

వంటింట్లో గుసగుసలు మొదలు

''ఎవరన్నా చూస్తారేమో ! తొందరగా తిను ! ఇదిగో పాలు ! ఎందుకు చెప్పు మనకి దొంగ బ్రతుకులు !" ప్రియంవద గొంతు. సన్నగా ఏడుస్తూ మాట్లాడుతున్నది.

హఠాత్తుగా, చెప్పాపెట్టకుండా, జలజల చప్పుడుచేస్తూ వానచినుకులు !

"ఇష్ ! మాట్లాడకు ప్రియా !... చెబితేనే బాగుంటుంది !...దాగుడు... రేపు...ఇప్పటికే అనుమానం..."

ఎంత హఠాత్తుగా వచ్చిందో, అంత హఠాత్తుగానే వానజల్లు తగ్గింది.




"సరే వెళ్లు! రేపీ వేళకు సిద్ధంగా ఉంటాను జాగ్రత్త!"

ప్రియంవద మాటలు.

ఏవో కథల్లో కులటల గురించి చదివానే గాని, నా జీవితంలో నేను మనసారా నమ్మిన భార్యే కులటవుతుందని కలలో కూడా అనుకోలేదు!

మనిషిని బ్రతికి ఉన్నానేగాని మనసు చచ్చిపోయింది?

వ్యభిచారిణులను పట్టి శిక్షించే నేను, వ్యభిచారిణిని యింట్లో పోషిస్తున్నాను.

ఏం చెయ్యాలని ఆలోచించి, ఉచిత నిర్ణయాన్ని ఆ రాత్రే తీసుకొన్నాను.

మామూలుగానే తెల్లవారింది.

ప్రియంవద కళ్లు ఏడ్చినట్టు ఎఱ్ఱగా ఉబ్బి ఉన్నాయి. .

ఎందుకో పాపం!

నేను మంచి నటుణ్ణి! తీసుకొన్న నిర్ణయాన్ని ప్రకటించే భావాలు చూపించలేదు నేను!

అతి ప్రేమను ఒలకబోశాను.

"నా మూలకంగా నీ ఆరోగ్యం కూడా పాడవుతున్నది ప్రియా!" అని అంగలార్చాను.

"ప్రియా!" అని పిలిచినపుడు నాలో కలిగే భావసంక్షోభాన్ని మీ కెట్లా వివరించగలను!

నేనూ 'ప్రియా!' అనే పిలుస్తున్నాను! రాత్రి వచ్చినవాడూ 'ప్రియా' అనే పిలిచాడు!

నేను 'ప్రియా!' అని పిలవటానికి, అగ్నిసాక్షిగా పెండ్లాడిన భర్తను!

మరి, వాడు?

గుండెల్లో అగ్నిపర్వతం పొగలు కక్కుతున్నది!

ప్రియంవద పనిలో ఉండగానే, నిద్ర మాత్రలను, ఎనిమిదింటిని పొడి చేశాను.

అతి సులభం! పక్కనేవున్న స్టూల్ మీద మంచినీళ్ళచెంబు ఉంది. దానితో మాత్రలు నూరాను. న్యూస్ పేపర్ చించి, పొట్లంగట్టి దాచాను.

చెంబు అడుగునూ, స్టూల్‌నీ, శుభ్రంగా తుడిచాను.

నేను పోలీస్ ఆఫీసర్‌ని. నేరాన్ని దాచటం ఎట్లో నాకు చక్కగా తెలుసు!

రాత్రి మామూలుగా, పాలు స్టూల్ మీద పెట్టి, మళ్ళీ వంటిల్లు సర్దటానికి పోయింది ప్రియంవద.

ఇదే అదను!

పౌడిని పాలల్లో కలిపాను. స్పూన్‌తో బాగా కలియబెట్టాను.

మరో పదినిమిషాలకు చేతులు తుడుచుకొంటూ వచ్చింది ప్రియంవద.

"ఏమిటి? ఇంకా మీరు నిద్రపో లేదూ? ఇట్లాగయితే ఎట్లాగండీ? అసలే బలహీనంగా ఉన్నారు! అదేమిటీ? పాలు యింకా తాగలేదూ? ఊ! తాగండి!" అంటూ పాలగ్లాసు నా దగ్గరికి తెచ్చింది.

"ప్రియా!" అంటూ చెయ్యిపట్టు కొన్నాను. అప్రయత్నంగా నా కళ్ళల్లో నీళ్ళు వచ్చాయి!

ప్రియంవద గాభరాపడింది నా వాల కానికి

''ఏమిటండీ!" అంది కంగారుగా.

నేను నిగ్రహించుకొన్నాను

''ఎందుకో ప్రియా! ఊరికే కడుపులో తిప్పుతున్నది. ఈ పాలు నేను తాగలేను. కాస్త బత్తాయిపండ్ల రసం తీసివ్వు! ఈ పాలు నువ్వే తాగు!'' అన్నా.

"ఎందుకండీ! ఇప్పుడు బత్తాయి పండ్లరసం ? యిస్తాను. ఇంకోగంట పోయిన తర్వాత, పాలు తాగండి. నా కెందుకూ పాలు!" అంది మామూలుగా.

"అట్లా కాదు ప్రియా! నేను పండ్ల రసం, నీవు పాలు, ఒకేమారు తాగాలి. ఇది నా యిష్టం!'' అన్నా ప్రేమగానే ఆజ్ఞాపిస్తూ.

నా స్వహస్తాలతో, స్పూన్‌తో కలియ బెట్టి, పాలు యిచ్చాను ప్రియంవదకు. తాగింది. నిశ్చింతగా తాగింది.

ప్రియంవద చనిపోయి పద్దెనిమిది రోజులయింది

కర్మకాండకు వచ్చిన వాళ్ళంతా వెళ్ళి పోయారు.

రాత్రి, మళ్ళీ దొడ్డిగుమ్మం దగ్గర చప్పుడు

నెమ్మదిగా లేచి తలుపు తీశాను.

శాలువా ముసుగేసుకొన్న వ్యక్తి లోపలకు వచ్చాడు, "ప్రియా!'' అంటూ.

ఈడ్చి చెంపమీద కొట్టాను. అంత బలం ఎక్కడినుండి వచ్చిందో!

''నువ్వా, బావా! ప్రియ ఏది?" చెంప తడుముకుంటూ, ఆశ్చర్యంగా, భయంగా అన్నాడు ఆ వ్యక్తి.

బావ!

లైట్ వేశాను. నా ఎదురుగా ప్రియం వద అన్న బాబూరావు!

తలతిరుగు తున్నది నాకు! సంగతేమి టని అడిగాను.

చెప్పాడు. తనకు నక్సలైట్లు కొందరు స్నేహితులున్నారనీ, ఒక హత్యకేసులో బాగా అనుమానించి వెన్నాడుతున్నారనీ,




వాళ్ళకు కనపడకుండా దాగుకోవటం కష్టంగా ఉందనీ, చెప్పాడు.

"పది పదునైదు రోజుల క్రితం అర్ధరాత్రి వచ్చాను బావా! రెండు రోజులు వచ్చాను. ఇక్కడి పోలీసులకు ఎవరో నా గురించి చెప్పారని తెలియగానే పారిపోయాను. నీవప్పుడు జబ్బుగా ఉన్నావు. అందులోనూ పోలీస్ ఆఫీసర్ అయితివి. అందుకే నీతో ఏంచెప్పవద్దని ప్రియంవద గట్టిగా చెప్పింది. సరేగాని బావా! ఆకలి మండిపోతున్నది! ఈ పరారయినప్పటినుండీ ఒక్కరోజుకూడా కడుపు నిండా భోంచెయ్యలేదనుకో! ప్రియ ఏదీ? నువ్వు **పోలీస్** ఆఫీసర్‌గా అరెస్ట్ చేయదలిస్తే, నేను భోజనంచేసిన తర్వాత చెయ్యి! ముందు ప్రియను పిలు!"

అతి దీనంగా అడుగుతున్నాడు బాబూరావు.

నేను అలాగే నిలబడ్డాను. చచ్చిపోయిన మనసు బ్రతికి ఘోషపెడుతున్నది!

"ప్రియ ఏది బావా?" తొందరపడుతున్నాడు బాబూరావు.

అవును! ప్రియ ఏదీ?

ఈ అనుమానితుడిని, ప్రియ అన్నను నేను పట్టివ్వగలను!

కాని, నన్ను, హంతకుడిని ఎవరు పట్టిస్తారు?

హఠాత్తుగా గుండెపోటుతో మరణించిందన్న అబద్ధాన్ని నిజమని నమ్మిన, నా చుట్టూగల ప్రపంచం పట్టిస్తుందా?

——



# గొలుసుదానం

నార్ల వెంకటేశ్వరరావు

'**నాన్నా!** వొచ్చేనెల నాకు చంద్ర హారం చేయించి పెడతావా?' అని కొత్త పెళ్ళికూతురు శ్యామల వాళ్ళ నాన్నని గారాబంగా అడిగింది

"అలాగే! తల్లీ!" అని కుటుంబరావు భరోసాగా అన్నాడు.

గొలుసు మెడలో పడ్డట్టే సంబరపడి, ఈ సంతోషవార్తను అమ్మకు అందించ డానికి బిరబిర లోపలికివెళ్ళింది శ్యామల.

కుమార్తె పెళ్ళికైన అప్పుల ఆలోచ నలో తిరిగి పడిపోయాడు, కుటుంబరావు

వంటింటిలోనుంచి ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వచ్చి, ''ఏమండీ! వచ్చేనెల అమ్మా ికి చంద్రహారం చేయించి పెడ తామన్నారటగా!" అని శేషమాంబభర్తని అడిగింది.

"ముందు ఎప్పటి మాటకో ఇప్పుడే మొండిచెయ్యి చూపించడం దేనికని ఉత్తినే అన్నాలే" అంటూ కుటుంబరావు చప్పరించేసాడు.

"ఉత్తినే పాపం దాన్ని ఆశ పెట్టడం తప్పుకాదండీ!" అని శేషమాంబ గుని సింది కూతురు మంచి చీర కట్టుకున్నా, మంచి నగ పెట్టుకున్నా, అది తమ సింగారమేననీ, తమ భాగ్యమేననీ మురిసి

పోయే తల్లులలో శేషమాంబనే ముందు చెప్పాలి.

"ఆ! పోదూ! ఇప్పుడు సాధ్యపడదమ్మా అని వొచ్చే నెల చెప్పగూడదా ఏమిటి? ఊహుం! వీలుపడదని ఇప్పుడే దాన్ని చిన్నబుచ్చాలా?'' అని కుటుంబరావు విసుక్కున్నాడు

"ఆ పసిదానిదగ్గిర కూడా మీ లౌకికం పోనిచ్చారుకారు " అని చికాకుపడుతూ శేషమాంబ బిరబిర వెళ్లిపోయింది

రాత్రి బడలిక తీరడానికి మధ్యాహ్నం పూట కాసేపు కన్నుమూసి, అప్పుడే నిద్రలేచిన ప్రసాదరావు గదిలోనుంచి ఈ సంభాషణ ఆలకించాడు

తర్వాత ఒక అరగంటకు ఫలహారం చేస్తూ, మామగారితో 'వచ్చేనెల నాకొక రిస్ట్‌వాచి కొనిపెడతారా?' అని అడిగాడు

'అలాగే!' అని కుటుంబరావు నిస్సంకోచంగా జవాబు చెప్పాడు.

ప్రసాదరావు పెదవులపై చిరునవ్వు నాట్యం చేసింది. అతని కళ్ళు కాంతులీనాయి

భావిని గురించి 'అలాగే!' అన్నంత మాత్రాన తను ఇంత ఆనందాన్ని యివ్వగలిగినప్పుడు ఆ మాట అనడానికి ఎప్పుడైనా సరే తానిక సంకోచించ నక్కరలేదని ఆ క్షణంలో కుటుంబరావు తీర్మానించుకున్నాడు.

రాత్రి భోజనాల వేళకు ప్రసాదరావు బజారునుంచి వచ్చి 'ఏమండీ! ఇది అందంగా వున్నదా?' అంటూ ఒక రిస్ట్ వాచీ చూపించాడు

కొంచెం వెలవెలబోతూ, "అందంగానే ఉంది. కాని, ఎవరి దేమిటి?" అని కుటుంబరావు అడిగాడు.

"నాదేనండీ! మీరు కొనిపెడతామన్నారుకదూ? అందుకని ఈ ఊళ్లో నా స్నేహితుడి షాప్‌వుంటే పట్టుకొచ్చా!" అంటూ ప్రసాదరావు పెల్లుబుకివస్తున్న నవ్వును కష్టంమీద ఆపుకున్నాడు.

'నేనన్నది వచ్చే నెలలో...' అంటూ ఉడుకుబోతుతనంతో కుటుంబరావు ఏమో అనబోయాడు.

"ఫరవాలేదు లెండి, వచ్చే నెలవరకు మావాడు డబ్బుకోసం ఆగుతానన్నాడు" అని అతని మాటను తుంచివేశాడు ప్రసాదరావు

అల్లుడు కొట్టిన దెబ్బకు మర్నాటి వరకు మళ్ళీ కుటుంబరావు నోటివెంట మాట పెగల్లేదు.





# హరేరామ హరేకృష్ణ

ఇసుకపల్లి లక్ష్మీనరసింహాశాస్త్రి

బీడీముక్కలోంచి పారిపోతానని బెదిరిస్తున్న అగ్నిహోత్రుణ్ణి,' బాబ్బాబు కాస్తుండు నీకు పుణ్యముంటుంది' అంటూ రామాచారి, పెదిమలు రెంటిని క్రిందకీ పైకీ ఊగిస్తూ బుజ్జగిస్తున్నాడు పంటి సందులో యిరుక్కుని, అటూ యిటూ పోవటానికి వీల్లేకుండా, బీడి ఊగిసలాడుతోంది చూస్తూ చూస్తూండగానే, బీడీ రెండో చివర ఎర్రబడింది అమ్మయ్య అని సంతృప్తిగా, రామాచారి, ఎడంచేత్తో, బీడీముక్కను, నోట్లోంచి తీసేసి, గర్వంగా పొగ ఊదుతున్నాడు ఆయన ఆలోచనలన్నీ ఆ పొగలాగానే ఎగిరిపోతున్నాయి. చప్పున కుడిచేత్తో, పిలకను గట్టిగా పట్టుకుని, కసిగా, లాగాడు, పీకేద్దామనే ఉద్దేశంతో 'కయ్' మని మళ్ళా వదిలేశాడు మొహాన్న పంగనామాల్ని అరచేత్తో మర్దనంచేసి, సానలాగ మొహాన్ని తయారుచేశాక పళ్లు పటపటమనిపిస్తున్నాడు. తలవాచిపోతోంది. ఆ గంటలేమిటి, ఆ మోగించటమేమిటి. ఆ జనమేమిటి తలుచుకుంటే పిచ్చెత్తిపోతోంది, అనుకున్నాడు

'ఇంత తెలివిగలవాన్ని, నాకు రాగా రాగా యీ పూజారి ఉద్యోగమా! నన్ను గుర్తించేవాళ్లెవ్వరూలేరు! ఇతరులకు నా సంగతెందుకు పడుతుంది. ప్రభుత్వమా




అంటే, దానికి చెవులూలేవు, కళ్ళూ లేవు ఎంత మొత్తుకుంటే మాత్రం యేం ప్రయోజనం! అరెరె, యెంతమంది, యెంతమంది! యింతమంది భక్తుల కోరిక లన్నీ తీర్చే, ఆ స్వామివారికి నామీద పక్షపాతం యెందుకో నాకర్థంకావటం లేదు. ఏదో వారానికి ఓ పూటయితే వచ్చేసి, ఓ కొబ్బరికాయ, నాలుగుపూలు సమర్పించుకోగానే అడిగిన కోర్కె లన్నీ నెరవేరిపోయినట్టే, భక్తులందరూ, చేతులు జోడించి నమస్కరిస్తున్నారే. నేను ప్రొద్దస్తమానం ఆయన పాదాల దగ్గర పడుంటానే అలాంటి నాకు, ఏ వరం ప్రసాదించడే! ఇంత చాకిరీచేస్తే తీరా నాకు దక్కేది, కొబ్బరిముక్కలు, అరటి పళ్ళూనా! ఇంతేనా! అవును జీతం యిప్పిస్తున్నాడుగా, నూటయిరవై రూపాయలు! ఈ జీతం ఏ మూలకంట. పిల్లలకు పట్టుమని నాలుగు బట్టలు కుట్టించామంటే, రెండు మూడు నెలల దాక, ఆ దిగులుతో చావాల్సిందే! ఇహ నిత్యకృత్యం తిండి గడవటానికి పడే పాట్లు అంతేలేవు ఛి! పాడు బ్రతుకు ఇంతకంటె..."ఏదో లోపలే లోపలే గొణుక్కొని, ఎడంచేతి చూపుడువేలు చుర్రుమనంగానే, బీడీముక్కను లాగి నేలకేసి కొట్టాడు రామాచారి

"మంచిపని చేశాన్లే, బాగానే శిక్ష అయింది...కొబ్బరికాయ భళ్ళున స్వామి వారి పాదం మీదే పగలకొట్టాను. ఏదైనా చైతన్యం ఉన్న వాడవుతే, ఆ దెబ్బకు అదిరిపడాల్సింది ... ఆయనది రాతి హృదయం. అసలు ఆయన రాయేగా! భక్తుడెవరో, నేను చేసినపనిని చూసినట్టు

న్నాడు. విలవిలలాడిపోయాడు, కందకు లేని దురద కత్తి పీటకున్నట్టు, వాడట్లా ఆడిపోయాడేమిటి పైగా నన్ను కసురు కోవటమా! అపచారంట నేను పెద్ద అపచారం చేశాన్ట! స్వామివారి పాదాన్ని గాయపరిచాన్ట! నా కడుపుమంట ఆయన కేం తెలుస్తుంది ఇన్నాళ్ళపట్టి ఆయన పాదాలు కడుగుతున్నానే, వళ్ళంతా రుద్దిశుభ్రంవేస్తున్నానే, రోజూ అలంకారం చేస్తున్నానే. ఇంతన్నా కృతజ్ఞత వుందా అంట? ఈ వెట్టిచాకిరి యిహ నేను చెయ్యలేను తీర్థప్రసాదాలు ఊళ్లో వాళ్ళందరికి యిచ్చి, వాళ్ళందరికి వరాలు యిప్పించి, నేను పస్తులుండలేను ఇక భరించలేను..." రామాచారి తెగ ఆయాసపడుతున్నాడు

బిళ్ళగోచీ గట్టిగా బిగించేశాడు. ఊడి పోయిన గుండీలను చొక్కాకు గట్టిగా పెట్టేసి, తుండుగుడ్డను, తలకు బలంగా చుట్టుకుని, ఒక్కసారి అమాంతం లేచి నిలబడ్డాడు. ఆయనకు యెక్కడలేని ధైర్యం వచ్చినట్లనిపించింది. శరీరాన్ని పెంచుకున్నాడు.

"ఈనాటితో నా దరిద్రం తీరిపో తుంది. ఇహ యివ్వాళ్ళనుంచి, నేనే బాధలు పడక్కర్లేదు..." కృతనిశ్చ యంతో ముందుకు అడుగులు వేశాడు.

అప్పుడే రోడ్లమీద జనం కిటకిటలాడు తున్నారు. రాత్రి తొమ్మిదిగంటలు దాటింది. క్షణంలో జనం పల్చబడి పోయారు. చెదురువాటుగా, అక్కడో రిక్షా, అటో కారు, యిటో సైకిలు, ఒక క్కిద్దరు మనుషులు కనిపిస్తున్నారు రామాచారి, ఆట్టే పరికిస్తూ అట్లాగే నిలబడి చూస్తున్నాడు. పెద్దగా నిట్టూర్చి సూటిగా, తన దేవాలయం వైపుకు వెళ్లాడు చుట్టుప్రక్కలా యెవ్వరూ లేరని రూఢిచేసుకున్నాడు ఆదుర్దాగా అటూ యిటూ చూస్తూ గభాలున తాళం తీసి, లోపలికి ప్రవేశించి తలుపులు రెండూ బిగించేశాడు. కాసేపటికల్లా మెల్లిగా తలుపులు తెరుచుకుని బైటకు వచ్చేసి, తాళం గట్టిగా వేసేసి, ధీమాగా యింటికి వెళ్ళిపోయాడు

ఇంట్లో పతివ్రతాశిరోమణి అన సూయాదేవి, భర్త రాకకు నిరీక్షిస్తూ, భగవన్నామ స్మరణలో లీనమయివుంది

'ఇంత రాత్రిదాక యెక్కడున్నా రండి...' కాస్తంత పెద్దగొంతుకతోనే, భర్తను చూడంగానే, అమాంతం అనేసింది

గభాలున రామాచారి, భార్య నోరు నొక్కేసి, గట్టిగా అరవద్దని సంజ్ఞచేసి, లోపలికి వెళ్ళిపోయాడు

'కృష్ణ కృష్ణ!...' ఏమిటీమాయ... రాధాకృష్ణుల విగ్రహానికి, రెండుచేతులూ జోడించి నమస్కారం చేసింది, అనసూయ

'ఒహో అదా సంగతి'అన్నట్టు తల

పూపి గబగబ భర్తదగ్గరకు వెళ్ళింది, క్షణంలో.

"ఏంచేశారు యివ్వాళ, ఇంత అర్ధ రాత్రిదాక యెక్కడున్నట్టు చెప్పండి! చెపుతారా లేకపోతే, నాకృష్ణున్నడిగి మీ గుట్టు బైటపెట్టమంటారా!" అనసూయ యెంతో విశ్వాసంతో ప్రశ్నించింది.

'నా కర్మకొద్దీ, యీ పిచ్చిదాంతో కాపురం చెయ్యాలిసి వచ్చింది' అని లోపల అనుకుని, తలబాదుకుంటూ, "నేను చెప్తారా!" అంటూ, రామాచారి తుండుగుడ్డ విప్పతీసి, తాను తెచ్చిన వన్నీ చూపించాడు

'ఆ! హా!...' అంటూ మూర్ఛపో యింది అనసూయ.

'ఇదెక్కడ కర్మరా' అని ఆయాస పడుతూ, గదిలోంచి అమాంతం బైటకు వచ్చేసరికి, పిల్లలిద్దరూ చెరొకవైపు నిలబడి వున్నారు

"మీరు యెంతసేపటినుంచి యిక్క డున్నారేంటి!..." కసురుకుంటూ, ముందుకు రెండడుగులువేసి, గ్లాసెడు నీళ్ళుతెచ్చి, అనసూయ మొహానచల్లాడు కనురెప్పలు టపటపమనిపిస్తూ మెల్లిగా లేచి, 'ఆర్తరక్షణా, పరాత్పరా! హే కృష్ణా! నా భర్తను క్షమించు! అపచా రాన్ని మన్నించు...' అంటూ ఆవేదన పడుతోంది.

రామాచారికి మతిపోయినట్లయింది. ఆ సమయాన యేంచెయ్యాలో అర్థంకాక తికమకపడిపోయాడు. తాను తెచ్చిన నగల్ని చప్పున పెట్టెలో పెట్టేసి, చివాలున అనసూయ చెయ్యి పట్టుకుని, లేవతీసి, నీకోమాటచెప్తా రా! అట్టే గోల చెయ్యక, ఎవరన్నా విన్నా, అప్రదిష్ట. ఏమిటి యీ అర్ధరాత్రి యీ రభసంతా! ...' అంటూ ఆరాటపడ్డాడు

అనసూయ ఓ పట్టాన వినిపించుకో లేదు ఆమె ధోరణిలోనే వుండిపోయింది రామాచారి ఆమెను శాంతపరిచి నచ్చ చెప్పటానికి ప్రయత్నించాడు

ఏంలాభంలేకపోయింది ఎన్నివిధాల చెప్పినా, ఆమె ఒప్పుకోవటంలేదు

"భక్తుల్నే భగవంతుడు పరీక్ష చేస్తాడు తాను ఉన్నాడని రుజువు చెయ్యటం ఎలాగనుకున్నారు ఇలాంటి కష్టాలు వచ్చినప్పుడే నిబ్బరంగా వుంటూ మనం ఆయన్నే ధ్యానం చెయ్యాలి. ఆయనయందే విశ్వాసముంచాలి నమ్మిన వాళ్లకు ద్రోహం యెన్నడూ ఆ పరాత్ప రుడు చెయ్యడు నిత్యమూ ఆ భగవంతుని సన్నిధిలోనే వుంటూ, ఆయన్ను ధ్యానిస్తూ ఆయన కరుణా కటాక్షాలకు పాత్రు లయ్యారు మీ జీవితం ధన్యం మీరెంత పుణ్యాత్ములో మీకు తెలియదు. మీ సహధర్మచారిణి అయినందుకు నేనెంతో గర్వపడుతున్నాను. మీరు యిలాంటి పనులుచెయ్యకూడదు.. మీరు ఆ నగలు స్వామివారికియిచ్చి, తప్పు మన్నించ మని వేడుకోండి మిమ్మల్ని తప్పక

కటాక్షిస్తాడు కరుణాసముద్రుడు హరే కృష్ణ, హరేరామ, రామ రామ హరే హరే...' మొదలు పెట్టింది అనసూయా దేవి.

అందుకున్నారు పిల్లలందరూ కృష్ణ కృష్ణ హరే హరే అనుకుంటూ

రామాచారి, జుట్టు పీక్కున్నాడు. పిల్లలందర్నీ ఒక్కొక్క గొంతుకే పట్టుకుని, వీధిగుమ్మంలోంచి వాకిట్లోకి గిరాటుపెడదామన్నంత కోపం, కసీ వచ్చినాయి అయితే, అంత ధైర్యమూ లేదు బలం అంతకంటేలేదు చప్పబడి పోయాడు ఆ ధ్వని వినలేక, చెవులు రెండూ గట్టిగా మూసుకున్నాడు

తెల్లవార్లూ నిద్రలులేవు చుట్టుప్రక్కల వారికవుతే దీనికి బాగానే అలవాటు పడిపోయారు ఒకాయన సీరియస్‌గా ఓసారి 'న్యూసెన్స్' కేసు ఒకటి పడేశాడు అయితే ఆ కేసు కొట్టేశాడు న్యాయమూర్తి మతస్వాతంత్ర్యాన్ని అరికట్టటం, ప్రాథమిక సూత్రాలకు, హక్కులకు భంగకరమని దాంతో ఆ యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు ఆ పెద్దమనిషి ఇంకో ఆయనకు మతిపోయి, వెళ్లాల్సిన చోటుకే చేరుకున్నాడు. ఇహ మిగిలిన యిరుగుపొరుగువారు, అప్పుడప్పుడు యిక్కడే మకాం పెట్టి, చిరతలు పట్టుకుంటూ వుంటారు. అందువల్లనే యీ రోజు కూడా, అనసూయాదేవిగార్కి భగవంతుడు సాక్షాత్కరించాడనీ, వాళ్ళు ఊహించుకున్నారు అందుకనే యే గొడవాలేకుండా తెల్లారిపోయింది

భర్తకు ఊవరపెట్టేస్తోంది, ముందు వెళ్ళి ఆ నగలు యిచ్చి క్షమాపణ చెప్పకోమని రామాచారి ఆట్టే ఆలోచిస్తున్నాడు యేంచెయ్యటమా అని

'...మీరట్లా అనుకోవద్దు. ఆ సర్వేశ్వరుడిమీద విశ్వాసం వుంచండి ఆయనే మనల్నందర్నీ కాపాడుతాడు తాత్కాలిక ఉపద్రవాల్లో, మీ విశ్వాసాన్ని సడలనీయకండి..." అక్కడే మనం దెబ్బతింటున్నాం. మన నమ్మకమే మనల్ని కాపాడుతుంది ..హరేకృష్ణ... మళ్ళీ ప్రారంభమయింది

మధ్యాహ్నందాకా యెట్లాగో దాటేశాడు కాని యిహ సాధ్యంకావటంలేదు భార్య పోరు యెక్కువయిపోతుంది. తనకు యింట్లో మంచి మద్దతు వుంటే తాను చేసినపనిని కప్పిపుచ్చుకోవటానికీ యిరుకోళ్లమీద తోసెయ్యటానికీ, తాను వేసిన పథకం పారేదే కాని జారిపోతున్నాడు మళ్ళీ క్షణంలో ధైర్యాన్ని పుంజుకుంటున్నాడు ఏమైనా సరే అనుకుంటూ, ఎంతో ధీమాగా శరీరాన్ని పెంచుకుంటున్నాడు ఇహ యింట్లో వుండే లాభం లేదనుకున్నాడు.

"సరే నువ్వు చెప్పినట్టే చేస్తాను. అవి అక్కడే పెట్టేస్తాన్లే..." అంటూ



రామాచారి, ఆ నగల్ని, తుండుగుడ్డలో చుట్టేసుకుని, ఒక్క అంగలో గుమ్మం దాటేశాడు. అటూ యిటూ బిత్తర చూపులుచూస్తూ, సూటిగా దేవాలయం వైపుకు నడిచాడు భర్త దేవాలయం దాకా వెళ్ళటంచూసి అనసూయ గభాలున లోపలికివచ్చి రాధాకృష్ణుల విగ్రహాలను కన్నీళ్లతో అభిషేకం చేసింది. క్షమించవ మని ప్రాధేయపడింది

ఇంతలోకి రామాచారి అక్కడకు వెళ్లినట్లే వెళ్లి, ఆ తుండుగుడ్డ మూటను కాస్త తన స్నేహితునికిచ్చేసి, దాటెయ్య మని సంజ్ఞచేశాడు ఆయనమాత్రం సూటిగా గుళ్లోకివెళ్ళి, స్వామివారి పాదాల మీదపడి స్వామీ నామీద నాకువిశ్వాసం కలుగచెయ్యి" అంటూ బిగ్గరగా ఏడ్చాడు.

మెల్లి మెల్లిగా గుటకలువేస్తూ, కళ్ళు తుడుచుకుంటూ లేచినిలబడ్డాడు యెంతో బరువుగా తెగ ఆయాసపడుతున్నాడు. కళ్ళు మూస్తూ తెరుస్తూ, యిట్టే ఒక్క అంగలో బైటకు వచ్చేశాడు, యెవరో హఠాత్తుగావచ్చి నెట్టేసినట్లు

'రామాచారి యెవరిక్కడ' అంటూ ఖంగున అడిగారు, అప్పుడే అక్కడకు వచ్చిన పోలీసులిద్దరూను






కళాశాల వార్షికోత్సవం జరుగుతూన్నది విద్యార్థినీ విద్యార్థులు కళకళలాడుతూ తిరుగుతున్నారు హడావిడిగా

బహుమతీ ప్రదానం ప్రారంభమైంది.

"భరతనాట్యంలో ప్రధమ బహుమానం—కుమారి బృంద!" బహుమాన స్వీకారంచేస్తున్న బృందనుచూచి కరతాళ ధ్వనులతోపాటు హేళనాపూర్వకమైన ఈలలూ, మాటలూ, పిల్లికూతలూ, కుక్క అరపులూ కూడా వినవచ్చాయి

"శాస్త్రీయగానం ప్రధమ బహుమతి కుమారి జమున, కుమారి బృంద, ఇరువురూ గెల్చుకున్నారు."

జమున వేదికపైకి వచ్చినప్పుడున్న నిశ్శబ్దంబృందవచ్చినప్పుడు పాటించడం లేదు విద్యార్థులు.

"బృంద నాట్యం ఇప్పుడు చేయాలి. మాకు బృంద నాట్యం కావాలి" ఒక కొంటె విద్యార్థి అన్నాడు

వెంటనే విద్యార్థి సమూహమంతా 'సై' అనసాగారు. వారి అల్లరితో మరి ఏ కార్యక్రమమూ సాగే అవకాశం లేదని అధ్యాపకులూ, ప్రిన్స్‌పాల్ కూడా గ్రహించారు.

విద్యార్థులను శాంతం వహించమని ప్రిన్స్‌పాల్‌తోపాటు కళాశాల విద్యార్థి నాయకుడు మురళీకృష్ణ కూడా అభ్యర్థించాడు.

"కుమారి బృంద భరతనాట్యం యిప్పుడే చేయాలి. లేనిదే ఇక ఈ కార్యక్రమం జరగనీయం." ముక్తకంఠంతో జవాబిచ్చారు విద్యార్థులు.

గౌరవాధ్యక్షులుగా వచ్చిన వాసుదేవ రావు కలుగజేసుకున్నాడు. "ఏర్పాటు చేయటానికి ప్రయత్నిస్తారు కొలది నిముషాలైనా అవసరంకదా!"

ఆ గంభీరాకారుని చిరుదరహాస వదనం, సరళ స్వరంతో కావించిన అభ్యర్థనా విని విద్యార్థులు తాత్కాలికంగా శాంతపడ్డారు.

బృందను గ్రీన్ రూంలోనికి పిలిపించారు.

కళాశాల పోటీలలో అయితే, కేవలం పోటీ అభ్యర్థులూ, సెక్రెటరీలు, కొందరు అధ్యాపకులూ న్యాయనిర్ణేతలూ మాత్రమే వున్నారు గనక బెదురు లేకుండా నాట్యం చేయగలిగింది, బృంద పోటీలలో కానీ ప్రస్తుతం విద్యార్థులందరూనేకాక, ఇతర కళాశాలల విద్యార్థులూ, ఆహ్వానితులైన పురప్రముఖులూ, తదితరులూ అనేకులతో బహిరంగసభవలె క్రిక్కిరిసి వున్నది కళాశాల ఆవరణ అంతా.

అంతటి జనసమూహం సమక్షంలో నృత్యంచేయటానికి నిజంగా చాలా భయగ్రస్థ అయ్యింది బృంద. ఆ మాటే చెప్పింది

వింటూనే విరగబడి నవ్వేశారు ప్రిన్స్‌పాల్, మరొక అధ్యాపకుడూ కూడ.

"కళను పదిమందిముందూ వుంచిన నాడే దానికి రాణింపూ, గుర్తింపూ నిన్ను అంతర్విశ్వవిద్యాలయాల పోటీకి పంపాలనుకుంటున్నాను ఇలాగైతే ఎలా మరి?...చూడు. ఇందరు నీ నాట్యం చూడవలెనని కుతూహల పడ్తూంటే నువ్వు కాదనకూడదు పురప్రముఖులందరూ నీ నాట్యం తిలకించి మెచ్చుకొంటే ఆ గర్వం నీదేకాదు, నాకూ— ఈ కళాశాలకూ! అందువల్ల త్వరగా వీలైనంత త్వరగా ఆ ఏర్పాట్లు కానీయండి విద్యార్థుల కోర్కె కాదంటే ఈ రోజులలో ఎవరి పరువూ దక్కదు."

బృంద ఇక కాదనలేనంతగా—ఆజ్ఞాపూర్వకమైన అభ్యర్థనగా వున్నది ప్రిన్స్‌పాల్ వాగ్ధోరణి

"మరి... నేపథ్యగానం...వయొలిన్ ఎవరు వాయిస్తారు? ఇటువంటివి అప్పటికప్పుడు కుదిరేవి కాదు" బృంద సందేహిస్తూనే అన్నది

"పాయింటే!" అందరూ ముఖముఖాలు చూచుకున్నారు.

"అన్నట్టు..." ఒక అధ్యాపకుడు అయిడియా కలిగినట్టు అన్నాడు. "సంగీతంలో ప్రధమురాలుగా నిల్చిన జమున వుండనే వున్నది కదా. ఆమె వీణావాయిద్యంలో కూడా నిపుణురాలు. జమున గానం, బృంద నాట్యం అద్భుతంగా వుంటుంది!"

అందరూ తేలికగా సంతోషంగా ఊపిరి పీల్చుకున్నారు

"ఇప్పుడే జమునను పిలుస్తాను."

మురళి సంతోషంగా, సంభ్రమంగా వెళ్ళాడు.

మురళీకృష్ణ ఐశ్వర్యవంతులలోకెల్లా ఐశ్వర్యవంతులబిడ్డ సంఘంలో ఎనలేని గౌరవాధికారాలూ, పరువుప్రతిష్ఠలూ గల వాసుదేవరావుగారి కుమారుడు గుణమూ సౌందర్యమూ మూర్తీభవించిన నవయువకుడు నాట్య, గాన కళలందు అమితాసక్తిగల కళారాధకుడు

మురళీకృష్ణ మేనత్త కుమార్తె జమున వారిదీ సంపన్న కుటుంబమే అయితే జమున తండ్రి మరణించడంతో జమున చిన్ననాటినుండి తనతల్లి సుభద్రాదేవితో పాటు వాసుదేవరావు ఇంటనే ఉంటూన్నది.

జమున అతిలోక సౌందర్యవతి దీనికితోడు సంపన్న గృహపు సద్గుణాలూ, గంభీరతా జత అయినాయి చిన్ననాటినుండీ ఆమెకు బావపై అమితమైన ప్రేమానురాగాలు ఊహ తెలిసిన నాటినుండీ బావ మురళీకృష్ణే తన భర్తగా హృదయాన ముద్రించుకొన్నది ఆ పరిధిని దాటి ఆమె ఆలోచనలు ఎప్పుడూ సాగవు

'జమున నీ భార్య' అని ఎవరూ కృష్ణతో ఏనాడూ ముఖా ముఖీగా అనలేదు పెద్దలు పిన్నల ఎదట మామూలు మాటలు మాట్లాడి, సాధారణ ప్రసంగాలు చేస్తూ హాస్యాలు విసిరే సామాన్య కుటుంబం కాదది తూచి తూచి మాట్లాడుతూ అడుగడుగునా హోదా, దర్పం నిలబెట్టుకొనే పైఅంతస్తు స్త్రీ మురళీ తల్లి దేవకీదేవి తండ్రి వాసుదేవరావు పెత్తనం విషయంలో–వ్యావహారిక సంప్రదింపుల విషయంలో స్త్రీలకు చాలా అల్పమైన ప్రాముఖ్యత నిచ్చే రకం ఆస్తి వ్యవహారాలు చూచుకోవటానికీ, నాట్యాకత్తెలతో మైమరచి గడపటానికే అతడికి సమయం సరిపోతుంది అతిభోగియైన అతడు భార్యతో మాట్లాడే సందర్భాలూ రోజులూ వ్రేళ్ళతో లెక్కించపగినవి మాత్రమే. ఇక సంతానాన్ని చేరదీసేది వేరుగా లేదని చెప్పనవసరంలేదు సంతానానికి అతడివద్ద చనువు లేదు

యజమానులిద్దరూ అంతటి ముభావస్థులూ, నిక్కచ్చి మనషులూ గనక నౌకర్లు కూడా నోరెత్తి వాగుడు వాగే అవకాశం లేదా యింట ఈ కారణంగా జమున తన భార్య అనే భావమే లేదు మురళికి స్నేహితు లెవరైనా ఎప్పుడైనా నవ్వుతూ అన్నప్పటికీ ఆ చెవిన విని ఈ చెవిన వదలివెసి విస్మరించే వాడా విషయాన్ని ఊహ తెలిసిన నాటినుంచీ నిత్యం తనతోనే ఆడుతూ పాడుతూన్న చెల్లెలు రాధపైనా మరదలు జమునపైనా అతడికి సమభావమే రాధపై ప్రేమాభిమానాలకూ జమునపై ప్రేమానురాగాలకూ ఏమీ భేదంలేదు అతడి హృదయంలో.

కళాశాలలో జమున రాధలకంటె

మురళి ఒక తరగతి అధికం. మురళికి సహాధ్యాయిని బృంద అప్సరసలను కూడా ధిక్కరించే సౌందర్యవతి బృంద. అయితే విద్యార్థులు ఆమెను ఎప్పుడూ ఏదో ఒకటి అని కించపరచుతూ అల్లరి పెడుతూ వుండడంవల్ల సాటి విద్యార్థులకు అందరికీ కూడా బృందపై ఒక విధమైన తేలిక భావం ఆమె సౌందర్యాన్నీ, నాట్యకళనూ చూచి అసూయ. గానంలో నాట్యంలో అద్వితీయ ప్రతిభ కల కన్య బృంద

''బృంద చేసే నాట్యానికి నా నేపథ్య గానమా? ఈ పాడు బుద్ధి నీకే పుట్టిందా ఇంకెవరైనా చెప్పి పంపారా బావాశీకు? మనమెవరం, బృంద ఎవరు?" మురళి ప్రతిపాదన అంటూనే మండిపడింది జమున. క్రోధంతో అరుణిమ దాల్చిందామె వదనం ఆమె స్నేహిత బృందం కుతూహలంగా సరదాగా తిలకించసాగారు బావా మరదళ్ళ ఈ వాగ్వాదాన్ని.

జమునకు అంత ఆగ్రహం కలగాల్సినంత తప్పిదమేమున్నదో తన మాటలలో తెలియని మురళి నివ్వెరపోయి చూచాడు

"పదిమందిలో తైతక్కలాడే దానికి నేను వెనక పాట పాడితే ఇందరిముందు, అమ్మా, అత్తయ్యా నన్ను గడపలో అడుగు పెట్టనిస్తారా! అధ్యక్షులుగా వచ్చిన మామయ్య ఇంకా యిక్కడే వున్నారు ఇక్కడి కిక్కడే మనిద్దరి ప్రాణాలూ నిలువునా తీయరూ?'' అంటూనే మురళి సమాధానం వినకుండా వెళ్ళిపోయింది ఆమె స్నేహితబృందమంతా సంతోషంతో కిలకిలలాడారు

'ఔను తన తండ్రి వాసుదేవరావు ఇక్కడే వున్నారు!' జమున జ్ఞప్తికి తెచ్చేవరకూ జ్ఞాపకమే లేదా విషయం! ముచ్చెమటలు పోశాయి మురళికి ఇటు తండ్రికి భయపడాలి, అటు ప్రిన్స్‌పాల్‌కు చెప్పివచ్చాడు జమునను తీసుకువస్తానని, కళాశాల స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీగా ఆనాడు కార్యక్రమాన్ని సవ్యంగా జరిగేటట్లుగా చూడవలసిన బాధ్యత తనది విద్యార్థులు అసంతృప్తితో రెచ్చిపోయి అల్లరిచేశారంటే ఆ అవమానం వ్యక్తిగతంగా తనది. తానొక అసమర్థుడుగా నిర్ణయింపబడతాడు!

తర్వాత్వరగా కర్తవ్యనిర్ణయం చేసుకొన్నాడు

"జలుబువల్ల జమున కంఠం ఏమీ బాగుండలేదు! అదీగాక ఆమెకు స్టేజ్ ఫియర్ చాలా వుంది" అన్నాడు తిరిగి బృంద, ఉపాధ్యాయులూ వున్నచోటుకు వెళ్ళి

"ఔను. అది సహజమే" ప్రిన్స్‌పాల్ అన్నాడు

బృంద విషయంలో 'కళారాధన అది ఇది' అంటూ అంత ఉపన్యాసం ఇచ్చిన వారికి జమున విషయంలో ఇది

సహజంగా అన్పించడానికి కారణ మేమిటి? తెలిసీ తెలియని దశలో నున్న విద్యార్థులలోగల చులకన భావమే వయో వృద్ధులైన ఉపాధ్యాయులలో కూడ ఉన్నదా?' ఏమైనప్పటికీ అతడి మనసున వారి వైఖరిపట్ల గౌరవం కలుగలేదు

"మరేం చేద్దాం ఇప్పుడు?" బయట ఆవరణలో మరలా విద్యార్థుల కలకలం మెల్లమెల్లగా వినరావడంతో ఒకరు ప్రశ్నించారు

"పోనీ గ్రామఫోను రికార్డింగు అరేంజ్ చేస్తే?"

"కుదరదు నాకు భరతనాట్యం మాత్రమే వచ్చు చవకబారు నాట్యాలు రావు." బృంద సమాధానం "సినిమా పాటల కనుగుణంగా డాన్సు చేస్తే విద్యార్థులు మరింత అల్లరిచేసే అవకాశం వున్నది"

"ఖంగారుపడకండి, ఏమేం కృతులకు చేస్తారో చెప్పండి." మురళి అడిగాడు

"రాధికా స్వామీ" "మధురానగరి," సావిరహే తవదీనా"...

"సంతోషం. అవి నేనే పాడతాను. వీణకూడా నేను వాయించగలను. హార్మోనిస్టు, తబలా-అంతా మన కాలేజీ ఆర్కెస్ట్రాయే మీరు త్వరగా తయారుకండి"

మురళి మాటలు వింటూనే బృందతో పాటు అందరు శ్రోతలూ కొలది నిముషాలపాటు ఆశ్చర్యం ప్రకటించే ముఖాలతో మురళి దెసే చూస్తూండిపోయారు.

వారి మనసులలో ప్రశ్నను గ్రహించిన మురళి, తేలికగా నవ్వేస్తూ అన్నాడు "రాధా జమునలతో పాటు నేనూ ఏదో కొంత నేర్చుకున్నాను, సరదాకొద్దీ. పండితుణ్ణి కాకపోయినా - ఫర్వాలేదు- నలుగురూ వినగలరనుకుంటాను." నవ్వేస్తూ వెళ్ళిపోయాడు

"అబ్బ! మురళి ఇంతటి గాయకుడా!"

"ఎంత అద్భుతంగా వీణ వాయించుతున్నాడు!"

"ఇంతకాలం మనకు తెలియనే తెలియదు నిండు కుండ తొణకదు కదా!"

పిన్న పెద్దలందరినుండీ రకరకాల ప్రశంసా వాక్యాలు వినవస్తున్నాయి.

బృంద నాట్యం ఘనంగా వున్నదా, మురళి గానం గొప్పగా వున్నదా అనే మీమాంసకు సమాధానం దొరకటం లేదు.

మురళి వీణా వాద్యపు గనంకాలకు. గొంతులోని మలుపులకు తీసిపోకుండా నర్తిస్తున్నాయి బృందపాదాలు ఆ పాద విన్యాసం తిలకించినకొలదీ మురళి స్వరం ఉత్తేజంతో క్రొత్త సంగతులు పలికించసాగింది. ఇనుమడించిన ఉత్సా

హంతో ఆ సంగతులకు తీసిపోని అభినయం ప్రదర్శించింది బృంద.

విద్యార్థులు తమ అల్లరిబుద్ధినీ, కొంటెతనాన్నీ మరచి తిలకించారు ఒక అద్భుత ప్రదర్శనను చూచి తృప్తి మెదలింది అందరి మనసులలోనూ.

"శహభాష్!"

"వహవ్వా!"

రకరకాల ప్రశంసా వాక్యాలతో, కరతాళ ధ్వనులతో కొలదిసేపు పరిసరాలన్నీ మార్మోగాయి.

అధ్యక్షుడు వాసుదేవరావు బృంద ప్రతిభను వేనోళ్ల శ్లాఘించాడు. "కళ అనేది సామాన్య విషయం కాదు, దైవదత్తమైన వరం. పదిమందినీ పరవశింపజేసి ఆనందింపజేసే ఈ కళాకారులు నిజంగా దైవాంశ సంభూతులేనేమో అని అన్పించుతుంటుంది నాకు. ప్రస్తుతం ఇంత అమోఘంగా తన నాట్యకళను ప్రదర్శించి, మనందరకూ నేత్రపర్వం కావించి, ఈ కళాశాల ఖ్యాతిని యినుమడింపజేసిన కుమారి బృందను ఆశీర్వదిస్తూ ఆమె మరింత వృద్ధిలోనికి వచ్చి మన నగరానికే పేరు ప్రఖ్యాతులను తేవాలని ఆకాంక్షిస్తూ, వేయి రూపాయలు బహుమతిగా యిస్తున్నాను."

మళ్ళీ కరతాళ ధ్వనులు మిన్నంటాయి.

బృంద ఆ బహుమానాన్ని స్వీకరించటానికి వేదికపైకి వచ్చింది.

"పూజ్యనీయులైన శ్రీ వాసుదేవ రావుగారు వాత్సల్యాభిమానాలతో నా కిచ్చిన ఈ బహుమానానికి కృతజ్ఞురాలను. అయితే, ఈ నగదును నా వ్యక్తిగతావసరాలకు ఉపయోగించుకోవటంకంటె కళాశాల సాంస్కృతికోత్సవాల అభివృద్ధికిగానూ ఉపయోగించటం న్యాయమని నా అభిప్రాయం అందుకే ఈ మొత్తాన్ని నా విరాళంగా ప్రిన్స్‌పాల్‌గారికి అందజేస్తున్నాను"

పిన్న వయస్సుదైనా బృంద ప్రదర్శించిన హృదయ వైశాల్యత అందర్నీ ఆశ్చర్యచకితులను చేసింది

## 2

ఏనాడూ స్త్రీని గూర్చిన తలపోతలు లేని మురళి నిర్మల నిశ్చల మానసంలో కలవరం రేకెత్తింది. అంతకు పూర్వం కళాశాలలో అపుడపుడు చూస్తూనేవున్నా, నేటి బృంద రూప లావణ్య విలాసాదులు మురళి హృదయంలో ముద్రించుకుపోయి సంచలనాన్ని రేకెత్తించసాగాయి.

బృందను కల్సుకొని ఆమె నాట్య ప్రావీణ్యతను అభినందించాడు. "అడగగానే అంగీకరించినందుకు కృతజ్ఞతలు ఎలా తెలుపాలో అర్థంకావటంలేదు. వచ్చిన పుర ప్రముఖులందరి ఎదుటా నా పరువూ, కళాశాల పరువూ కూడ నిలిపారు మీరు" అని కూడా అన్నాడు.

బృంద నిండుగా హుందాగా చిరు హాసం చేసింది మీ నాన్నగారివలెనే మీరూ ఉత్తమ కళాహృదయులు అందువల్లనే నలుగురిలో నాట్యం చేస్తుందనే హేళన చేయకుండా అభినందించుతున్నారు నిజం చెప్పాలంటే మీ గాన ప్రతిభవలన ఈనాడు నా నాట్యం అంతగా రక్తి కట్టింది. మీరింత గొప్ప గాయకులని నాకిదివరలో తెలియనే తెలియదు మరి పోటీలలో మీ రెందుకు పాల్గోలేదు?"

"నేను సెక్రటరీని కదా! అందువల్ల పోటీ చేయకూడదు అయినా పోటీ చేయగలంత ప్రతిభ నాలో వున్నదను కోను నేపథ్య గాయకులెవరూ దొరక నందున నేను పాడవలసి వచ్చింది"

అందరు విద్యార్థులవలె తనను కొంటె చూపులతో కించపర్చక వెకిలి హావ భావ ప్రదర్శనలు చేయక, అతి హుందాగా సౌమ్యంగా సరళంగా అభినందించుతున్న మురళీకృష్ణను ఎంతో గౌరవంగా హృదయాన ముద్రించు కొన్నది బృంద. అడుగడుగునా అతడి నిండు విగ్రహమూ, రీవీ, తేజమే ఆమె హృదయాన మెదులుతూ మనసులో తీయతీయని భావాలు సృష్టించ సాగింది.

## 3

"ఏం, అయినాయా అభినందనలు అందించటాలూ, స్వీకరించటాలూ?"

మేడ మెట్లెక్కుతూన్న మురళీ వెనుకనుండి వినవచ్చిన ఈ వాగ్బాణానికి ఆగి వెనుదిరిగి చూచాడు.

ప్రజ్వరిల్లుతూన్న అగ్నిశిఖలాగా కన్పట్టింది, మెట్ల దిగువన నిలబడిఉన్న జమున అతడి నేత్రాలకు ఆమె ఆరోపణ ఏమిటో అర్థంగాక నిరుత్తరుడై నిలబడిన అతడిని చూస్తూంటే జమున ఆగ్రహం మరింత అధికమైంది తానూ వేగంగా మెట్లెక్కివచ్చి అతడి కెదురుగా నిలబడింది

"నీ గానకళను ప్రదర్శించటానికి యింతకంటే గొప్ప అవకాశం ఎప్పుడూ దొరకలేదా?"

ఇంకా అలాగే నిరుత్తరుడై, జమున ఆగ్రహ కారణాన్ని ఊహించటానికి ప్రయత్నిస్తున్నాడు మురళి

జమున కనులు జలధారలయ్యాయి! "నా స్నేహితురాండ్రందరూ ఎంత హేళన చేశారో తెలుసా?"

"ఇందులో ఒకరు హేళన చేసేదీ, నీవు బాధపడేదీ ఏముంది జమునా?"

ఏముందా? నీబావ 'ఆ బృందకోసం ఎలా వెంటపడ్తున్నాడో చూడు! అంటూ అందరూ విపరీతంగా నవ్వు తున్నారో తెలుసా?"

"నవ్వనీ. వాళ్ళ బుద్ధే కనిపిస్తుంది" అంటూ తాత్కాలికంగా జమునను తప్పించుకుపోయాడేకానీ, తన అంత రంగాన్ని మాత్రం జోకొట్టలేకపోయాడు.

నిజమే-తాను బృంద స్నేహంకోసం పరితపిస్తున్నాడు ఆమెతో మాట్లాడ టానికి ఉవ్విళ్ళూరుతున్నాడు

"ఇదేనా ప్రేమ అంటే? కానీ ... కానీ బృంద నన్ను గురించి ఏమని ఆలోచిస్తూన్నదో? ఆమెను వివాహమాడి ఆమె గాన నాట్యాలలో మునిగి తేలగల ధన్యుడెవరో!"

## 4

"రా బృందా. నీకోసమే చూస్తు న్నాను" నమస్కరిస్తూ ప్రవేశించిన బృందను సాదరంగా పలుకరించాడు ప్రిన్సిపాల్.

వినయంగా ఒకప్రక్క ఒదిగి నుంచున్నది బృంద.

"యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ ఛైర్మన్‌గారు వచ్చే పదకొండో తేదీన మన కళాశాలకు వస్తున్నారు సభా సమావేశాలతోపాటు యథోచితంగా సాంస్కృతిక కార్యక్రమాలు కూడా ఏర్పాటుచేస్తున్నాం అందులో నువ్వే మైనా పాల్గొంటావా?"

"నేనాండి?" ఆశ్చర్యంగా అన్నది బృంద "నావల్ల ఏమౌతుందండి?" ఆ వదనంలో - స్వరంలో అమితమైన మొగమాటం.

"అలాగంటే ఎలాగ?"కళాశాలలోని కళా విభాగపు కార్యదర్శి అయిన లెక్చ రర్ అందుకున్నాడు "నువ్వే అలా గంటే ఇక అసలు ముందుకొచ్చేదెవరు?"

"అంటే ఏమిటండీ?" ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో ప్రశ్నించింది

"ఏముందండీ?" విద్యార్థి నాయకుడు మురళి కల్పించుకొని చొరవగా మాట్లా డాడు "మేమంతా కలిసి గాన కచేరీ ఏర్పాటుచేశాం. పెద్దలు వస్తూన్నప్పుడు మన కళాశాల ప్రతిభ అంతా ప్రద ర్శించాలి. అంచేత మీరుకూడా"అర్థోక్తిలో ఆపేశాడు

ప్రిన్స్‌పాల్ కలుగజేసుకున్నాడు "వస్తున్నవారు మరొకరూ మరొకరూ కాదు యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ ఛైర్మన్‌గారంటే ఎంత ఘనత, ఎంత అధికారం! అటువంటివారు వస్తున్నా రంటే—మనం ఈ సదవకాశం జార విడుచుకోకూడదు మన కళాశాలలోని విద్యార్థులు ఒక్క చదువులోనేగాక, కళారంగంలో కూడా ఎంత ఘటికులో వారికి మనం చూపాలి వారి మన్నన పొందామంటే మన కళాశాలకు ఏదో ఒకటి గ్రాంటుచేసి వెళ్తారు! అంచేత, ఆ రోజు నువ్వునృత్యప్రదర్శనఇవ్వాలి."

"నేనేనాండీ!" బృంద చేయి అప్ర యత్నంగానేగుండెనుచేరింది "స్టేజిమీద చేయడమంటే నాకు భయమండీ!" వస్తూన్న ఒగుర్పును అణచుకుంటూ అన్నది.

తేలికగా— పకపకా నవ్వేశాడు ప్రిన్సిపాల్ "అదేమిటమ్మాయ్, కళ

మీ సొమ్ము! అలా నువ్వే భయపడితే ఎలాగ?"

నిర్ఘాతపోయి చూచింది బృంద.

"అహఁ అదే......కళలన్నీ స్త్రీల జన్మహక్కులూ... ...అని నేననేది, అంతే." బృంద కళావిహీన వదనాన్ని చూచి తననుతాను సవరించుకున్నాడు ప్రిన్సిపాల్. "భరతనాట్యంలో ఆరితేరిన దానవు! నువ్వు మా కాలేజీ విద్యార్థిని వంటేనే మాకు గర్వం! వింటున్నావా? ఆ రోజున నువ్వు డ్యాన్సు ప్రోగ్రాం యివ్వాల్సిందే!"

"ఆఁ. ఎందుకివ్వదండీ! తప్పకుండా యిస్తుంది!" లెక్చరర్ వంతపలికాడు.

"అదికాదండీ." ధైర్యంచేసి నోరు విప్పింది బృంద. "కాలేజీ స్టూడెంట్స్ అందరిమధ్యనా వేదిక ఎక్కాలంటే బెరుకుగా వుంటుంది సాంస్కృతికోత్స వాలలో చేసిననాడు కూడ నేను చాలా భయపడ్తూనే చేశాను.

"అదాండీ మీ భయం! స్టూడెంట్స్ ఎవరూ ఏమీ అనకుండా చూచుకునే బాధ్యత నాది. సరేనా?" భరోసా పలికాడు మురళి

"ఇంక మరోమాట చెప్పకండి. మీ నాట్యం ఆ రోజు కార్యక్రమంలో తప్పని సరిగా వుంటుంది."

"మరి ... ... ఆర్కెస్ట్రామాట?" బృంద అడిగింది.

"ఉన్నారుగా, మన విద్యార్థులలోనే, అందరం మనమే సర్దుకోవాలి. పైవాళ్లకు అవకాశమే లేకుండా మన ప్రావీణ్యం చూపాలి, సాంస్కృతికోత్సవాలలోచూపి నట్టు."

ఆశ్చర్యంగా కదిలాయి బృంద కనులు

మురళి విషయం వివరణ చేశాడు. "నేను వయోలిన్ వాయిస్తాను, సారథి మృదంగ వాయిద్యంలో దిట్ట, ఇంకా యింకా వున్నారు బి. ఎ., బి కాం, స్టూడెంట్స్ - మీకు తెలియదు. హార్మో నియం, తబలా, వీణ, వేణువు— అన్నీ వాయించగల నిపుణులే వున్నారు మన కళాశాలలో. అన్నట్టు కృష్ణ-గాత్రంలో నిపుణుడు! ఆ రోజుఅన్నీ అప్పటికప్పుడు ఏర్పాటు చేయవలసి వచ్చింది ఇప్పుడు గనుక ఏ లోటూ వుండదు"

"అలాగే!"

"మరి రేపటినుంచే మన రిహార్సల్సు మొదలు ఇక ఆట్టే వ్యవధి లేదుగా!"

"అలాగే."

తప్పనిసరిగా అంగీకరించిందే కాని బృంద మనసులో ఎన్నో భయాలు ఊరికలెత్తసాగాయి "ఎందుకో ఈ అనుకోని సంఘటన యిప్పుడు! ఇది మరెందుకూ నాందీ వాక్యం కావడంలేదు గద!'

## 5

"మీరు అందరికంటె కనీసం పావు గంటైనా ఆలస్యంగా వస్తున్నారుబృందా!

దేవీ! ఇలాగైతే కష్టం కాదటండీ?" రిహార్సల్సు ప్రారంభమైన అనంతరం ఒకనాడు సారథి అన్నాడు

"సారీ!" నొచ్చుకుంటూ అన్నది బృంద. "నాకూ తొందరగా రావాలనే వుంటుందండీ కాని, రిక్షా దొరకాలి ఇహ అందులో కూర్చున్న తర్వాత ఆ రిక్షావాలా దయకదా! అఘ మేఘాలమీద నైనా పరుగెడతాడు, ఏ లారీకో, కారుకో డాష్ యిచ్చేట్టు, లేదా చీమ నడకైనా నడుపుతాడు తాపీగా.'' అంటూ నవ్వ టానికి ప్రయత్నించింది.

వయొలిన్ శృతి నవరించుకుంటూన్న మురళి అన్నాడు ''నిజమే ఒకవాహనం అంటూ ఎక్కిన తర్వాత ప్రాణం డ్రైవా ధీనమే అసలు ఎప్పుడో ఒకప్పుడు సవ్యంగా గమ్యాన్ని జేరుకోవటమే అదృష్టమనుకోవాలి''

సహాధ్యాయులంతా నవ్వారు.

''పోనీ...... మీకిలాగ ప్రతిరోజూ ప్రత్యేకంగా రావటానికి కష్టంగా వుందను కుంటే రిహార్సల్సు మీ యింట్లోనే కానిద్దాం.'' కృష్ణ సలహాపూర్వకంగా అన్నాడు.

కాని ఆ ప్రతిపాదన వింటూనే ఉలికి పడింది బృంద ఎటూ చెప్పలేనట్లుగా మౌనంగా అందరివైపూ చూచింది. ఆమె ముఖకవళికలలోనే అంతర్లీనమైవున్న అయిష్టాన్ని పసిగట్టగలిగిన మురళి, కృష్ణ మాటలను ఖండించాడు 'అదేమిటి కృష్ణా ఇటువంటివి-ఏదో కుర్రాళ్ళం గనుక మనకైతే సరదాగా వుండచ్చు కానీ, ఇళ్ళల్లో ప్రారంభించామంటే పెద్ద వాళ్ళకు చీదరెత్తి కర్ర చేతబుచ్చు కుంటారు మన సంగీతం కాస్తా ఆరు న్నొక్కస్థాయి నందుకుంటుంది అప్పుడు.''

కృష్ణ తిరిగి మాట్లాడలేదు కానీ, సారధి అతడు ముఖ ముఖాలు చూచుకుని గుంభనంగా నవ్వుకున్నారు.

తిరిగి తానేఅన్నాడు మురళి."బృంద పోయి యిప్పుడు వాళ్ళ అమ్మగారి నాన్న గారి అనుమతి తీసుకోవడం మనం రోజూ వాళ్ళింటికే వెళ్ళడం యిదంతా లేనిపోని బెడద ఇలాగే కానిద్దాం "

"ఔనౌను " మరో సహాధ్యాయి అన్నాడు "వాళ్ల నాన్నగారు ఏమైనా పూర్వకాలం మనిషైతే ఇహ చెప్పక్క ర్లేదు. మన వీపులు విమానాలే!"

"నీకా భయమక్కర్లేదులే. ఆవిడ కసలు నాన్నగారే లేరు!" కంఠంలో హేళనగా మిళితంచేసి ధ్వనింపజేస్తూ కృష్ణదెస తిరిగి కొంటెగా నవ్వాడు సారధి.

"ఓ! సారీ! నాకా సంగతి తెలియనే తెలియదు " బాధ ప్రకటిస్తూ మెల్లని స్వరాన అన్నాడు మురళి. "క్షమించండి బృందా!" అంటూనే బృంద ఖిన్నవదనం చూచి ఖంగారుగా సారధి దెనతిరిగి, అంతలోనే వాళ్ల కొంటెనవ్వులు చూచి

వాటి ఆంతర్యం గ్రహించలేక, ఏమీ పాలుపోక తల ఒంచుకుని వయొలిన్ శృతి సరిచేయసాగాడు

ఆనాటి రిహార్సల్సు ముగిసి బృంద నిష్క్రమించిన పిమ్మట మురళి సారధిని అడిగాడు "పాపం ఆ అమ్మాయికి తండ్రి లేరా? మరి చదువెలా సాగుతోంది? కాస్త కలిగిన వాళ్ళేనేమో! వేషభాషలు బాగానే వుంటాయి."

"ఎం భాయీ!" తల తమాషాగా ఎగరేస్తూ కన్ను గీటాడు సారధి "బృందపైన శ్రద్ధానక్తులు ఎక్కువై పోయాయేం?"

అనుకోని ఆ విసురుకు నిర్ఘాంత పోయి అవాక్కుగా నిలబడిపోయాడు మురళి.

"నీకు తెలియదేమోలే బ్రదర్ ఈ సంవత్సరమే క్రొత్తగా వచ్చావ్ కదూ మరి!" అంటూ అదోకమాదిరిగా నవ్వాడు సారధి కృష్ణ శృతి కలిపాడు "అటు వంటి వాళ్ళకు నాన్న వుండడు!" అంటూ విరగబడి నవ్వాడు.

"ఛ, నీకు చెప్పటం రాదు. అడుక్కునే వాళ్లకు అరవయ్యారు కూర లన్నట్టుగా-బృందలాంటివాళ్లకు ఒక్కడే నాన్నకాదు!" అంటూ సవరణచేసి తన మాటలకు తానే బిగ్గరగా నవ్వుకున్నాడు.

"పోనీలే మనకెందుకు!" మనసున చాలా అప్రియంగాతోచి సంభాషణను త్రుంచివేశాడు మురళి.

రిహార్సల్స్ జరిగినన్నాళ్ళూ కూడా కృష్ణ, సారథి వగైరా బృందం ఏవేవో కొంటెమాటలనడం, బృంద చిన్నబుచ్చు కోవడం చూస్తూనేవున్న మురళి మనస్సు కలుక్కుమనేది

ఒకటి రెండుసార్లు సారధిని చాటుగా హెచ్చరించి చూచాడు "చూడు సారధీ! ఆఅమ్మాయి గతచరిత్ర ఏమైనాకానీ... ......కాని మనలాగే ఆవిడ కూడా యిక్కడ చదువుకుంటోంది మనం అలా నొప్పించటం భావ్యంకాదు "

"పోవోయ్!'' ఏ మాత్రం ఆలోచించ కుండా త్రోసిపారేశాడు సారధి ''ఇటు వంటి విషయాలలో కలుగజేసుకోవడం, ఒకరి దారికి అడ్డురావటం అంతమంచిది కాదు. ముందే చెప్తున్నాను ''

మురళి ఆగ్రహావేశు డయ్యాడు. ''బృందను అవమానించకుండా గౌర వంగా—సఖ్యంగా వుండమని నేను చెప్తే నువ్వు యింకేమేమో మాట్లాడతావేం సారధీ? నీ సవాలుకు నేనేమీ బెదిరిపోను. ఆ అమ్మాయి స్టూడెంట్స్ మధ్య స్టేజీ ఎక్కలేనని భయపడ్తూంటే, ఎవ్వరూ ఏమీ అనకుండా చూచేపూచీ నాదని భరోసా చెప్పి ఒప్పించాను."

"అహాహా, ధీరుడవు! అయితే చూడు నీకు చాతనైతే. అడ్డమైనచోటల్లా గజ్జెకట్టి ఆడేవాళ్లకు కాలేజి స్టేజిమీస్తే బెరుకు వచ్చిందా? అందుకు నువ్వు ధైర్యంచెప్పి అండగా నిల్చున్నావా? వహ్వా!"

సారధి ధోరణి చిరాకెత్తించినా, తననుతాను సంబాళించుకున్నాడు మురళి "చూడు సారధీ నేను చెప్పదలచుకున్నదేదో చెప్పాను, ఆపైన నీ యిష్టం స్టేజి ఎక్కటానికి భయపడ్తున్నామేను మనం రిహార్సల్సులోనే హడలగొట్టేస్తే అసలు ప్రోగ్రాం మొదటికే ముప్పు వస్తుందేమో! అది ఆలోచించుమరి బృంద ప్రోగ్రాం కేన్సిలు చేస్తే ప్రిన్సిపాల్‌గారు అసలు విషయం ఆరాతీయక మానరు. నేను చెప్పకా, తప్పదు!"

"ఏం, బెదిరిస్తున్నావా?" మంద కరిన స్వరంతో అడిగాడు సారధి ఎగాదిగా చూస్తూ "నిన్ను కాలేజి యూనియన్ సెక్రెటరిగా నిలబెట్టి నెగ్గించింది మేమన్న సంగతి మరచిపోకు."

"అబ్బబ్బబ్బ. ఊరుకొండొయి మధ్యన మనలో మనకి కొట్లాటదేనికి?" కృష్ణ కలగజేసుకున్నాడు "నువ్వూరుకో మురళీ సారధికి నేను చెప్తానుగా?" అంటూ సర్దజూచాడు.

"మూర్ఖులతో వాదించి లాభంలే" దని గ్రహించిన మురళి మరి మాట్లాడలేదు. "వీరి వ్యాఖ్యానాలకు కారణమేమై వుంటుందీ? బృంద కుటుంబ చరిత్ర మంచిదికాదా."

ఆ సాయంత్రం బృంద యింటికివెళ్లే దారిలో కలిసి, అదేమాట అన్నాడు "మిమ్మల్ని ఈ ప్రోగ్రాంకు అనాలోచితంగా ఒప్పించానే అని బాధపడు

తున్నాను బృందా వాళ్ళింత మూర్ఖులని నేను అనుకోలేదు."

తన విశాల నేత్రాలతో మురళి వైపొక్కసారి చూచి కనులు వాల్చేసింది బృంద

ప్రశాంతమధురమై, విశాలమనోజ్ఞమై అందాలు చిందే ఆ కనులు, మనసులో ఏదో అనిర్వచనీయమైన కలవరాన్ని రేకెత్తించగా, చూపులు మరల్చుకుంటూ అన్నాడు "మీరిక రావడం మానేయండి. ప్రోగ్రాంలో మీ నాట్యం క్యాన్సిలు చేస్తాను. ప్రిన్సిపాల్ గారికీ, లెక్చరర్ గారికీ నేనెలాగో నచ్చచెప్తాను."

విశాలనయనాలను విస్మయంతో మరింత విశాలమొనరించుతూ అన్నది బృంద. "అదెలా సాధ్యం? అయినా బాగుంటుందంటారా, యింత వరకూ వచ్చిన తర్వాత మాట తప్పటం?"

"మాటకోసమని వ్యక్తిగౌరవాన్ని వదలు కొంటామా? ప్రిన్సిపాల్ గారి ఘనత నిలబెట్టటంకోసం, యింకా కళాశాలకేదో ఒరగబెట్టడం కోసమూ మీరు బాధపడుతూ,మీ ఆత్మగౌరవాన్ని చంపుకొని దౌర్భాగ్యుల మాటలను భరించ నక్కరలేదు." ఆవేశంగా అన్నాడు మురళీకృష్ణ.

బృంద వదనంలో కృతజ్ఞత మెరసింది. "మీకు నాపై వున్న అభిమానానికి నిజంగా ఎంతైనా కృతజ్ఞురాలిని, మురళీ గారూ. మీ లాంటివారు కనీసం కళాశాలకు నలుగురైనావుండే విద్యార్థినులు స్వేచ్ఛగా, హాయిగా చదువుకోగలరనుకుంటాను."

అధోవదనుడై నిలబడివున్న మురళి ఏమీ అనలేదు తిరిగి.

"చూడండి " బృంద గళంలో స్థిర గాంభీర్యత తావుచేసుకున్నది "మీలాగే నేనూ అనుకున్నాను మొదట. కానీ తర్వాత అన్పించింది—ఇటువంటి సిగ్గుమాలిన కుక్కల మొరుగులకు బెదిరిపోతే ఇంకా పీడించుతారేమోనని అందుకే వాళ్లకోసమని ఆడినమాట తప్పకుండా కార్యక్రమం చివరివరకూ కొనసాగించాలనే నిశ్చయించుకున్నాను. అవనీయండి వాళ్లని వాళ్ల అల్పత్వమే బయటపడుతుంది, అంతేగా?"

"మీకామాత్రం ఆత్మస్థైర్యం వుంటే ఇక అనుకొనేదేముంది. కాని నావల్ల అనవసరంగా మీరు మొగమాటంలో యిక్కుపోయారే అని బాధపడ్తున్నాను.

"ఫర్వాలేదు. మీరనవసరంగా మథనపడకండి। ఇటువంటివాటిలోనే వ్యక్తుల అసలైన ఆంతర్యాలు బహిరంగమయ్యేది వాళ్ల నీచబుద్ధిని వాళ్లనే ప్రదర్శించుకోనీయండి ''

ఇద్దరూ చెరోవైపూ చీలిపోయారు.

రాత్రి భోజనానంతరం పారిజాతగంధం తెరచిన బృంద మనసు పారంపై నిలువలేకపోయింది. ఆమెకు తెలియకుండానే మనసు మురళిని తలచుకొని రసార్ద్రి

మైంది. ఆ వచోవైఖరి, ఆ సరళ స్వభావం, ఆ గంభీరవ్యక్తిత్వం, ఆ చిరు దరహాసం, అన్నిటినీమించిన ఆసుందర రూపం—లక్షలలో కాదు, కోట్లలో ఎన్న దగిన వ్యక్తి! సాటి ఇతర సహాధ్యాయు లందరిలో నుండి అతడొక్కడూ ఎంత ప్రత్యేకంగా కన్పించుతాడు! ఎంతటి మృదులమైన మనసు!''

అంతలో ఆమెలోని యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం మేల్కొంచింది. "ఛ, ఏమిటీ అనుచితపు ఆలోచనలు! అత డెవరు నేనెవరిని? పట్టి బలవంతాన మనో నిగ్రహం పొందింది.

## 6

ప్రదర్శన అనుకున్న కంటె ఘనంగా జరిగింది బృంద నాట్యం ప్రదర్శనకొక ప్రత్యేకత

ఇంత చక్కటి కళామూర్తిని సాటి వారంతా ఎందుకంత చిన్నబుచ్చుతారు. ఎందుకీమెనంత నిరుత్సాహపరచుతారు! ఆనాటి సారధి మాటలను బట్టిచూస్తే ఈమె తల్లిచరిత్ర మంచిదికాదేమోనన్పి స్తున్నది! అయినా ఈ కొంటె విద్యార్థుల మాటలలో అర్థం కూడానా, కానీయ్! నా కెందుకీ చెడు ఆలోచనలు.

మురళీకృష్ణ ఎంత ప్రయత్నించినా బృందను గురించిన తలపులను మనసు నుండి పారద్రోలలేకపోతున్నాడు అడు గడుగునా ఆమె మనసున దోబూచులాడు తుంది నిండుగా అలంకరించుకొన్న ఆమె సుందర ప్రతిమ తన చుట్టూ తిరుగుతూ నాట్యమాడుతున్నట్లు అనుభూతి జెందుతాడు. పదేపదే ఆమెను కలుసుకొని మాట్లాడాలని మనసు ఉరకలు వేస్తూంటుంది. ఆమె సుందర సుకుమార వదన దర్శన కొరకై కనులు తహతహలాడుతుంటాయి.

'ఏమిటిది? ఎందు కామె తలపోతలు నాకు?' ఆశ్చర్యంతో తనలో తానే తర్కవితర్కాలు జరుపుకున్నాడు చివరకు మనసు సమాధానం చెప్పింది.

"అంటే.. అంటే ఆమె కొరకు అను నిత్యం తహతహలాడుతున్నానంటే అర్థం...ఆమెను నేను ప్రేమిస్తున్నా నన్నమాట!"

'ఇదా నా మనసు!' అని అచ్చెరు వందాడు తనకు తానే.

'మీ నాట్యం చాలా బాగుంది' అని బృందను అభినందించుతూ మాట్లాడాలని నిరీక్షిస్తూన్న మురళికి ఆ రోజు చక్కటి అవకాశం లభించింది.

( సశేషం )

---

**Printed and Published by A Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor : "CHAKRAPANI"**

